# విరగని విగ్రహాలు



ర చ న:
హిరాలాల్ మోరియా

అ ను వా ద ం:
కొలిపాక మధుసూదనరావు

ప్రజా ప్రచురణలు • ఏలూరు (A. P.)

ప్రజా ప్రచురణ

ప్రథమ ముద్రణ

1966 ఆగష్టు

మేలు ప్రతి రు 5-00

సాదా ప్రతి రు 4-00

ముద్రణ :

పట్టాభిరామా ప్రెస్

ఏలూరు

# విరగని విగ్రహాలు

ఐదు సంవత్సరాలనుంచీ అదేపనిగా చిరునవ్వు నవ్వుతూ తనని ప్రతినిత్యం చూస్తూవుండే కమలారాణిని గురించి ఆలోచించక తప్పనిసరి అయిందిరాజుకు.

కమలారాణి కలెక్టరేట్‌లో ఆఫీసు సూపరెంటెండెం టుగా పనిచేస్తోంది. అత్తవారింటికి కొత్తగా వెళ్ళే పెళ్ళి కూతురులా ముస్తాబై ప్రతిరోజూ సరిగా పదిగంటలకి ఇంటి నుంచి ఆఫీసుకు బయలుదేరుతుంది. మార్గమధ్యంలో ఒక్క సారైనా అలా కన్నెత్తి దేన్నీ చూడకుండా సరాసరిగా వెళుతుంది. ఆఫీసు కార్యక్రమాలు నిర్వహించుకొని కచ్చి తంగా సాయంత్రం ఐదుగంటలకి తిరిగి యింట్లో ప్రవేశిస్తుంది.

ఇంట్లో సాయంత్రం ఆరుగంటలనుంచీ మిత్రులూ, అతిథులతో కులాసాకబుర్లు ప్రారంభమవుతాయి. తోటి ఆఫీసుక్లర్కులూ, చిన్నచిన్న ఆఫీసర్లూ, స్నేహితురాళ్లూ అంతా రకరకాలవాళ్లూ సాయంత్రంపూట హాజరువుతోం టారు, ఏవో పిచ్చాపాటీ కబుర్లు కాసేపు, మరికాస్సేపు చదు రంగం, క్యారమ్సు ఆటలూ మొదలైన వినోదాల్తో కాలం గడుస్తుంది. రాత్రి ఎనిమిది గంటలవరకు జీవితంలో యేమాత్రం చీకూ చింతా అనేది లేకుండా సంతోష సౌఖ్యా లన్నీ అనుభవించడానికి ఏకైక ప్రతినిధిగా ఆవిడ జన్మించిం దని అనిపిస్తుంటుంది.

ప్రతిరోజూ కమలారాణి యింటిముందుగానే రాజు నడవ్వాలసివస్తుంది. అతను వచ్చే సమయానికి సరీగ్గా ఆవిడ ఒక ప్రత్యేక స్థానంలో నిలబడి చిరునవ్వుతో కనిపిస్తుంది. ఆచిరునవ్వు వెళ్ళినంతదూరం వెంటబడితరుముతున్నట్టుంటుంది రాజుకు, ఆవిడచూపులు అతన్ని సవాల్ చేస్తున్నట్టు అని పిస్తుంది. ఇవన్నీ గమనిస్తూ యేమాత్రం అంటీ అంటనట్లు మానంగా తన త్రోవను తాను వెళ్ళడం అలవాటు చేసు కున్నాడతను. కాని ఇవాళెందుకో ఆవిడ తనని తదేకంగా చూస్తూ చిరునవ్వు చిలకరిస్తూంటే అతనికికూడా నవ్వాలని పించింది. ప్రయత్నించి ఆగకుండానే రాజు పెదవులమీద అకస్మాత్తుగా చిరునవ్వు మెరసింది.

"మీకావ్యాలూ, రచనలూ, మేముకూడా చదు వుతూనే వుంటాం. మాతో రెండుమాటలు మాట్లాడవచ్చు, స్వీయపరిచయం అవసరమా?" మెల్లగా ప్రశ్నించింది రాణి సన్నని కంఠంతో.

"అవసరంలేదు. మీరునాకు పరిచయమే" అన్నాడు రాజు.

"మర్యాదకోసం చెబుతున్నారు కాని నిజంగా నేనెవరో తెలీదనుకొంటాను. తెలిస్తే ంత ప్రతీక్ష అవసరం లేకపోయేది."

"మీరు ప్రతీక్షించవలసిన కారణం నాకుఅర్థం కావ టంలేదు; ఎందుకో!"

చదువూ సంస్కారం అభిజాత్యంకల ప్రముఖ రచయితతో పరిచయం కల్పించుకోవాలని యెందుకుండదు చెప్పండి?"

రాజు ప్రత్యుత్తరం లేకుండగా ఆశ్చర్యంగా ఆవిడ వైపుచూస్తూ నిలబడ్డాడు.

"విశాలహృదయంగల రచయితలై వుండికూడా మీతో యెవరన్నా రెండుమాటలు మాట్లాడ దల్చుకుంటే అవకాశం యివ్వరూ? ఇది చాలా అన్యాయం కాదూ; చెప్పండి, ఎన్నోసార్లు మీకు కబురంపాను కాని మీరు నా ఆహ్వానాన్ని నిర్దాక్షిణ్యంగా తిరస్కరించారు. భావాలు ఎంత సుకుమారమైనవైనా మగవాళ్ల హృదయం మాత్రం కఠినంగానే వుంటుంది. స్త్రీలంటే మీకెందు కింత అయిష్టం...?"

"అబ్బెబ్బె! అలాంటి దేమీలేదు కమలారాణీ! కబుర్లతో, వినోదాలతో కాలక్షేపం చేసేంత తీరిక యీ బ్రతుక్కి యెక్కడిది? జీవితం నిరంతరోద్యమం అన్నమాట అక్షరాలా నాపట్ల ఋజువౌతుందనుకో।"

"కావచ్చు! కానీ, అది బ్రతకడంకాదు. బ్రతుకును వేలంవేసి ప్రపంచానికి అమ్మడమే అవుతుంది. మనిషి సుఖపడ దల్చుకుంటే కావలసినదంతా చేయగలడు. కొంచెం ధైర్యంమాత్రం అవసరం. మీరు రచయితలు. నాకంటే అన్ని విషయాలూ మీకే తెలుసు. నేను మీకేం

సలహా ఈయగలను? అయ్యో! నా తెలివి!? మిమ్మల్ని అలానే నిలబెట్టాను, లోపలికి రండి, ఎంతసేపలా నిలబడతారు?"

రాజు తిన్నగా ఆ యింటి బయటి హాల్లోకి ఆవిడతో పాటు వెళ్లాడు.

"టీ సిద్ధంగావుంది. పుచ్చుకోండి,"

"కృతజ్ఞుణ్ణి"

కమలారాణి ఎంతో ఆత్మీయంగా చనువుగా సంభాషిస్తోంది. ఆ మాటల్లో ఒకవిధమైన సానుభూతి రాజుకు గోచరించింది. ఆవిడ టీ యిస్తానంటే వద్దనలేక తీసుకున్నాడు.

కమలారాణి హాలులోని నిలువుటద్దంలో తన్ని తాను చూచుకుంటూ, "రాజ్, నీకోసం యెంతగా నిరీక్షిస్తున్నానో నీతో మాట్లాడాలని యెంత తహ తహ లాడుతున్నానో నీకేం తెలియదుగదా! నీవు సృష్టించే కథా శిల్పంలో నిరాశ ఛాయామాత్రంగానైనా గోచరించలేదు. జీవం తొణికిస లాడుతుంటుంది. ఆనందకరమైన జీవితానికి మీ కథాశిల్పం ప్రతిబింబం అనిపిస్తుంది. కాని మీ వ్యక్తిగత జీవితంలో చాలానిరాశ కనిపిస్తుంటుందేం? శిల్పికీ, శిల్పానికీ, ఇంతటి వైవిధ్యం యెలాచేకూరింది?" అని ఒక్క చిరునవ్వు హేలగా నవ్వింది. ఇది రాజుకు సూదితో గుచ్చినట్టయింది.

"మానవ జీవితం మహాకఠోరమైంది కమలారాణీ!" అన్నాడు.

"జీవితం మహాకఠోరమైందని మీరు ఎందుకనుకుంటున్నారో నాకైతే తెలీదు. ఇష్టమైతే అలానే అనుకోండి. కాని, ఈ విషయంలో ముందుముందు మీరు మీ దృక్పథాన్ని తప్పక మార్చుకోవలసి వుంటుంది.

రాజన్ మౌనంగా చిరునవ్వునవ్వుతూ అంతా వింటూ పోతున్నాడు. "ఏదన్నామాట్లాడరాదూ రాజూ! మౌనంగా కూచోకపోతే?"

"నేను మాట్లాడ్డానిక్కాదు. వినడానికే వచ్చాను. నీవు మాట్లాడుతుంటే మధురంగా వుంది... కానీ—"

కమలారాణి హృదయంగమమైన మాటలూ, నిండైన ఆవిడ విగ్రహం, రాజుని ముగ్ధుణ్ణి చేసాయి. తదేకంగా చూస్తూ చిరునవ్వు నవ్వడంకంటే తు రేమీ మాట్లాడలేక పోయాడు.

"అందమైన నీ చిరునవ్వుని, నాలో నిలుపుకోవాలని వుంది, రాజా!"

దీన్ని నిలుపుకుంటే నీవు సంతోషంగా వుండగలవు కమలా! ఆ పని చేయకు!"

"ఎందుకు? ఈ నవ్వు వెనుక యేమైనా అగాధ చరిత్రలూ, తుఫానులూ వున్నాయేమిటి?"

"అన్నీ వున్నాయి. సముద్ర గాంభీర్యం, ఆకాశం, ఔన్నత్యం వీటికన్నా యెక్కువైనవే వున్నాయి."

"పరవాలేదు. ఎన్నివున్నా నాకిష్టమే. వీటి అన్నిటికీ మధ్య నన్ను నేను విస్మరించుకోవాలనుకుంటాను. ఈ విషయంలో నన్ను నేను దాచుకోవాలనుకుంటున్నాను."

"ఎంత అమాయకురాలివి కమలా నీవు ?"

"నాముఖం అలా కనిపిస్తూవుండవచ్చుగాని, నేను నిజంగా అమాయకురాలిని గాదు రాజా ? నీవు కమ్మంటే అవుతాను. అయి అలానే వుంటాను. ఇదే నా హృదయాకాంక్ష. కాని, యీ ప్రపంచ ప్రదర్శనశాలలో నగ్నంగా సుఖపడవలసివచ్చి, సహజగుణం స్థానంలో అభిలాషికభావం యేర్పడుతుంది. ఇలా బ్రతికే వారిని చూచి నేను పరిహాసించిన రోజు లున్నాయి, కాని ఆ కాలం గడచిపోయింది. జీవిత మైదానంలో అడుగు పెట్టగానే నా మంచితనం అంతా మటుమాయమైపోయింది. జీవితం కోసం పాతభావాలన్నీ వదలి పెట్టవలసివచ్చింది. ఆకలితో అలమటిస్తూ కాళ్ళరిగేటట్టు వీధుల్లో తిరిగి తిరిగి కుక్కలా మరణించడంకన్నా ఇలా బ్రతికి చావడమే నయంకాదూ?"

"ఇంతగా ఆవేశ పడుతుండడానికి నీమీద యే కష్టం విరుచుకపడింది ?"

"ఏ కష్టం నామీద విరుచుకు పడలేదని ? ఏ అత్యాచారం నామీద జరగలేదనీ ? జీవితాలని వాస్తవికంగా చిత్రించే నీలాంటి ప్రముఖ రచయితముందు నా అనుభవాలు చెప్పుకోవడానికి నాకేమీ అభ్యంతరంలేదు. సంతృప్తికరంగా వుంది. కాని మీకు వినడానికేమన్నా అభ్యంతరమా ?"

"అభ్యంతరం లేదు కమలా ! నాకే ఆ అవకాశం లభించడం, ఇంకా అదృష్టంగా భావిస్తున్నాను."

"నా శరీరంలో ఇవాళ ఒక కొత్తరకం ఉష్ణం కలుగు తోంది రాజూ! ఇంతకుక్రితం యిలా యెన్నడూ జరుగలేదు. నా శరీరంలో ఉష్ణం ఆరిపోయింది. అత్యున్నతమైన హిమాలయశిఖరాల్లో పేరుకున్న మంచుకూడా, ఈ నా ఉష్ణం హరించలేక పోయేదే గాని ఈ జీవన జంజాటం దాన్ని హరించివేసింది. ఈ ఉష్ణాన్ని ధనంతో కొనాలని కొంతమంది తాపత్రయపడ్డారు. జల్సాజీవితానికి ఆశపెట్టి పెండ్లిచేసుకుంటామని మోసంచేసి, ఉద్యోగం యిప్పిస్తామని ఉవ్విళ్లూరించి, ఈ నా శరీరంలో వేడిని అనుభవించాలని పన్నాగాలు పన్నారు. వేడినశించి నేడు మంచులా చల్లగా వెలువడుతున్న నా యీ నిశ్వాసాలనికూడా ఉష్ణంగా భావించి చాలామంది నా సహచరులు ఆశపడుతున్నారు. అయినప్పటికీ ఈ నా జీవితంనుంచి నేను భయపడటం లేదిపుడు. నా చరిత్రవింటే నీవు నన్ను బహుశా దూషిస్తావో లేక భూషిస్తావో కాని నాకంత యిబ్బంది లేదు..."

"రాజా! ఈ ప్రపంచంలో స్త్రీగా జన్మించి బ్రతకడం చాలా కఠినం, నా కథంతా నీకు వినిపిస్తాను. వీలైతే నీవు ఒక కథగా వ్రాయవచ్చు, కాని కథ చదివి ప్రపంచం నా మీద జాలిపడక పోవచ్చని నాభావం. సానుభూతి అటుంచి పైపెచ్చు అసహ్యం కలుగవచ్చు, చూడు! నేడు ప్రపంచం అత్యంత శ్రద్ధాసక్తులతో కళాత్మక దృష్టితో సౌందర్య నిలయంగా పరిగణించే తాజ్‌మహాల్ చాటునగల షాజహాన్ చక్రవర్తి హృదయభారం యెవరు అర్థం చేసుకోగలరంటావ్? లైలా ప్రేమ హృదయం

లోతుల్ని యెవరర్థం చేసుకుంటున్నారు. శైలా ప్రేమ నేడు పరిహాసపాత్రం కావడంలేదూ? ప్రతిచరిత్ర ఈ ప్రపంచంలో వినోదకాలక్షేపానికి మాత్రమే నేడు అక్కరకు వస్తోంది. అది రక్తంతో వ్రాయబడిందైనాసరే, యీ కృతఘ్న ప్రపంచంలో వినోదకాలక్షేపాలకే ఉపయోగిస్తుంది. అందుకే నేనుకూడా నా వినోద-విలాసాలకి అన్నీ చేయదల్చుకున్నాను కేవలం వినయం, సంతోషంతోనే జీవితం సాగదు. ఇంకా నిర్వహించవలసిన కార్యక్రమాలు చాలా వుంటాయి. హృదయం రోదిస్తుంటే దాన్నలా రోదించనివ్వు! ఆత్మ క్షోభిస్తుంటే అలాక్షోభించనివ్వు! పెదవులు చిరునవ్వుతో వుండాలి. శరీరంలో సౌకుమార్యపు వంపులుండాలి. స్నేహితుల నిమిత్తం ఉష్ణంకావాలి. లేకుంటే యీ ప్రపంచం ఒక్కతన్నుతన్ని పడద్రోసి, నాశనం చేస్తుంది. ఈ తాపులు తినే బలమూ, ఓపికా ప్రస్తుతం లేవు ఊరిక్కే పిచ్చిదానిలా ఊహలూ. భావాల్తో బ్రతకడం నాకు గిట్టదు. ఈ ప్రపంచం నైతికవ్యవస్థయే తారుమారయింది. 'ఇది తెలుసుకొనికూడా కావాలని యింకా పుస్తకాలలోని నీతిసూత్రాల ప్రకారం బ్రతకాలనుకొని యత్నించడం నిప్పులమీద నిలబడి బ్రతకడంలాంటిదే, ఓర్పుతో ఒకవేళ బ్రతికినప్పటికీ ఇలాంటి వ్యక్తులకి పిచ్చాసుపత్రిలో తప్ప మరోచోటు నివాసానికర్హంకాదు. కాని దీన్నికూడా నేనంతగా నమ్మలేకపోతున్నాను. వెలుగు మాయమై అంధకారం ఆవరించిందనీ, రాత్రి గడచి పగలు వచ్చేసిందనీ ఈ విషయాలు కూడా నేనప్పుడప్పుడు విస్మరిస్తూ వుంటాను. నాకే విషయాల్లోనూ సానుభూతిలేదు. దుఃఖం అంతకన్నాలేదు. నేను మరణిస్తే

నా అంత్య సంస్కారంకోసం అంతా చందాలు వేసుకుని డబ్బుపోగుచేయడానికాని, శవాన్ని కప్పడానికి యెవరో ధర్మాత్ములు పాత చిరిగిన వస్త్రం ధర్మం చేయరా అని నేను సుతరాం యిష్టపడను."

కమలారాణి ఉపన్యాసంలో మునిగితేలుతున్న రాజు టీ పూర్తిగా చల్లారిపోయిందన్న విషయం గుర్తించక ఇంకా వూదుకొంటూనే తాగుతున్నాడు పాపం! అలవాటు అతన్ని అలా చేయించింది.

"అవేమిటి? టీ చల్లారిపోయినా అలా వూదుతోనే ఉన్నారే?"

"అరె! నేనిది గమనించనే లేదు!"

"ముక్కుసూటిగా బ్రతుకును నడుపుకోడానికి సూత్రాలున్నాయిరాజా! తన సర్వస్వాన్ని స్మరించి జీవితం గడుపుకుంటూ పోవాలి. అప్పుడే బ్రతుక్కి రుచి యేర్పడుతుంది. మంచీ చెడు అన్నిటినీ మరచిపోగల్గుతాం. జీవితాన్ని ఒక తత్వశాస్త్రంగా మార్చవద్దు, ఏదో ఉజ్వల భవిష్యత్తున్నదన్న వెర్రి ఆశల్తో నాశనం చేసుకోవడం తెలివితక్కువ, సుందర స్వప్నాలనుకంటూ ఆత్మవంచన చేసుకోరాదు. ప్రపంచం మహాదుష్టమైంది. కథలు వ్రాసి లక్షాధికారి నవుతాననినీ, కార్లలో షికార్లు చేస్తాననినీ నీవెన్నడూ అనుకొని ఆశించకు. ప్రతిఅడుగూ యిక్కడ ప్రమాద భూయిష్టమ్. తగిలినగాయాలని మాన్పుకొంటూ ముందుకుపోవాలి. బ్రతకడానికి అవసరమైన ప్రతిపనీ చేయాలి. వీలైనంతవరకు నిగ్రహంతో మర్యాదకి మచ్చరాకుండా చూచుకోవాలి, విచా

రం, దుఃఖం వాటితో యేపనీ సాగదు. జీవితమే కళ, కళకోసమే జీవితం అనే మాటలు పచ్చి మోసం!-"

"నీవేంమాట్లాడుతుందీ ఆ మాటలఅర్థం యేమిటైంకీ అసలు యెందుకు మాట్లాడుతుందీ కూడా నేను గ్రహించలేక పోతున్నాను, కమలారాణీ!"

"అర్థం అవుతాయరాజా! రండి, ఇల్లు చూద్దరుగాని, "అంటూ అతనిచేతిని చేతిలోకి తీసుకుని విశ్రాంతిగది లోకి ప్రవేశించింది కమల. రాజు మౌనంగా ఆవిడ వెంట నడుస్తున్నాడు.

గది బాగా అలంకరించబడి ఎయిర్ కండీషన్ చేయబడినది. గోడలకి నాల్గువైపులా అందమైన చిత్రమైన ఫొటోలు వ్రేలాడ తీయబడివున్నాయి. రెండు మెత్తనిసోఫాలు. ఒక మూలబల్లమీద చిన్నస్టేజులో ఏసుక్రీస్తు దంతపువిగ్రహం. దానిమీద చల్లినపూలు, వెలుగుతున్న కొవ్వొత్తులున్నాయి.

"ప్రశాంతంగాకూర్చో రాజూ!" అంటూ ఆవిడ పనిమనిషిని పిలిచింది. ఎవరైనావస్తే యింట్లోలేరని చెప్పమంది. పనిమనిషి వెళ్లిపోయింది.

"మీరు కొంచెంవిశ్రాంతి తీసుకుంటూ వుండండి. టిఫిన్ పట్టుకొస్తాను. తరువాత యిద్దరంకలిసి యిక్కడే భోంచేద్దాం!"

"వద్దు, ఇప్పుడేమీ తినాలని పించడంలేదు. క్షమించాలి!" "ఈఅభిమానం సాగదులెండి, తప్పకుండా తినాలి. సిగ్గుపడవలసిందేముంది. నా మనసు విప్పి మీ

ముందుంచానుగద. మీ కెందుకీ దాపరికం? సిగ్గు? ఇంత ఫలహారమే తినలేకపోతే ఇకనన్నెంత తింటారు." కమలా రాణి పెద్దగానవ్వుతూ అంది. రాజు మౌనంగా కూర్చున్నా డు. తనలోతనే ఆలోచిస్తున్నాడు. ఈ స్త్రీ గుండెల్లో ఎన్ని తుఫానులు, ఎన్ని భూకంపాలున్నాయో ననీ ఈవిడ చరిత్రలో, ఎంతదుఃఖం ఎంత కష్టభారం వుందోననీ పరిశీలిస్తు న్నాడు. అతనికి ఆలోచించిన కొద్దీ ఆశ్చర్యం వేస్తోంది. ఎంతటి సజీవహృదయం? ముఖంలో ఆవంతైనా చింతారేఖ లేదు. నవ్వుతోంటే ప్రపంచమంతా నవ్వుతోన్నట్టుంది.

కేకులూ, పళ్లూ, తదితర ఫలహారాల్తో నింపిన పళ్లేన్ని తెచ్చి రాజుముందు టేబిల్ మీద వుంచింది కమల.

"ఆలోచించకు రాజ్! ఆలోచన మనస్సుకి శత్రువు. దాన్ని వదలిపెట్టు... ...తినాలి... ...ఆడాలి... ...పాడాలి ... ...నవ్వాలి, వృధాగా యెందుకాలోచిస్తావ్? కనీసం వున్న స్థితిని కాసేపు మరచి పోవడానికైనా యత్నించాలి."

"తింటాను"

"మళ్ళీ యేమిటాలోచన? ఈ మాయిల్లేం బాగా లేదూ? అంటూ వినయసూచికంగా తలాడిస్తూ అతని వీపును చేత్తో నిమురుతూ కమలారాణిఅంది.

"తినరాదూ? నేను తినిపించనా మరి?"

కమలారాణి కేకును అకస్మాత్తుగా రాజు నోటికి అందించి నవ్వింది. రాజుకూడా నవ్వాగలేదు. నవ్వేశాడు. కడుపుబ్బిందాకా నవ్వాడు.

"చూడు! నవ్వుతూంటే ముఖం యెంత అందంగా వుందో! ముద్దెట్టుకోవా లనిపిస్తుంది."

"మనస్సు ఇంత తొందరగా ఒకరిమీద ప్రసరిస్తుందా?"

"మనుస్సు దేముందంటావు? ఇదో ఆటవస్తువు. ఒక్కో సమయంలో ఒక్కోరిచేతికి అందుతూవుంటుంది ఈ ప్రపంచము, దీన్ని నవ్వనియ్యడం యెప్పుడిక. యీ హృదయం కోసమే ఇన్నికష్టాలూ భరించవలసి వస్తోందికదూ? రాజు! అయినా ప్రపంచం దృష్టిలో మనం చెడ్డవాళ్ళ మౌతాం"

ఇలా ఎంతోసేపు కబుర్లతో నడిచింది కాని రాజుకు లేచిపోవాలనిపించడంలేదు, ఆవిడ ప్రతిభంగిమంలో అత్యాకర్షణ. ప్రతిమాటలో ఒకధీమా! జగత్తంతా ఆవిడకొరకు సృష్టించబడ్డట్టుగావుంది. ఇంకా ఈవిడ చరిత్రలో ఎన్ని కథాధ్యాయాలున్నాయో తెలియుటలేదు. ఈ జీవితంలో ఆవిడకి యే కొరతలేదు. ఉద్యోగం, సౌందర్యం, యౌవ్వనం స్తోత్రపాఠకబృందం --- ప్రాణాలిచ్చే ప్రేమికులు అచ్చమైన మిత్రులు ఒకటేమిటి అన్నిహంగులు వున్నాయి— — స్వతంత్ర పక్షిలా రెక్కలు విప్పుకొని ఆకాశంలో ఎగిరేలావుంది కమలారాణి— — — రాజుహృదయం స్థైర్యం కోల్పోయింది. ఆవిడ సంపూర్ణచరిత్ర వినాలన్నవినూత్నమైన ఆకాంక్ష అధికమైంది.

"కమల్ ; ఇంకానీవు చాలా చరిత్ర చెప్పవలసివుంది. వినాలని హృదయం తహతహలాడుతుంది. అసలు నీకీవుద్యోగంఎలా దొరికింది? అంతక్రితం నీవు ఏంచేస్తుండేదానివి ఇదంతా ఎందుకో వినాలనుకుంటున్నాను. నీ జీవితంలో యే

దైనా పాఠంలభిస్తే నేర్చుకోవాలనివుంది. నీ మాటల్లో నిజం వుంది. నీజీవితం నిరంతరం నవ్యప్రసూనం వంటిదే. నీప్రతి మాటవెనుక యెంతో అనుభవం వుంది, అన్నాడు.

"ఇప్పటికి కొద్దికొద్దిగా అర్థమౌతున్నదన్నమాట" కమల పెద్దగా నవ్వింది "నిజంగా నాగతజీవితం అంతానిన్ను చూడగానే మళ్ళీ స్మృతిపథంలో కొస్తున్నది" అంది

"ఎందుకలా వస్తోంది ?"

" నీ ఆకర్షణపట్ల నాకు అమితమైన అభిమానంరాజూ ఎన్నో సంవత్సరాలనుంచి నీకోసం నిరీక్షించు చున్నాను. నీ కథలో యేముంటుందోకాని నా హృదయంలో, జీవితం లోను నాపాటి ప్రభావం వ్యాపించింది పూర్తిగా, ఈవిధంగా నీవు నాకు చిరపరిచితుడవని అనుకోవచ్చు, నీ ప్రభావంకూడా నామీద పూర్తిగావుంది.

నాతండ్రి ఒకానొక జిల్లాఉన్నతాధికారిగావుండేవారు కలెక్టరుగా వున్నంతవరకు వారికి సర్వం వుండేది. ఆ రోజు లలో మహారాజు కుటుంబంలోని వాళ్ళగా జీవించిన మాకు, దేన్నిగురించీ చింతంటూవుండేదికాదు. బళ్ళోకివెళ్ళినా కారు లోనే; ఎండాకాలం రోజుల్లో కాశ్మీరు అప్పుడప్పుడు వెళు తుండే వాళ్ళం. ఒక్కోసారి నైనిటాల్ మహాబలేశ్వరం. సిమ్లాలకూ్కడా వెళుతుండేవాళ్ళం. కోరిందేతడవుగా ప్రతి వస్తువూ మా ముందు ప్రత్యక్షం అవుతూవుండేది. కలెక్టరు గారు సాదించలేని దేముంటుంది. ఒకరకంగా జిల్లా అంతటికీ మహారాజు. నాన్నగారు జీవించి వుండగా అన్నిసౌఖ్యాలు అనుభవించాం. దుకాణాల

నుంచి వరుసగా పట్టుచీరెలు యింటికి వచ్చి వాలు తుండేవి. నాన్నగారి పుస్తకాల్లోంచి వందలనోట్లు జారిపడు తూండేవి. బహుశా ఎంతగొప్ప జమిందారుకైనా ఇంతటి ఆదాయం వుండేదికాదేమో! జిల్లాలోవున్న ఎన్నో జమీలకి ఆయనప్రభువు, ఆయనకేంకొరత? జీవితంలో ఎన్నో దుర్గాలను ఆయన రాజధానులుగా పాలించాడు, బదిలీఅయిన ప్రతిజిల్లానుండీ దాదాపు నెలరోజులవరకూ నజరానాలు లెక్కకుమిక్కిలిగా అందుతుండేవి. వుండేచోట పోయేచోట యెక్కడాఅంతే, మాకేంతక్కువ, కొత్త కొత్త పట్టుచీరలు. చక్కని పాసరక్షలు......చుట్టూ......సరికొత్త........ ఇంకా అవసరమైనవన్నీ దుకాణాలనుంచి వచ్చి పడుతుండేవి.

నాన్నగారు జీవితకాలంలో ఎంతైతే సంపాదించ గలిగారో అంతా ఆయన జీవితకాలంలోనే పోగొట్టుకున్నారు కూడాను. నాన్నగారిని వారించేధైర్యం అమ్మగారికి లేక పోయింది. అక్రమ, అవినీతిమార్గాలు అవలంబించి సంపాదించడమన్న ఆమెకు గిట్టదు. ఈవిషయాలన్నిటికీ ఆవిడచాలా దూరంగావుండేది. భోగవిలాస వస్తువులన్నా, జీవితమన్నా ఆమెకు తగనిరోత, అవినీతి నశించందే, లంచగొండితనం నిర్మూలించని వరకు యిలాంటి ప్రభుత్వం అప్రదిష్ట పాలుగావటం, అటు అమాయికులూ, నిర్దోషులూ అయినవారు-నలిగి పోవడం తప్పదని అమె పూర్తిగా భావిస్తుండేది. లంచ గొండితనం వున్నంతవరకూ జరుగవలసిన వారిద్వారా న్యాయంజరుగదు. వ్యక్తులు అధికారులవల్ల అక్రమలాభాలూ పలుకుబడులు సంపాదించి, పీడకులుగా తయారై భోగాలు అనుభవిస్తుంటారు. అన్నిటికన్నా ఆశ్చర్యకర విషయ

మేమంటే అది మనదేశంలో ప్రభుత్వ ఉద్యోగంఅంటే ఆర్జనకి సాధనగా కనబడుతోండటం. ప్రతివ్యక్తి తన స్వధర్మాన్ని పూర్వవృత్తులనూ వదలిపెట్టి ప్రభుత్వోద్యోగాలకో సంపరుగులు పెట్టడం యెక్కువైంది. మేము నిరుద్యోగులం, మాకు ఉద్యోగాలు చూపించండి, అని వున్నవారూ లేనివారూకూడా ఒకటేకాకిగోల. ఉద్యోగం, సంపాదన ఈరెండే నేటి ధ్యేయాలు. యీ భావం ఒక అంటుజాడ్య రూపంలో విస్తరిల్లిపోతూవుంది.

ఇది చివరకు అత్యంత భయంకరస్థితికి చేరుకుంది. అక్రమంగా సంపాదించిన ధనం కూడబెట్టటమే మర్యాదకీ, శీలసంపన్నతకీ నిదర్శనంగా భావించబడుతోందీ నోజున. నాన్నగారుకూడా ఉద్యోగాన్ని తన స్వంత జాగీర్‌గా తలపోశారు. వీలున్నంతవరకు సంపాదించుకోలేని అధికారి ఒట్టి బుద్ధిహీనుడనీ, గాడిద అనీ ఆయన నమ్మకం, సంపాదించాలి యింకా యింకా సంపాదించాలి. ప్రభుత్వ ద్రవ్యంకూడా కాజేయాలి. ద్రవ్యంలేందే సుఖంలేదు. సుఖంలేని జీవితం నరకం. ఈ సూత్రాలే నాన్నగారి జీవితానికి ప్రాతిపదికలు. ఆయనక్రింద పనిచేసే పెద్ద చిన్న ఉద్యోగులంతా ప్రతినెలా ఏవో మామూళ్ళు చెల్లించుకుంటూనే వుండేవారు. డబ్బిచ్చికొన్న బానిసల్లా మసలుకొంటుండేవాళ్ళు. వారు సృష్టించే సున్నితమైన పరిస్థితులూ వాటి ప్రభావం, ప్రభుత్వంమీాన యెలాంటి పనిచేస్తున్నదికూడా యెవరికీ తెలుసుకోవలసిన అవసరం వుండేదికాదు. యే ఉద్యోగినైనా మామూలు యివ్వని పక్షంలో అతన్ని ప్రత్యేక విధుల్లో యిబ్బంది పెడుతూండేవారు నాన్నగారు. అవినీతిక్రింద, చట్టవిరుద్ధమైన

చర్యలక్రింద రకరకాల నేరాలు ఆరోపించి బాధపెడుతూ వుండేవారు, సంవత్సరానికి కనీసం ఒకరిద్దరిపట్లనైనా యిలా ప్రవర్తిస్తూ తమ ప్రభావ ప్రతిష్ఠలని ఉద్యోగ లోకంలో నిలుపుకొంటూ వుండేవారు. ఇవేవీ హర్షించని ఉద్యోగులు ఎవరైనా నూటికి, కోటికీ ఒకరుంటే వారు, నాన్నగారికి యెల్లప్పుడూ ఎంతో దూరంగా వుండడానికి యత్నిస్తూండే వారు.

నాన్నగారి చుట్టూ అల్లుకొన్న ఈ విషమ వాతావరణం అమ్మకి యేమాత్రం యిష్టంలేక పోయేది. అహర్నిశలూ ఆవిడ ఈస్థితి ఈ వాతావరణంని గురించిన ఆలోచనలతోనే మునిగి తేలుతూ వుండేది. తమకుటుంబ భవిష్యత్తు అత్యంత భయంకరంగా ఆవిడకు కనిపిస్తూవుండేది, మమ్మల్నందరినీ ఒక్కోసారి దగ్గరకుపిల్చి ప్రక్కన కూర్చుండబెట్టుకొని యిలా చెబుతూండేది. "మన మర్యాద సాంప్రదాయం దృష్టిలో వుంచుకొని ఈ భోగవిలాస వస్తువులని గురించి ఆలోచించండి. ఇవన్నీ అవినీతి, అక్రమాలద్వారా ఆర్జించినవి. మీనాన్న కుటుంబములో చీకట్లుకమ్మి వున్నాడు." అమ్మ మాటలు చాలా శ్రద్ధాసక్తులతో వింటూ నిజంగా అంగీకరించుతుండేవాళ్ళం. కాని నేను కలెక్టరు కూతుర్ని అన్న అహంభావం కూడా తక్షణమే జ్ఞప్తికి వచ్చేది. ఈ భావం నాలో నా తండ్రిగారి శిక్షణద్వారానే అభివృద్ధి పొందిండి. 'జిల్లా అంతటికీ యేకైక ప్రభువైన కలెక్టరుగారి కూతురువు నీకేంతక్కువ?' అని నాన్నగారు అప్పుడప్పుడూ అని ఆనందిస్తుండేవాడు.

నాన్నగారిలోనున్న యీ బలహీనతని పురస్కరించు కొని ఆయనచుట్టూ యెక్కువగా గూండాలు పోగవుతూ వుండేవాళ్లు. విందులమీద విందులూ, పిక్నిక్కులూ, బాల్ రూమ్ డాన్సులూ, రహదారీ బంగళాల్లో వినోదాలూ... కూడా జరుగుతుండేవి. వీటిల్లో తరుచుగా ఎక్కువభాగం యింట్లోనే జరుగుతుండేవి. వీటన్నిటికీ హాజరయ్యేవాళ్ళంతా యెక్కువగా......... స్నేహితులూ... అప్పుడప్పుడు ప్రజా నాయకులు !

ఈ కాలక్షేపసభల్ని చూస్తూంటే బలేహాయిగానూ, గమ్మత్తుగానూ వుండేది. మా పెద్దన్న అప్పుడప్పుడు చాటు చాటుగా రెండు చుక్కలు వేయడం కూడా అలవాటుగా మారింది. నాన్నగారు లేనప్పుడుకూడా ఆయన ఆప్తస్నేహి తులు చాలామంది రావడం మాకు కావసినవన్నీ ప్రత్యేక కానుకలుగా యివ్వడం జరుగుతూండేది. వాళ్ళవెంట మేము సినిమాలకీ, షికార్లకీ వెళ్ళి తిరిగి తిరిగి వస్తుండే వాళ్ళం !

మా ప్రవర్తనపట్ల నాన్నగారు ప్రత్యేక శ్రద్ధంటూ కనపర్చకుండా స్వేచ్ఛగా వదలివేశారు. ప్రత్యేక దర్జా తప్ప ప్రత్యేక అనురక్తికూడా ఆయన ప్రదర్శించక పోయేవారు.

నేను మంచి యౌవనప్రాయంలో వున్నాను. పొంగి పోయే శరీరం, దేన్నో ఆహ్వానిస్తుండేది. మరోవైపు వెలలేని సంపద చేకూర్చిన విలాస జీవితం, అధికార గర్వం, యిక మమ్మల్ని అడిగేదెవడు? మా యిష్టారాజ్యం. అబ్బ! రోజూ ఆ కృత్రిమవాతావరణం, ఆ సమాజం, ఆ అవినీతి, ఆ కుహనావ్యక్తిత్వాలూ, నేడుకూడా చూస్తూనేయున్నాను.

ఇవన్నీ ఒక్క-చోటచేర్చి ఒక్క-సారి అగ్గిపుల్ల వెలిగించి భస్మ మనిపించాలనిపిస్తోంది...

మనుష్యుల్లో మాతృదేశంపట్ల అభిమానానురాగాలు యెప్పటిదాకా పూర్తిగా యేర్పడవో అప్పటివరకు దేశం అభివృద్ధిపథంలో ముందడుగేయలేదు. మన యీ దేశంలో దేవుడిపేరిట కొత్తకొత్త మతాలూ, స్త్రీలవెంట కొత్తకొత్త తగాదాలూ, ఉద్యోగం సాధనంగా కొత్తకొత్తవ్యాపారాలు మోసాలూ, అంతా ఒక కొత్తపదతి యేర్పడింది. తరుచుగా మనుష్యులు తమ నైతిక బాధ్యతలనూ, సూత్రాలనూ కాల దన్ని అబద్ధాలనీ, మోసాలనీ, తమ ఆదర్శాలుగా పెట్టుకుం టున్నారు. మంచిచెడులు తెలుసుకోవడమే కష్టం అయిపో తోంది. ఎవడు సత్యవాదో, ఎవడు అబద్ధాలకోరో ఎవడు పస్తుంటున్నాడో ఎవడు మస్తుగా తింటున్నాడో, కనిపెట్టడం దుష్కటమవుతోంది. మనుషుల నైతికస్థాయి యిప్పుడు దిగజారి పతనం అయినంతగా యెన్నడూ యిదివరకూ అయివుండ లేదేమో ; ఇవన్నీ-మనం ముఖ్యంగా నేను ఇప్పుడు పట్టించు కొని ఆలోచించడానికి వీల్లేని ప్రశ్నలు కూడాను. కాని ఏం చేయాలి. కొద్దిగానన్న-వద్దనుకున్నా ఆలోచించక తప్పడం లేదు.

ఈ పరిస్థితులన్నీ దాటి యిప్పటికి నేను చాలాదూరం వచ్చేశాను. నేను యిప్పుడు అన్నివిధాలా సంతోషవంత మైన జీవితం గడుపుతున్నాననే నిర్ణయానికి వచ్చేసాను. అయిష్టం, దుఃఖకారణమైన విషయాలుంటే వుండవచ్చు కాని నేను లక్ష్యపెట్టను. యీ దుఃఖాలకూ, సుఖాలకూ అతీతంగా నిర్లక్ష్యంగా వుండడం అలవాటు చేసుకున్నాను.

అయినా అన్నిటిని గురించీ పరిజ్ఞానంతో ఆలోచిస్తాను. చూడు! నీ విషయంలో నేనెంత శ్రద్ధగావున్నానో! నీ కోసం యెలాతపించి పోయానో! నీ కథల్ని ఒకటి రెండుసారులు పఠిస్తూంటాను. అందర్ని గురించీ ఆలోచిస్తాను. కాని రాజా! నాసంగతిమాత్రం నాకే తెలియకుండా పోతోంది. ఈ ప్రపంచం కాలితాపులు తిని, తినీ, నాహృదయం మాడి భస్మమై పోయింది. కాని హృదయంలో యేదో ఒకమూలన కొద్దిగాయింకా జీవించి వుండాలనే ఆశ, ఈ ప్రపంచంలో నుంచి యింకా అనుభవం నేర్చుకోవాలనే ఆకాంక్షల కారణంగా నేను నిన్ను వెదకి కనిపెట్టగలిగాను. చివరికి కలుసుగోన గలిగాను కూడా. పాపభూయిష్టమైన ఈ జీవితరంగం మీదినుండి ఒకసౌభాగ్యసంతోష సంగీతం వినిపించి మన వాతావరణాన్ని సక్రమ మార్గానికి మళ్లిస్తూన్న నిర్ణయజ్ఞానం ప్రబలుతోంది, ఇక నిజంకావాలంటే తిరిగి జీవితరంగంలో ప్రవేశించి...—...ఒకటి నిర్వహించవలసి యుంటుంది.

ప్రకృతిలో జనించని మార్పులూ, కాలములో కనిపించని మార్పులూ మనుష్యుల మనస్తత్వాలలో యెలాజనించాయో తెలీడంలేదు రాజా! నిన్నటికి నేటికి యెందుకు తేడా! ఈ ప్రపంచం ఈ ఆకాశం, ఈ సముద్రాలూ ఈ సూర్యచంద్రులూ అన్నీ నిన్న వున్నవేకదా? యెప్పటిలాగే ప్రతిరోజూ కొత్త వెలుగునీ, కొత్తఆశలనీ తనవెంట బెట్టుకొని వస్తూనేవుంది. ఉదయం ఆనందప్రదంగానే వుంటుంది, చంద్రుడు తనకాంతినీ స్థితినీ కోల్పోకుండా యెప్పటిలాగే ప్రకాశిస్తూన్నాడు, ఆకాశంమీద నక్షత్రాలు మెరుస్తూనే వున్నాయ్. సూర్యుడు వేడినీ జీవి

తాన్ని వెనుకటి మాదిరే మనకు ప్రసాదిస్తు న్నాడు. యేమార్పు లేదుకాని ఈ భూమిమీద చరించే మనుషులెందుకింత మారిపోయారో అని నా సందేహం ఇదో పెద్ద ప్రశ్నగావుంది. ఇందుకే ఈ ప్రపంచాన్నొదిలిపెట్టి మరో ప్రపంచానికి ప్రయాణం కట్టాలనిపిస్తోంది. కాని యిది సులభసాధ్యమవుతుందా రాజా ?"

రాజు చాలా శ్రద్ధగా వింటున్నాడు. కమలారాణి నేత్రాల్లో ఒక ప్రత్యేకమైన మెరుపు కనిపిస్తోంది. ఇందులోంచి నిప్పురవ్వలు రాలుతున్నట్లుగా అనిపించింది...... రెప్పలు వాల్చకుండా ఆవిడ చెప్పుకుపోతూనేవుంది. రాజు హఠాత్తుగా ఆమె వాగ్ధోరణికి అడ్డంవచ్చి "కమలారాణీ !" అన్నాడు.... ఆవిడ ఒక్కసారిగా ఆగిపోయింది.

తుఫాను భీభత్సం భూకంపం ఒక్కసారిగా ఆగిపోయి నట్లయింది. పడుతూ పడుతున్న పిడుగు మధ్యలోనే ఆవిరయి నట్టుగావుంది. ఎందుకాపుజేశావ్ ? అన్నట్టుగా ఆవిడకళ్లు రాజుని ప్రశ్నార్థకంగా చూస్తున్నాయి.

"కమలారాణీ ! చాలా అలసిపోయావు. నీ కథను అసంపూర్ణంగా వదలిపెట్టడానికి నేను అంగీకరించను. కాని నీవు కొంచెం విశ్రాంతి తీసుకోవటం అవసరంగా భావిస్తు న్నాను."

"వినురాజా ! మళ్ళీ యిలాంటి అవకాశం బహుశా లభించకపోవచ్చు. లభించినా అప్పటికి నా మనస్సు యిప్ప టిలా సుముఖంగా వుండకపోవచ్చు. యిప్పుడు నాగతచరి త్రంతా సినిమాబొమ్మల వరుసలా కళ్ళముందు ప్రత్యక్ష

మవుతూంది. దీన్నంతా నీకు వినిపించాలనే ఆరాటంకూడా ఎక్కువవుతూవుంది. మధ్యలో ఈధోరణికి ఆటంకంకలిగితే కుతూహలం నశిస్తుంది. నా అలసటిని మీరు అంతగా గమనించ నక్కర్లేదు." అని కమలారాణి మళ్లా కథ ప్రారంభించింది.

"మా చదువు సంధ్యల విషయంలో మా నాన్నగారికన్నా మా అమ్మే ఎక్కువశ్రద్ధ తీసుకుంటుండేది; తనకు సాధ్యమైనంత వరకు. మా అన్నమాత్రం మా నాన్నగారి పోలికలన్నీ అచ్చంగా పుణికిపుచ్చుకొని తన బాధ్యతను పూర్తిజేశాడు... తండ్రికి దగిన కొడుకుగా తయారయినాడు. నాన్నగారి స్నేహితుల్లాగే అన్నగారి స్నేహితులు కూడా రావడం, రహస్యంగా వినోదాలూ విందులూ జరుపుకోవడం మెల్లగా జరుగుతూండటం పరిపాటి అయింది. నాన్నగారి పేరూ అండదండలూ పరోక్షంగా ఉపయోగిస్తూ అన్నగారు సంపాదనకూడా, అధికారంలేకుండానే ప్రారంభించాడు. రెండు మూడు పర్యాయాలు బి. యస్. సి., లో దండయాత్రలు కొట్టి ఉత్తీర్ణం అవుతాననే ఆశనుత్యజించి చివరికి చదువుకే పూర్ణంగా ఎగనామం పెట్టాడు.

అన్నయ్య అలవాట్లుచూచి అమ్మ పూర్తిగా హతాశురాలై పోయింది. రానురాను అతన్నిగురించి ఆవేదన పడకుండా మానుకుంది. ఇక ఆవిడధ్యాసంతా నేను-మా చెల్లి మోహిని మీదే కేంద్రీకరించడంతో మాకు కట్టుబాట్లు కూడా కొంచెం అధికం అవుతూవచ్చాయి,

మారాకడ పోకడలూ, విలాస విహారాలూ నిర్బంధంగా తగ్గించడానికి అమ్మ చాలా ప్రయత్నించింది. ఈ వ్యవహారం మొదట్లో మాకు చాలా చికాకునూ, కోపాన్ని కలిగించింది. కాని చివరికి అదే అలవాటై కొంచెం రిజర్వ్‌గా వుండడం అంతకష్టం అనిపించలేదు. అమ్మ కృషి నిరంతర జాగ్రతవల్ల ఇంటర్మీడేట్టు పరీక్ష ఉన్నతంగా ఉత్తీర్ణులం అయ్యాం, మేంపాసయ్యాం అన్నసంగతి విన్న నాడు అమ్మకళ్లు ఆనందంతో చెమ్మగిల్లాయి.

మొదటినుంచీ అమ్మంటే నాకు చాలా అభిమానం. గౌరవంకూడా వుంటూవుండేది. మమ్మల్ని గురించిన బెంగతో ఆవిడప్పుడప్పుడు కన్నీళ్ళురాలుస్తుంటే నేను చూడలేక పోయేదాన్ని, అమ్మా! నీవు నిశ్చింతగావుండు, యింతవరకు మానుంచి యేవన్నా తప్పులు జరిగితే క్షమించు, ఇక ముందు పొరపాటు జరుగదు. అనిఅంటే ఆవిడ హృదయం శాంతించేది. అలానని ప్రతిరోజూ ఆవిడమాతో బాస చేయించేది.

ఈ ప్రపంచంలో బ్రతకాలన్న ఆ కాంక్ష నాకు యేమాత్రం లేదమ్మా! మీనాన్న ప్రవర్తనయిక మారటంక ల్ల ధనాన్నీ, దర్పాన్నే సుఖసౌభాగ్యాలుగా ఆయనభావిస్తున్నారు, అవినీతితో కూడబెట్టిన ధనంతో దేవేంద్రభోగం అనుభవిస్తున్నారు. ఇదిమహాపాపం. పాపం పాపానికి తగినశిక్ష తప్పక లభిస్తుందమ్మా! ఏనాటికైనా తప్పదు. భగవంతుడి సెలవు అయితే కావడంలేదుగాని ఒక్క నిమిషంకూడా నాకు బ్రతికివుండాలని లేదు. దేవుడు స్త్రీని సృష్టించి భర్తని

ఆలంబనంగా చేసి, చూపెట్టాడు. ఆవిడకి యితర మార్గాలు అనుసరించే హక్కు లేదు. వీటిని అంగీకరించకపోతే వచ్చేపడే లాభంయేమిటి? నా అదృష్టం వారిచేతుల్లో అర్పించబడింది. మన అదృష్టాన్ని నిర్మించుకోవలసిన బాధ్యత మనమీద పడింది. ఈ నా బాధ్యతను సంపూర్ణంగా తృప్తికరంగా నెరవేర్చాలను కుంటున్నాను. నా బాధ్యతలుతీరిన అనంతరం భగవంతుడు ఒక్క క్షణం ఆలస్యం చేయకుండా నన్ను తన వద్దకి చేర్చుకోవాలని సర్వదా ప్రార్థిస్తుంటాను తల్లీ!" అనేది అమ్మ.

అమ్మయిలా మాట్లాడి నప్పుడల్లా నాకు దుఃఖం పొర్లుకొచ్చేది, క్రమక్రమంగా అమ్మ ప్రబోధ ప్రభావం మాలో వ్యాప్తి నందుతూ వచ్చింది. ఆవిడ మాకోసమె జన్మించిందేమో! మొదట్లో ఆవిడ ఆజ్ఞలకి వ్యతిరేకంగా ప్రవర్తించి తప్పుదారిన పడ్డాం. కాని తరువాత ఆవిడ నిరంతర శ్రద్ధా సక్తులవల్ల నిర్లక్ష్యభావం నశిస్తూ వచ్చింది. ఆవిడ నిర్మల హృదయం తపస్సులో పనిచేసింది. మా భవిష్యత్తు నిర్మించడానికి ఆవిడ నిజంగా అహోరాత్రాలూ తపస్సు చేసిందనవచ్చు. ఇంటర్ మేడేట్ ఉత్తీర్ణులం కావడం కూడా ఆవిడ చలవే! మా చెల్లి మెట్రిక్ పాసైంది. ఇంటి పనుల్లో నౌకర్ల ప్రోద్బలాన్ని ఆమె క్రమక్రమంగా తగ్గిస్తూ మా మీద ఎక్కువ బాధ్యతలు పెట్టి పనులు చేసేలా చూస్తుండేది. భోగలాలసత్వం. అధికారదర్పం, ధనగర్వం, అహంభావంతో మా నాన్నగారికి తీరికే వుండేదికాదు.

భోగలాలసుడైన మనిషి, ఆలోచననీ శ్రద్ధాయుత మైన పరిశీలననే వర్జిస్తాడు...అతనికి తన భోగజీవితాన్ని గురించిన ధ్యాస తప్ప యితరం కించిత్తూ వుండదు. మర్యాద, సంస్కారాల పేరుతో నాన్నగారు యేదిచేసినా నాకు బాధలేదు. కాని వారు కనీస నైతిక విలువలని కూడా విస్మరించారు. నీతిలేని మనిషిలో యికవుండేదంటూ యేమీ లేదు.

'నీవు ఈ వాతావరణానికి చాలాదూరంగా వుండా లమ్మా! ఆడపిల్లవు. నీవుకూడా నాన్నగారి జీవితమార్గాన్నే అవలంబిస్తే నీ అంతఃసౌందర్యం నశిస్తుంది. హృదయం, ఆత్మల ఔన్నత్యం గుప్తంగా వుంటాయి. యివి బయటికి వచ్చి సలక్షణంగా ప్రకాశించే అవకాశం అంటూ ఆమా ర్గంలో వుండదు. సర్వదా అవి అలానే గుప్తంగా వుండి పోతాయి. మీ నాన్న గారు నేడు ప్రయాణిస్తున్న అక్ర మార్జన భోగపరాయణైక జీవిత మార్గంలో విషవాయువులు వీస్తూవుంటాయి...విషం...కంటకాలు. యీ విషం, వంశాం కురాలైన మిమ్మల్ని కూడా హతమార్చే ప్రమాదంవుంది. వీటి దుష్ట ప్రభావం మీ జీవితాలపై సోకి తీరుతుంది. సోకిం దంటే యిక దాన్ని తుడిచివేయటం యెన్నటికీ అసాధ్యం. కాబట్టి ఈ మార్గంవిషయంలో మీరు చాలా జాగ్రత్త పడాలి. మిమ్మల్ని మీరే రక్షించుకోవాలి. లేదో కాలం యీ సౌభాగ్య పుష్పాలని నలిపివేస్తుంది. సౌభాగ్యంలేందే స్త్రీకి జీవితం లేదమ్మా!

మీ నాన్నగారి స్నేహితులు లక్షలమంది, లక్ష రకాల మాటలు, చేతలు! వాళ్ళ వేషాలకీ మోసాలకీ గురికావద్దు.

ఈ దౌర్భాగ్య స్నేహితులందరికి బ్రతికి వుండగా అగ్ని సంస్కారం చేయాలన్నంతగా నాహృదయం ఉడికిపోతుం దమ్మా! ఈ చర్యవల్ల కనీసం మీనాన్నగారిలోనైనా ఏదైనా అభిమానం, లజ్జ పొటమరిస్తాయేమో! కాని ఆయన ఈ దశనుదాటి చాలాదూరం వెళ్లారిప్పటికే.

ఆయనకిప్పుడు దర్జా, ధనంతప్ప మరేమీ కన్పించదు. ఆర్జించడంలో యెంతటి అపమార్గాలకైనా వెనుదీయరో అలాగే అక్రమవ్యయాన్నికూడా అలవాటైపోయారు. ఇదే జీవితంయొక్క మూలసూత్రాలను పాటించడమనీ, ఉద్యోగ విధులు సక్రమంగా నిర్వర్తించడమనీ, ఆయన విశ్వాసం. నా దృష్టిలో వారు చవిటినేలల్లో విత్తులు చలుతున్నారనిపిస్తుంది. నలుగురిలో నగుబాట్లపాలై తలవంచుకోవలసిన దుస్థితికి గురి కావడమే దీని ఫలితం.

ఇలా ప్రతిరోజూ అమ్మ వినిపించేబోధనలూ సుదీర్ఘోప న్యాసాలూ, నామీద చాలా ప్రభావం చూపాయి. నాలో క్రమంగా శాంతం, సహనం, ఆలోచనలు పొటమరించడం మొదలైనవి. నేను గడిపేదంతా వట్టి అపసవ్య జీవితంలా గోచరించింది. సవ్యంగా ఇకనైనా బ్రతకడం నేర్చుకోందే లాభంలేదన్న స్థిరనిశ్చయం కలిగింది. నిజంగా మా అమ్మ కన్నీళ్లు, మార్గదర్శకత్వం లేకుంటే ఈపాటికి నా అభిమానం చూర్ణం చూర్ణం అయిపోయి వుండేదిరాజా ?

ఎంతోమంది పశువుల్లా అసభ్యంగా ప్రవర్తించ యత్నించినా నన్ను నేను రక్షించుకొని, ఇలా బ్రతుకుతోం డడం ఆమె పురికొల్పినవిశ్వాసబలంవల్లనే. నాకిప్పు డమిత

మైన ధైర్యం, కాలంతోపాటు మనస్సుని సరిపెట్టుకొని జీవించే ఓర్పు, వున్నాయి. కష్టాలంటే లక్ష్యంచేయను. ఇదంతా అమ్మచలవే.

అవినీతి పథంలో బ్రతుకునడపడం నాన్నగారికి సహజ గుణం అయిపోయింది. అవినీతిలో అడుగుపడందే ఆయన ప్రశాంతంగాఉండలేరు.

అధికారబలం వున్నప్పటికీ అక్రమం చిరకాలం సాగి రాదు. నాన్నగారి ఘనీభవించిన పాపపటలం ఒక్కసారిగా బ్రద్దలైంది. ఇలాగే అలవాటుప్రకారం యెవరో ఒక పెద్ద మనిషివద్ద లంచంపుచ్చుకొంటూండగా ఉన్నపళంగా దొరికి పోయారు. అదంతా ఒక ప్లాన్ ప్రకారం జరిపించిందేనేమో! తక్షణం నాన్నగారు అరెస్టు చేయబడ్డారు. అదంతా యేదో యింద్రజాలంలా జరిగిపోయింది. న్యాయస్థానంలో అభి యోగాలు మోపబడ్డాయి. పాపఫలితంపొందకుండా బయట పడటానికి నాన్నగారు తీవ్రంగాజరిపిన పోరాటంలో పుష్క లంగా ఇన్నాళ్లూ సంపాదించిన దంతా కర్పూరంలా హారించుకపోయింది, పరిస్థితులిలా ఉండగానే నాన్నగారి మనోవ్యాధి క్షయవ్యాధిగా పరిణామంచెందింది ... వ్యాధి నిర్మూలనకు వైద్యవ్యయంకోసం చివరికి అమ్మ తన మంగళ సూత్రాన్నికూడ అమ్మవలసిన దశవచ్చిందంటే మీరు నమ్మలేరేమో! అన్నిప్రయత్నాలు వ్యర్థమై నాన్నగారు ఈ ప్రపంచాన్ని వదలిపెట్టారు. ఆయనని అవినీతిపథంలోంచి మళ్ళకుండా బిగించిఉంచిన ఆ ప్తస్నేహితులంతా ఆఖరి సమ యంలో ఆయనకి అచ్చమైన శత్రువులై నిలబడ్డారు.

మానవజీవితంలో యిలాంటి పరిణామాలెన్నో ఒక్క
సారి అతినిశ్శబ్దంగా ప్రవేశిస్తుంటాయి. వీటిరాకడని కని
పెట్టడం, మేధో శక్తిసాధించడమే కష్టమైనపని రాజూ!
తలవనితలంపుగా జరిగే యీసంఘటనల హఠాత్ప్రవేశంతో
జీవితంలో వున్నదంతా క్షణంలో తలక్రిందులై అస్తవ్యస్తంగా
మారి ఇలాజరిగిందేమిటాఅన్న ఆశ్చర్యంప్రకటించడానికైనా
కనీసం అవకాశం లభించదు. బ్రతుకంతా పణంగాబెట్టి సంపా
దించినదంతా క్షణంలోనిరవశేషం అవుతుంది. ఈవిరుపులు
మెరుపులూ నిమిషంలో అదృశ్యమైపోతాయి. అన్ని సాహ
సాలూ మందగిస్తాయి. తనవారు తనకుగాకుండాపోతారు.

ప్రతిమార్పూ ఒక ప్రత్యేకతనీ ఒకప్రాధాన్యతనీ కలిగి
వుంటుంది.రాదలచుకొన్నమార్పుని యేశక్తికూడ నిరోధించ
లేదు ప్రతిదీ ఒకసమస్యగా మారుతుంది, యే ఆశయాలూ,
యే ఆదర్శాలకోసం బ్రతుతుకుతున్నామో అవన్నీ స్వప్నా
లైపోతాయి. సాధించగలమన్న మనోబలం, విశ్వాసం, శత
ధాభిన్నమైపోతాయి. మన ఔన్నత్యం మనకు నీచత్వంలా
కనిపిస్తుంది. అతిసాధారణ సమస్యలు కూడా పర్వతాల్లా
కంటికి కనిపిస్తాయి. అతిసున్నితమూ, అతిభయంకరమూనైన
ఆ క్లిష్టపరిస్థితుల్లో ఆత్మరక్షణ, ఆత్మవిచారానికూడాపూను
కొనలేని అశక్తులమవుతాము. మహావిశాలమైన ఈ ప్రపంచం
ఒక్క చిన్న ఇరుకుసందులా అసహ్యంగా కనబడుతుంది. మన
తెలివిమనకు మార్గదర్శికంగావుండి అపాయమునుండి తప్పించ
లేదు. ఇలాంటిఆపత్సమయంలో, జీవితంలోయెన్నడూమనం
లక్ష్యపెట్టని, ఆలోచించడానికికూడా పడని, వ్యక్తిత్వం
అప్పుడు స్ఫురణకు వస్తుంది. పరిణామాలకు పూర్వం సాను

భూతిపరులు, దయార్ద్రహృదయులు అని మనం భావించిన వాళ్ళంతా వ్యతిరేకంగా మారిపోతారు. ఆత్మస్నేహితులు వ్యతిరేకిస్తారు. మెత్తని మనస్సుకలవాళ్ళు శిలాహృదయులవుతారు. మనవాళ్ళే మనని విచిత్రంగా అపరిచితుల క్రింద చూస్తారు. బ్రతకడం భారం అనిపిస్తుంది. ఈ హఠాత్పరిణామాలు చివరికి వంశాల అదృష్టగతినే మార్చిపారవేస్తాయి:—

అవినీతిపథంలో ప్రత్యక్షపరిస్థితిలో అరెష్టయిన మా నాన్నగారు జిల్లా ఉన్నతాధికారి. ఆయన సాధారణ పోలీస్ కానిస్టేబులుల నిర్బంధంలో, వారి ఆజ్ఞలను పాటిస్తూ అతిహీనంగా బ్రతకవలసి వచ్చింది. ఎంత మహాత్పరిణామం ఏనాడో ఒకనాడు ఇలా జరిగితీరుతుందనీ, ఈ పాపం బ్రద్దలై యేదో ఒక స్వరూపాన్ని యేర్పరుచుకుంటుందనీ అమ్మకు తెలుసు. ఆవిడ సందేహం అక్షరాలా నిజం అయికూచుంది. నాన్నగారికి వ్యతిరేకంగా ఎన్నో కేసులు పెట్టబడ్డాయి. వీటిలో ఇరువై యైదువేల రూపాయల ప్రభుత్వ ద్రవ్యం దుర్వినియోగ పరిచారన్నది ముఖ్యమైంది.

జిల్లా తుఫాను వరదల భీభత్సానికి గురి అయి లక్షలాది ప్రజలు నిరాశ్రయులై నష్టపోయారు. ఈ నష్టాల విలువ అంచనా వేయడంకూడా కష్టం. వరదబాధితులను ఆదుకునే నిమిత్తం ఒకలక్షరూపాయిల ఉచితసహాయాన్ని ప్రభుత్వం మంజూరు చేసింది. ఈ సహాయ ధనంలో దాదాపు యాభై వేల రూపాయిలమీద నాన్నగారు లాఘవంగా హస్తప్రదర్శనం చేసారు. బ్యాంకునుండి ఇస్యూ చేయబడ్డ నెంబర్లుగల నోట్లకట్టలు మూడు నాలుగువేలకి సరిపోను నాన్నగారి యినప్పెట్టెలో పోలీసులకు చిక్కినవి. ఇంకా యిలాంటివే

జొరెడు నేరాలను పోలీసుశాఖ అన్వేషణ సాగించింది. ఈ వరసలోనే అన్నయ్య మీదకూడా అరెస్టు వారంటు జారీ అయింది. ఇది తెలిసి ఆయన యెటో పరారీ చిత్తగించాడు. కాలికి బలపం కట్టుకొని వకీళ్ళ లాయర్ల ఇండ్లచుట్టూ తిరిగి, పడిగాపులు పడడంతోనే అమ్మకు సరి పోయేది. నాన్నగారితో స్నేహంగావుండే పెద్దలంతా లాభం లేదని నిరాశను వ్యక్తంచేస్తుండేవారు. అయినప్పటికీ విపరీతం గానే ఫీజులాగుతుండేవాళ్లు. కష్టదశలో కనీసం అమ్మ ప్రయ త్నానికి అండగా సానుభూతి చూపించేవాళ్లుకూడా కరువై పోయారు. మాకు గవర్నమెంటు భవనసౌకర్యం రద్దుకావ డంతో మరో అద్దెకొంపకి సంసారం మార్చుకున్నాం. ఇనప్పెట్టెలో మిగిలిన మొత్తం అంతా మొదట్లోనే పోలీసులు జప్తుజేసి న్యాయస్థానం స్వాధీనంచేసి సీలు వేయించారు. అమ్మ మెళ్ళోవున్న కొద్దిపాటి వస్తువులు మాత్రం మిగిలి పోయాయి. ఇంట్లోవున్న యావత్తు చరాస్థినికూడా ప్రభుత్వం స్వాధీనపర్చుకుంది. దాదాపు నాలుగు లక్షల రూపాయల వరకు ప్రభుత్వ ద్రవ్యం నాన్నగారు హరించారని ప్రచారం సాగింది. స్పెషలు బ్రాంచిపోలీసుల అన్వేషణ తీవ్రంగా సాగింది. రక్షణకోసం అమ్మకొంతమంది స్నేహితుల యిండ్లకు వెళ్ళగా వాళ్లు ఆశ్రయం నిరాకరించారు. ఆవిడ చాలా కల వరపడి యేమీ తోచని స్థితిలో పడి పోయింది. ఒకవైపు భర్త నిర్బంధంలో, మరోవైపు కన్న కొడుకు పరారీలో, యింట్లో ఇద్దరు ఈడువచ్చిన పిల్లలు, స్థిర చరాస్తులన్నీ ప్రభుత్వ సాధీనములో, చూస్తూ చూస్తుండ గానే అన్ని ఆశలూ మటుమాయం. ఇక బేజారెందుకాదు?

ఎక్కడన్నా మునిగి చావడానికైనా అమ్మకు తీరిక వుండేది కాదు. మా యిద్దరి బాధ్యత ఆవిడని ఆత్మహత్యనుండి వెనక్కి మళ్ళించేది. ఆవిడ మహాధైర్యంకల స్త్రీమూర్తి. అయినప్పటికీ ఆవిడకి మానసిక విశ్రాంతి, సుఖం కరువై పోయింది. క్షణంలో స్థితిగతులు తారుమారై ఆవిడ ఉనికే నిరాశాస్పదమైపోయింది.

నాన్నగారివిడుదలకోసం అమ్మ తన ప్రయత్నాలని తీవ్రతరం చేసింది. నిద్రాహారాలు మానుకొని భూమ్యాకాశాలు యేకమయ్యేలా కృషిచేసినా, పీసమెత్తు ఫలితం లభించలేదు. నాన్నగారిమీద జరిగిన ఆరోపణలు ఆయనికి విడుదలవీలును కల్పించేవికావు. ఒకటి రెండుసార్లు జైలుకువెళ్ళి నాన్నని కలుసుకుని పరిస్థితులన్నీ వివరించి అమ్మ కంటికీ మంటికీ ఏకధారగా ఏడ్చింది. అప్పుడు ఆవిడ వీపు నిమురుతూ నాన్న గారు నిజమైన హృదయంతో అన్నారట. "నీ ఉపకారం నీ శ్రమ, నేను జన్మజన్మాలకి మరచిపోలేను రాధా! నేను మంచిగావున్న రోజుల్లో నీపట్ల చాలా నిర్దాక్షిణ్యంగా నీవు నా ధర్మపత్నివన్న సంగతికూడా మరచిపోయి ప్రవర్తించాను. ఇప్పుడు గుర్తించ గలుగుతున్నాను. కాని చేయిదాటి పోయింది రాధా! నా హృదయమే నన్ను పొడుచుకు తింటోంది. నా జీవితంతోపాటు, కుటుంబం యావత్తు భవిష్యత్తునీ, నేను సర్వనాశనం చేసాను. నేను ఘోరపాపిని కఠోరస్వార్థపరుణ్ని. ఇవాళ నీ దయనుకోరే అర్హతకూడ నాకులేదు. ఇదిజైలు అని గమనించినప్పుడల్లా నా ఆత్మవణికి పోతున్నది. చివరిమాటగా చెబుతున్నాను. నా స్నేహితు లంతా పచ్చిదుర్మార్గులు, దగాకోర్లు. వాళ్ళనియింటిసీడలకు

కూడా చేరనీయకు. ఈసహవాసంతో అమ్మాయిలిద్దరి జీవితం నాశనం కాకుండా చూడవలసిన బాధ్యతనీదే. నీవిషయంలో పిల్లల విషయంలో నీవు తగిన జాగ్రత్తగావుంటానని మాట యిస్తేనే నేను హాయిగా విశ్రాంతి అనుభవిస్తాను. లేకుంటే మీబాధా ఫలితం నన్ను పాపమై వెంటాడి కాల్చి దుర్గతికి ఈడుస్తుంది. అబ్బాయి విషయంలో చాలా జాగ్రతగా వుండాలి. వాడు నాలానే మిమ్మల్ని కొత్త చిక్కుల్లోకి లాగేస్తాడు."

"మీరు నిశ్చింతగావుండండి. మీరువిధించిన బాధ్యతలన్నీ నేనునిర్వహిస్తాను. మీప్రతిరూపాలను తీర్చిదిద్దుతాను. వాళ్ళసుఖమయ భవిష్యత్తుకి నాజీవితం ధారపోస్తాను. కాని మీస్థితే నన్ను నరకంలోపడేస్తుంది. మీరిలావుండగా నా బతుకేమిటో చెప్పండి. ఎవర్నిచూచుకొని నాకు సంతోషం" అని అమ్మ అంటే—

"నా విషయం నీవుఆలోచించడం అనవసరం రాధా! నేను ప్రభుత్వానికి ద్రోహంచేసాను. ప్రజలకి అన్యాయం చేశాను. న్యాయం, చట్టం, శాసనం దేనినీ గుర్తించి మన్నడూ పాటించలేదు. చివరికి నా కుటుంబానికి నేను అమితమైన ద్రోహం చేశాను. నా మీదయింకా అభియోగాలు నడిపించడంకన్నా ఒకసారి గుండుదెబ్బతో కాల్చిచంపడం సరియైన శిక్ష అవుతుంది. నాకోసం యేమాత్రం చింతపడను" అంటూ నాన్నగారు అమ్మమెడని కౌగలించుకున్నారు. అదే ఆయన ప్రప్రథమంగా స్వచ్ఛమైన హృదయంతో అమ్మని ఆదరించిన సంఘటన, అని చెప్పవచ్చు. అమ్మగుండెలు యేడుపుతో బరువెక్కిపోతున్నాయి.

"ఎందుకేడుస్తావ్ రాధా ! జైలునేనుండడానికి అర్హమైనస్థలమేలే! యిక్కడవుంటేనే ప్రపంచదృష్టి నా మీద అనుదినం ప్రసరించదు. బయటనుండి నలుగురిలోనన్ను హేళనగా చూడ్డం నాబతుక్కేముప్పు ఘటిస్తుంది. అయినానాకు జీవితమంటేతీరని విరక్తిగలుగుతోంది. నన్ను కేవలం నీచింత, పిల్లలచింత మాత్రమే బాధిస్తోంది. నన్ను హృదయ పూర్వకంగాక్షమించాలి రాధా ! నీవు నాప్రవర్తనపట్ల ప్రదర్శించిన వోర్పు నీ గొప్పతనానికి నిదర్శనం. నీవేనన్ను క్షమించని పక్షంలో మరణసమయంలోనూ మరణానంతరం కూడా నాకు ఆత్మశాంతి వుండదు. అంతా దుఃఖమే." అన్నారు నాన్న.

"ఎలాంటి వారైనా కానీయండి. మీరు నాకు దైవస్వరూపులు. ధర్మపత్నినై వుండి మీరు చెడ్డవారని నేను అనలేను. మీరునన్ను చీల్చి ముక్కలు ముక్కలుగా చేసినా నాకు క్రోధం వుండదండి ! సంతోషంతో నేను మీప్రవర్తనని మరిచిపోయాను" నాన్నగారు తల నిమురుతూ అంది అమ్మ. నాన్న అమాంతం అమ్మ పాదాలు రెండూ పట్టుకొని "నీవు నాకు భార్యవే కాదురాధా ! నీలో మాతృహృదయం నన్ను రక్షిస్తోంది. విలువైన నీ హృదయాన్ని యింతవరకు గుర్తించ లేని మూర్ఖుడిని." అంటూ వెక్కివెక్కి ఏడ్వటం ప్రారంభించారు.

"అదేమిటి ? తప్పు... వదలండి. నన్నింకా నరకాని కీడుస్తున్నారుమీరు. మీకోసం ప్రాణత్యాగమైనా చేయడం సంభవిస్తే అది నా అదృష్టం అనుకుంటాను."

"రాధా! యిదంతా భగవదిచ్ఛ. దీనికి తిరుగులేదు. నామనస్సు నాస్వాధీనంలో లేదు. ప్రభుత్వం ఎంతకఠిన శిక్ష విధించినా నాకు సంతోషమే ఎన్ని అవకాశాలు వున్నా యే పరిస్థితిలోనైనా అపీల్ చేసుకోవడమన్న సమస్య లేదు. కొన్ని విషయాలు బహిరంగ పరిస్తే మరికొందరు గొప్పవాళ్లుకూడా శిక్ష అనుభవించేస్థితి యేర్పడుతుంది. కాని కొంత మోసం సాగిస్తేనే కాని నిజమైనప్పటికీ అది సాధ్యం కాదు. యిక నేను నాకోసమైనా మోశంచేయ దల్చుకోలేదు. అబద్ధం అనేశబ్దంకూడా వినడానికి అసహ్యం పుట్టేంత మొండి విశ్వాసం యిప్పుడు నాకు కలిగింది రాధా! న్యాయస్థానాన్ని కూడా కండ్లుగప్పి బయటికి రావడం ఒక స్థితిలో సంభవమేగాని నా ఆత్మ అంగీకరించడం లేదు. నా కిరాత కృత్యాలన్నీ వరుసగా ఒప్పుకోడానికినేను హృదయ పూర్వకంగా సిద్ధంగావున్నాను. నా యీ ప్రవర్తన నీకు ఆశ్చర్యం కలిపించవచ్చు. కాని నిజంగా నాలో మార్పు యేర్పడింది రాధా!"

"మీ యిష్టంవచ్చినట్టు చేయండి. కాని అనవసరంగా హృదయాన్ని క్షోభ పెట్టుకుని ఆయాసం పాలు గాకండి. మీ ఆశీస్సుల బలంతో పిల్లల బ్రతుకు మంచిమార్గంలో సాగుతుంది." అంది అమ్మ దాంతో యిద్దరూ ఒకరిని ఒకరు కౌగలించుకుని యేడ్చారు.

నాన్న అరెస్టయిన తర్వాత అనుభవిస్తున్న యమ యాతనల్లో ఒక్కదాన్నికూడా అమ్మ నాన్నకు తెలీనివ్వ లేదు. ఇంట్లో యెవరూ లేరు. "సెలవు యివ్వండి. మళ్ళీ దర్శించుకుంటాను" అని అమ్మ నాన్నగారి పాదాలమీద

పడింది. ఆయన జీవంలేని తన హస్తాలతో అమ్మను లేవ నెత్తుతూ "నన్ను యింకా గౌరవిస్తూ మరీ ఋణగ్రస్తుణ్ణి, పరాభవితుణ్ణి చేయకు రాధా! ఇప్పటికే నీ ఉపకారభారంతో నా శిరస్సు కృంగిపోయింది. నా ప్రతి ఉచ్ఛ్వాస నిశ్వాస ల్లోనూ నీ ఉపకార పరిమళమే" అంటూ నాన్నగారు అమ్మని బలంగా హృదయంలోకి హత్తుకున్నారు. ఆవిడ నొసటిని ముద్దెట్టుకున్నారు. ఆ క్షణంలో మా అమ్మ ఈ ప్రపంచాన్ని మరిచిపోయింది. భర్త ప్రేమతో ఆవిడ ముఖం విప్పారింది. ఏదో విశ్వాస బలంతో, జీవితంలో రాబోయే మార్పుల్ని ఊహిస్తూ ఆవిడ యింటికి మళ్ళింది.

ఏవిధమైన హెచ్చరికా లేకుండానే ఇలాంటి సంఘట నలు అకస్మాత్తుగా వచ్చి పడతాయి. ఈ సంఘటనల్తో అమ్మకు ఒకవిరక్తీ, మరోవైపు యీ కష్టాలన్నిటితో పోట్లా డాలన్న దృఢనిశ్చయం కలిగాయి. తన వునికిని గురించి ఆవిడ తక్షణం ఏ అఘాయిత్యం తలపెట్టడానిక్కూడా వీల్లేని పరిస్థితి. ఈడేరిన యిద్దరు ఆడపిల్లలం ఆవిడ కంఠానికి వురిలా తగుల్కొన్నాం. నాన్నగారిమీద యిదివరకు అమ్మకువున్న కోపం అంతా మంచులాగా కరిగిపోయింది. ఆయన మూలం గానే కుటుంబానికి యీ దుర్గతీ కష్టాలూ సంప్రాప్తమైనవని ఆవిడకి బాగా తెలుసు. పరిస్థితులు చేయి దాటింతరువాత, సంపూర్ణంగా తడిసిపోయాక నాన్నగారు, తమ అకృత్యాల పట్ల పశ్చాత్తాపం వెల్లడించడం ప్రారంభించారు. ఇది కూడా మా అమ్మ ప్రభావంవల్లనే జరిగింది. నాన్నగారి పశ్చాత్తాపం నిప్పులమీద నీళ్లు చల్లినట్లయింది. యిదంతా అదృష్టం ఆడే నాటకంగా భావించి అమ్మ చాలా ఓర్పుతో కాలం వెళ్ళబుచ్చుతూ వుండేది.

నాన్నగారిని అనవసరంగా చీకాకు పెట్టి ఆయన మన స్సుకు బాధకల్గించడంవల్ల లాభంలేదని అమ్మభావం. ఆవిడ యెంతైనా ఆయనపత్ని, ధర్మపత్ని. పతికష్టాలలోవుంటే భారతనారి తన సర్వస్వాన్ని పణంగా పెడుతుంది. ఈ సూత్రాలు అక్షరాలా ఆవిడకు అనువర్తించాయి. ఆవిడ కూడా సంపూర్ణంగా భారత స్త్రీయేగా! మాలో ధైర్యాన్ని పురికొల్పడానికి ఆవిడప్పుడప్పుడంటూవుండేది. "జీవితంలో యెన్నో భూకంపాలొస్తూవుంటాయమ్మా! యేదో పెద్ద విషయం భయంకరంగా జరుగపోతూన్నట్టుగానె ప్రతిసారీ అనిపిస్తుంది, కాని మరుక్షణంలో ఈ భూకంపం, తుఫానుల చిహ్నాలుకూడా వుండవు. చూస్తుండగానే పగళ్ళు రాత్రు ళ్ళవుతాయి. రాత్రుళ్ళు పగళ్ళుగా మారుతాయి, జీవితం కూడా యింతే! సుఖదుఃఖాల విచిత్రకల్పన.

మీ నాన్నగారి ఐహిక భోగాల సంపాదన కారణంగా యిప్పటివరకు మనం అంతా సుఖసౌఖ్యాలతో మునిగితేలాం యేకొరతా లేకుండా అన్నిసుఖాలూ అనుభవించాం. యెప్పుడూ మనం పూలలోనే పెరిగాం. కాని నాపట్ల మాత్రం ఆయన మహా నిర్లక్ష్యంగా వుండేవారు, అయినా వారు నాభర్త, ఆయనికి నామీద సర్వాధికారాలు వున్నాయి. ఆయన యెన్నైనా యేదైనా చేయవచ్చు. కాని ఆయన నాకు దేవస్వరూపుడే! ఆయన నా విషయంలో చూపిన నిర్లక్ష్యం నేను మరచిపోయాను. కష్టాల పర్వతాలు నేడు మన నెత్తిన విరుచుకపడ్డాయి. వీటిని తొలగించుకో వడం ధైర్యలక్షణం. ఇందులోనే జీవిత భాగధేయంవుంది. సుఖానుభవం తరువాత దుఃఖానుభవం కొంచెం కష్టమే కాని

ధైర్యం వదలకూడదు. నిరాశకూ, అపజయానికీ, నిస్పృహకు తావివ్వడానికి అర్థమైన వయస్సు కాదుమీది. ఒక నూతనానుభవానికి ఆయత్త పడాలి, ప్రస్తుత జీవితాన్ని అర్థం చేసుకోవడానికి యత్నించాలి. సత్యాన్ని యెప్పుడూ అప్రియంగా భావించకూడదు. సత్యాన్ని యేదో వెలకు అమ్మడం మంచిదికాదు. సత్యాన్ని విసర్జించడమే జరిగితే మనం జయాన్నికూడా వదలుకుంటున్నామన్న మాట. సత్యం సహజమైన కాంతి. అదే మనల్ని నిర్దిష్ట గమ్యానికి చేరుస్తుంది."

అమ్మ చెప్పే బాధలన్నీ వింటూవుంటే మా హృదయాలు కంపించి పోతూవుండేవి. ఎటుతలెత్తి చూచినా కష్టపర్వతాల శిఖరాలే స్వాగతమిస్తూ ప్రత్యక్షం. బ్రతుకంతా అగ్ని పరీక్షగా వెళ్ళిపోతుండేది. అన్నయ్య జాడా జవాబు లేదు. రెండు మూడు కేసుల్లో నాన్నగారికి కఠిన శిక్షపడింది. మరికొన్ని నడుస్తున్నాయి. ఆయన బయటికి వస్తాడన్న నమ్మకం మాకేమీ లేకుండా పోయింది. ఒక్కొక్క క్షణం ఒక్కొక్క సంవత్సరంలా గడుస్తుండేది. చెల్లాయి మోహినిని అమ్మ తన పుట్టింటికి పంపివేసింది. యిది మోహిని చదువుకి అంతరాయం కలక్కుండా అమ్మ ఊహించిన యేర్పాటు. ఈ స్థితిలో కూడా నేను ఇంటర్మీడియిట్ డిష్టింగ్విష్డు (Distinguisted) గా పాసయ్యాను ఇంకా పైన చదవాలన్న ఉత్సాహం తీవ్రంగా నాలో విజృంభించింది. కాని అమ్మకు నేనిక చదవడం ఇష్టం లేదు. నా హృదయం అగ్నిలో దూకేమిడతలా అయింది. నాలో ఒక పెద్ద తుఫాను ప్రవేశించింది. చక్కగా చదువు

కొని నా కాళ్ళమీద నేను నిలబడాలన్న ఆకాంక్ష కలిగింది. అలా కాకపోతే బ్రతుకు ఎడారి యెండమావుల్లా స్వప్నంలా అవుతుందనీ అనిపించింది. కాలం నన్ను అతి క్రూరంగా త్రొక్కి నలిపి వేస్తుందన్న భయం ఉత్పన్నమైంది. భవిష్యత్తును నిర్మించుకోవాలన్న దృఢనిశ్చయంతో చదువుకొనసాగించడానికే నిశ్చయించుకున్నాను. ఎలాగైతేం అమ్మగారి ఆజ్ఞకూడా లభించింది. చాటున మాటున దాచుకున్న కొద్దిపాటినగలు అమ్మగా వచ్చిన డబ్బు నా చేతికిచ్చింది.

యూనివర్సిటీలో నాకు వెంటనే సీటు దొరికింది. హాస్టల్లో నివాసం. అమ్మ దగ్గరనుంచి ప్రతి వారం ప్రేమపూర్వకమైన లేఖ వస్తుండేది. ఎన్నోసార్లు వాటిని చదువుకొంటూవుండేదాన్ని. ఆవిడ ప్రతివుత్తరంనాలో ధైర్యాన్ని, వుత్సాహాన్ని రేకెత్తిస్తుండేది. ఉజ్వల భవిష్యుందనేఆశతో, ఉన్నత స్వప్నాలతో నేను విద్యార్థినిగా కాలంగడుపుతూవున్నాను.

కొత్తస్నేహితులు చాలామంది దొరికారు. సోదర విద్యార్థినులూ, అంతా నూతనవాతావరణం. రోజు రోజూ జీవితం అత్యంత ఉత్సాహవంతంగాజొచ్చింది. నా కొత్తస్నేహితులూ, స్నేహితురాండ్రు అంతా నాతో చాలా ప్రేమగా, చనువుగాఉంటూఉండేవాళ్ళు. క్రమ క్రమంగా వాతావరణం మంచి ఆనందప్రదంగా మారుతూంది. మళ్ళీ వెనకటి చిత్తప్రశాంతత, చీకూచింత లేకుండా బ్రతుకు గడపటం యేర్పడ్డాయి. గంటలతరబడి ఊరికే కూర్చుని అన్ని సమస్యలనిగురించి శిరోభారంగా ఆలోచిస్తూ కాలంగడిపే స్థితి నశించింది. నా చుట్టూ, ఎటుచూచినా మహాకోలాహలం.

యెక్కడ యే వస్తువుని గురించి వెదకవలసిన పనంటూ లేదు. అమ్మ ప్రక్కన వున్నన్నాళ్లూ నా హృదయం చాలా వ్యథపడి అలసిపోయివుంది. యూనివర్సిటీ వాతావరణంలో అంత వ్యధా సంతోషంగా మారింది. స్నేహితులూ, స్నేహితు రాండ్రేగాక ప్రొఫెసర్లూ, లెక్చరర్లూకూడ నా పట్ల శ్రద్ధా ళువులై వుండేవారు.

నా విషయంలో మిక్కిలి శ్రద్ధ కనుపరచిన ప్రొఫెసర్లలో రంజన్ ముఖ్యుడు. రంజన్ విద్యార్థిదశలో మా అన్నయ్య స్నేహితుడు కావడంతో, తరుచూ మా యింటికి వస్తూ పోతున్నప్పుడు అతనితో పరిచయమేర్పడింది. పరిచయం అధిక స్నేహితంగా వర్థిల్లింది. ఈ స్నేహం అతనుసర్వవేళలా మాయింట్లోనేఉండేటట్లు చేసింది.

ప్రపంచం అన్నికోణాలకీ సంబంధించిన సహజ పరి జ్ఞానం అప్పటికి నాకు యింకా అలవడలేదు. స్నేహితులూ, సరదా విలాసాలూ, చదువు తప్ప మరే అనుభవమూ నాకు లేదు. రంజన్‌ను చూస్తే అతని ముఖంలో యేదోవిధమైన ఉద్విగ్నత, వాంఛ ప్రస్ఫుటమవుతూనే ఉండేది. చాలా అందగాడనీ, ఆకర్షణీయమైన వర్చస్సుకలవాడనే చెప్పాలి.

యూనివర్సిటీ ప్రొఫెసర్లలో యితను ప్రత్యేకాశక్తిని నా పట్లకనపరుస్తూ అప్పుడప్పుడూ మా అన్నయ్య సంగతి కూడా ప్రస్తావిస్తూవుండేవాడు. ఎంతో సానుభూతిప్రదర్శించే వాడు. ఇది తిరిగి నాకు కొంత మనస్తాపాన్ని అశాంతిని రేకొల్పింది రంజన్ మాటల్లో అతన్నిగురించి అనుమానించ వలసిన లవలేశ విషయంకూడా కనబడక పోయేది. రంజన్

నాకు అన్ని విధాల సహాయం చేయడం కూడా జరుగు తూండేది. ప్రత్యేకమైన అవసరం యేదన్నా యేర్పడినప్పు డల్లా నేను రంజన్ వద్దకు పరుగెత్తు తుండే దాన్ని. అతను యెవ్విధమైన తొట్రుపాటు, ఆలోచనా లేకుండా నాకు కావలసిన సహాయం చేస్తుండేవాడు. అతనెప్పుడూ నా డిమాండ్ ని కాదన లేదు. అతని ఈ నిస్వార్థ ప్రవర్తనతో అతనంటే నాకో విధమైన అభిమానం యేర్పడింది. అతను పూజించడానికి అర్హుడనిపించేది. అతని గుణగణ విషయాల్లో నాకు సంపూర్ణ విశ్వాసం కుదిరింది. ఆదివారం వచ్చినప్పు డల్లా అతను తన బ్యూక్ కారుతో నావద్దకి వచ్చేవాడు. తరువాత యిద్దరం కలసి హాయిగా తిరిగి తిరిగి హాస్టల్ చేరుకునే వాళ్లం. నాకు అన్నయ్యంటూ ఒక రున్నప్పటికీ, అతనిని కూడా ప్రేమగా అన్నగా భావించుకొన్నాను. ఈ విధంగా మా మధ్య ఆంతర్య ప్రేమ అధికమయింది.

రంజన్ యెప్పుడూ నాసౌందర్యాన్ని మెచ్చుకుంటూ వుండేవాడు. మెత్తని నా నీలాల కురులతో ఆడుకొంటూ తలనిమురుతూ కూర్చునే వాడు, మాటిమాటికీ నా చేతిని తన చేతిలోకి తీసుకుంటూ లాలిస్తుండేవాడు. నేనతన్ని నా అన్నగా భావిస్తుండేదాన్ని. అతని సంజ్ఞతో యేది చేయా లంటే అది చేసేదాన్ని. సినిమాలకు వెళ్ళడం, డాన్సు పార్టీల్లో పాల్గొనడం, కేమరుచేస్తూ ఆడడం, జరుగుతోం డేది. ఆనందంతో రంజన్ నన్ను కౌగలించుకుంటే నేనువా రించ లేకపోయేదాన్ని. నన్ను దేవలోకపు పారిజాతపుష్పం అని వర్ణించుతుండే వాడు. చిరునవ్వు నవ్వుతుండేవాడు, ఇదంతా అన్న తన స్వంతచెల్లెలిపట్ల చూపించే అమృత

ప్రేమగా నా అనుభవాని కందుతూండేది. అతన్ని అపార్థం చేసుకోవడానికి, మన స్తత్వాన్ని శంకించడానికీ, నాకేవిధమైన కారణం కన్పించలేదు.

గృహకల్లోలాల జంజాటనుండి విముక్తి లభించాక రంజన్ హృదయశక్తివల్ల నాలో మళ్లీ ఒకవినూత్నోత్సాహం పెల్లుబికింది. నాకోసం సిల్కు-చీరెలూ, బ్లౌజులూయింకా అవసరమైన టాయిలెట్ సామానూ అంతా కోరకుండానే రంజన్ తెచ్చిపడేస్తుండేవాడు. యిక అతన్ని నేను ప్రేమగా ఆదరించకుండా ఎలావుండగలను? అతన్ని అలా తల్చుకుం టేచాలు నా మనస్సులో ఆనందతరంగాలు పొర్లి విజృంభిస్తుండేవి. అతని ప్రతివాక్కు అమృతబిందువులా మధురం అనిపించేది. మధ్యకాలంలో సుఖాలూ, విలాసాలంటే నాకు రోత జనించింది. మా అన్నయ్య ప్రవర్తన నాకు నరకప్రాయం అనిపించేది. అప్పటి అనుభవాల ప్రభావం యింకా నా మనస్సులో గాఢంగానే వుండేది. రంజన్ ప్రవర్తన, అతను వెల్లడిస్తున్న ప్రేమ నన్ను యావద్విషయాలనూ మరిపింపజేసింది. క్రమంగా ఆ దుర్భర వాతావరణం తెర నా మనసుమీది నుంచి తొలగిపోతూ ఆస్థానంలో మైత్రీభావాలపొరలేర్పడుతూ వచ్చాయి. రంజన్‌తో నేను చాలా స్వేచ్ఛగా మెలగుతుండే దాన్ని. ఆతని ఉపకారాలకు నాకు ఒక్కొక్కసారి సిగ్గనిపిస్తూ 'అతనికి మనవల్ల కలిగే లాభం యేమిటి పాపం!' అన్న ఆలోచనతో కృతజ్ఞతాభావం పొందుతుండేది. నా శిరస్సును క్రుంగదీసిన ఆ ఉపకారభారం అతనికి అప్రియమైన విధంగా నేను యెన్నడూ ప్రవర్తింపకుండా చేసింది నేనేపనిచేసినా, యెటువెళ్ళినా రంజన్ అనుమతితోనే జరిగేది. అతని మార్గ

పర్యవేక్షణలో, పరిపోషణలో, నా విద్యాభ్యాసం చివరంటా కొనసాగి, పెద్ద డిగ్రీని తీసుకుని లక్ష్యాన్ని సాధించాలన్న వాంఛ నాలో ప్రబలమైంది. నే నిది సాధించగలనన్న సంపూర్ణ విశ్వాసం నాకుంది. ఇంకా రంజన్ విషయంలో పెట్టుకున్న ఆశలు ఎన్నో వున్నాయి.

నేను రంజన్‌ను దేవతలా ఆరాధిస్తుండేదాన్ని. రోజు రోజూ అతనిపట్ల గౌరవభక్తులు నాకు అధికమవుతూ వచ్చాయి. అతని సలహా సహకారాములలో జీవితాన్ని ముందుకు సాగించాలని, యీ విషయంలో అతను నన్ను నిరాశపాలు చేయడనీ, గట్టి నమ్మకంతో వుండిపోయాను. అతను ఎప్పటివలె నా సౌందార్యాన్ని నా చెక్కిళ్ళనూ, వుంగరాల ముంగురులను వర్ణిస్తూ అధికాధికంగా నన్ను ఆదరిస్తూ వుండేవాడు. నా కతనిపట్ల పవిత్రభావంతో పాటు గురుభావంకూడా యేర్పడింది. ఏదేమైనా అతనిలో ఒకదివ్యాకర్షణవుంది. ఆ ఆకర్షణలో పడింతరువాత ఆలోచించడం పడదిక. ఆవ్యక్తిత్వం గాఢంగా హృదయం లోతుల్లో పాతుకొని పోయింది—.

ఏవిధమైన ప్రేమార్ద్రభావమైనాసరే ఒకవ్యక్తిపట్ల అంకురించినప్పుడు దానిలో ఒక పవిత్రత యేర్పడుతుంది. పవిత్రసద్భావం, ప్రేమ ఈ రెండూ ఒక వస్తువుకుగల రెండు ప్రక్కలవంటివి. ఆవిడ చెల్లెలు కావచ్చు, లేక పెళ్ళాం కావచ్చు, లేక తల్లిగాని మరొకరుగాని కావచ్చు. కాని స్త్రీ యెప్పుడూ తన ప్రేమ నిర్మలంగా, నిరహంకారంగా, నిత్యనూతనంగా వుండేలా చూచుకుంటుంది. ఏవో సాధారణ

సంఘటనల ప్రభావానికి లోబడి, బలహీన హృదయంతో, తన ప్రేమభావాన్ని ఆవిడ త్వరగా చెరిపివేసుకోవడానికి అంగీకరించదు. ఈ కారణంగా అనుదినం ఆవిడ తన హృదయంమీద రంపపుకోతను కూడా భరించలేదు. ఆవిడ ఆర్ద్రతనీ, సున్నితత్వాన్నీ, నలిపివేయడాన్ని సహించదు. చదువు, ప్రేమలకోసం స్త్రీ సర్వధా తన ప్రాణాన్ని అర్పిస్తుంది. ఇది స్త్రీ మానసిక ప్రవృత్తిలో సహజంగా యిమిడి వుండేతత్వం. యే కొద్ది వుపకారానికైనా ఆవిడ హృదయం కృతజ్ఞతతో నిండిపోతుంది. ఎంత చదువు, ఎంత సంస్కారం కలదైనా, అమాయకత్వం సహజగుణం ఆవిడలో వుంటుంది. పురుషులు నేర్పుగా ఆవిడలోగల యీ బలహీనతల్ని ఉపయోగించుకొని అక్రమలాభం పొందడానికి తరుచుగా యత్నిస్తుంటారు. ఇది వారికి సహజం అని అనలేనుకాని బలహీనత అనవచ్చు.

నేను నా జీవితాన్ని ఒక సంఘటనగా రూపొందించుకోదల్చుకోలేదు. ప్రశాంతంగా సుఖజీవితం సాగించాలన్నది నా ఆకాంక్ష. ప్రథమంలో సుఖం, తరువాత సుఖానుభూతి విపఫలితం పట్ల విరక్తి, నేను అనుభవించాను. కాని నేనెప్పుడూ జీవితంగురించి నిరాశపాలు గాలేదు. జీవితంతో పోరాడి యుద్ధంచేసైనా సరే, జయించాలనే ఈ చదువు నిమిత్తం పట్టుదలచూపి అర్హత సంపాదించుకున్నాను. తరువాత రంజన్ తటస్థపడడంతో సంతోషకర పరిణామం మరోటి యేర్పడింది. ఈ పరిణామాలలో పురివిప్పిన నెమలిలా మనస్సు నృత్యంచేసింది. ఈ స్థితిలో మహానంద నిలయంలో మళ్లా భూకంపంలాంటిది సంభవిస్తుందని కానీ,

సంభవిస్తే దాన్ని యెదుర్కోవడానికి కానీ, నేను సిద్ధంగా లేను. రానురాను నా వునికి మరీకోమల మవుతూ వచ్చింది. భవిష్యత్తులో నవనవోజ్వల రమ్యంగా సహస్రబాహువుల్తో నన్ను ఆహ్వానిస్తున్నట్లు కళ్ళకు కనబడేది. ఇదికూడా నా ఆలోచనలో గల ఒక బలహీనత. అసలు స్త్రీ జాతి బలహీనతలో మొదటిది. ఆవిడ వెట్టినమ్మకం, ఎవరినైనా యిట్టే నమ్ముతుంది. స్త్రీ, నేనుకూడా ఎంతైనా స్త్రీనే! రంజన్ని మనసారా నమ్మి అతన్ని నా అన్నగా, మార్గ దర్శకుడుగా, రక్షకుడుగా, జీవితాకాశంలో ధృవతారగా, యెంచుకున్నాను. అతని ప్రవర్తనకి యెంతో ప్రభావితురాలనయ్యాను. అతని కోసం నా ప్రాణం యిచ్చేయాలన్నా నేను సిద్ధం అయినాను. ఇంతకుమించిన అన్యాభిప్రాయం నాకు మరేదీలేదు. సువిశాలమైన అవధుల్లేని మహాప్రపంచంలో నన్ను ఆదరించి, రక్షకుడుగా అతను నన్ను ఆదరించాడు. తుఫాను తాకిడికి ఊగిసలాడుతున్న నా జీవిత నావకి అనుభవజ్ఞుడైన సరంగుగా చుక్కానివద్ద నిలబడ్డాడు. నా నిర్జీవ హృదయంలో ఒకానొక ప్రకాశం. ఆర్ద్రితసృష్టి అయింది.

ఈ ప్రపంచం, ఈ కఠోర ప్రవృత్తిగల వాతావరణం ఎవర్ని సుఖంగా వుండనిస్తుంది? అవసరాలూ, ఆదర్శాలూ, ఆ కాంక్షలు అన్నీ యిక్కడ క్షణాల్లో ఆహరించుకుని పోతాయి. హృదయం, మేధ బండబారి ఆర్ద్రిత, జిజ్ఞాస, నామరూపాల్లేకుండా అంతం అయ్యేస్థితి తప్పనిసరిగా తటస్థిస్తుంది. చుట్టు ముట్టుకున్న పరిస్థితుల స్వాభావం అర్థంచేసుకుని, స్పృహలో యెదురు అస్త్రం సాధించబోయేలోగానే యీ

శిలాహృదయ భయానక సమాజం- వ్యక్తిత్వాలని అణగ ద్రొక్కి- భూపతనంచేసి పారేస్తుంది. అప్పుడీ విషయాల్లో నాకున్న అనుభవం బహుస్వల్పం, దాదాపు శూన్యం అనే చెప్పొచ్చు. కన్నుమూసి తెరిచే లోగానే వున్న పరిస్థితులు మారిపోవచ్చన్న విజ్ఞానం నా అనుభవంలో అప్పుడు లేదు. మన ప్రాణస్నేహితులే ప్రమాదకరమైన శత్రువులవుతారనీ, సమాజాన్ని ఆమూలాగ్రం సంస్కరించి మంచి మార్గానికి త్రిప్పదలచే వారే సమాజానికి అరిష్టదాయకంగా తయా రవుతారనీ నాకు తెలీదు...ఆశ్రయంకోశం వెళ్ళితే విస్ఫు లింగాలు ఆహ్వానించి భస్మంచేస్తాయని నా అపరిణతమనస్సు ఊహకి అందలేదు. ఈ ప్రపంచరంగంలో అడుగడుగునా, మోసం, అన్యాయంతప్ప మరేమీలేదు. అమృతంకోసమని విశ్వసిస్తే- ఆదరిస్తే- కాస్సేపటికి ఆ చిరునవ్వే విషం పుక్కిలి స్తూంటుంది. సమాజాన్ని మరమ్మత్తు చేయాలని ఉపన్య సించేవారే దాన్ని మరీ అసహ్యంగా, కలుషితంచేసి వదులు తారు. సమాజ శ్రేయస్సు పేరుతో, తమ పశువాంఛలని పూర్తిచేసు కుంటారు. అదే ప్రయత్నాలలో జీవిస్తుంటారు.

రంజన్ సహాయంతో నా భవిష్యత్తు ఉజ్వలంగా యేర్పడుతోందన్న గట్టి విశ్వాసం నాకుండేది. కాని అతనే నా సాధారణ భవిష్యత్తుని కూడా అడ్డగించిన ఇనుపరాతి గోడగా నిలబడ్డాడు. నేనతనికి క్రమక్రమంగా యెలా సమీప పరిస్థితికి చేరుకుంటున్నానో, అతను అలానే తన వాంఛా భూతాలని సహజనగ్నంగా బయట పెడుతూండడం ప్రారంభ మైంది. ఎంతో మర్యాదస్తుడనీ, నిస్వార్థుడనీ, భావించిన అతనే అంతానికి పెనుభూతంలా అగుపించాడు. నేనాశించిన

కాంతిపథానికి కాక, ఒకసారి వెళ్ళితే యిక యెన్నటికీ తిరిగి రాలేని మహాంధకార గహ్వారానికి నన్ను లాక్కెళ్ళడానికి రంజన్ ప్రయత్నించాడు.... అతని ఉపకారాలని గురించిన ఆలోచనతో నా మనస్సు బరువెక్కుతుంటే, వాటికి ప్రతి ఫలాన్వేషణలో అతను సతమతమవుతూండేవాడు. నెత్తిమీదకు వచ్చాకకాని నాకు అతని ప్రవర్తనలోని అంతరార్థం ఊహించాల్సిన అవసరం కలగలేదు. ఈ ఊహ ఉభయుల మధ్యా విద్వేషానికి మూలమైంది రాజా!" అని కొంచెం ఆగింది,

రాజుకు నవ్వాగలేదు. ప్రయత్న పూర్వకంగా నిగ్రహించుకొంటూ. "నీ రూపం, నీ ఉనికి, అలాంటివి కమలా రాణీ! యే వ్యక్తిభావంకాని నీ ఉనికిముందు పవిత్రతని నిలబెట్టుకోలేదు. దేవతలకైనా ఇది అసాధ్యమేనేమో!...... యిక ప్రొఫెసర్ దేమిటి? పాపం! అతనూ యిరవైయవ శతాబ్దపు ద్వితీయార్థం వాడే గదా! అది అతని దోషం కాదేమో!" అన్నాడు.

"అయితే చెల్లెలిమీద అన్న దుర్వాంఛలని కలిగి వుండడం దోషం కాదంటావన్నమాట?... అందమైన ముఖ వర్చస్సుతో జన్మించడం పాపమా?... చెల్లెలు అమిత సౌందర్యవతిఅయితే అన్నకి కామం ప్రకోపిస్తుందా? లైంగికవాంఛలతో బాహ్యజగత్తుని విస్మరించినప్పుడు యిక మనిషికీ, పశువుకీ, పిశాచానికీ, అంతరం యేమిటి? ఈ పశు వాంఛనేనా ప్రేమ అనేది. ఇది ప్రేమకాదు. ఆ శబ్దానికి తీరని అవమానం! అపచారం! తల్లి అనీ, చెల్లెలనీ వరుసతో

పిలుస్తూ, వారితో విలాసజీవితం సాగించాలని యత్నించటం, ఎన్నటికీ క్షమింపబడని నేరం.

ఒకవైపు అభిజాత్యం, మానవత్వం ప్రదర్శిస్తూ, మరో వైపు స్వీయవిషయాల్లో అంతరంగికంగా చెల్లెలితో కూడా కామ కలాపానికి సిద్ధం కావడం యిదేనా మానవత్వం ?" అంది ఆవేశంగా కమలారాణి.

"మనిషి బయటికెలా వుంటాడో అంతరంగికంగా నూ అలానే అంతర్యంలోలాగే, బహిఃస్థితిలోనూ వుండాలనీ, ఆ సుదినం త్వరలో రావాలనీ, నా ఆకాంక్ష కూడాను కమలా రాణీ! సరే, కానీ ఆపుచేయక ప్రొఫెసర్‌గారి అమృత ప్రేమకథ" చిరునవ్వు నవ్వుతు అన్నాడు రాజు.

"నన్ను ప్రసంగానికి ప్రోత్సహించింది నీవే రాజు! చెబుతా; కాని మరోకప్పు టీ పుచ్చుకో." అంది కమలా రాణి నవ్వుతూ.

"మంచి రుచికరంగా టీ తయారుచేసేట్టుందే నీవు. ఎలా చేస్తావేమిటి? "నాచేతి టీ కూడా మంచి రుచికరం. అది మీ హృదయం కృపయే!"

"పాపం! ప్రొఫెసర్ నీకోసం యెంత దుఃఖపడు తున్నాడో గద? ప్రొఫెసర్‌కి ఏడవాల్సిన తీరికెక్క డుందని? ఈ పాటికి యెందర్ని చెల్లెళ్ళుగా చేసుకుని, తరువాత లైలాలుగా మార్చుకున్నాడో? అయినా మగవా ళ్ళయేడుపుకీ, కన్నీళ్ళకి, మాత్రం విలువేమిటి? బులిపించి, వలపించడాని కిదోయెత్తు. వాళ్ళు చనిపోతే తాముకూడా బ్రతకలేమన్నంత బాధగా కన్నీళ్ళవాన కురిపిస్తారు. తమ

పబ్బం గడిచేదాకా మనస్సులోతుల్ని బయటబెట్టరు. ప్రొఫెసర్ చేష్టలన్నీ, అతని ఆర్ద్రహృదయానికీ, స్వచ్ఛమైన ప్రేమకూ నిదర్శనాలని భావించాను; కాని శంకించలేదు. అదే దృష్టితో ఈ చర్యలని హృదయ పూర్వకంగా సహిస్తూ వచ్చాను. నావల్ల అతనికి యే విధమైన అసంతృప్తి, బాధ కూడా కలక్కుండా వుండాలన్నది నా ముఖ్యాభిప్రాయం. కాని నా కృతజ్ఞతా హృదయాన్ని తీవ్రంగా బలహీనపరచి నా వద్దగల సంపదని దోచుకోవాలనే తాపత్రయంలో పడ్డాడు. నేను అతని సోదరిని కావడానికే సిద్ధపడ్డాను. కాని ప్రియురాలిని కావడానికి సిద్ధపళ్లేదు. ఇతర విద్యార్థినులు మరి కొందరితోకూడా రంజన్ యిలాగే ప్రవర్తిస్తున్నాడన్న సంగతి చూచాయగా నాకు తెలిసిన నాడు నేను నమ్మలేదు. అతను తన వాత్సల్య, దయాగుణాలని ఎరగా పెట్టుకొని, ఎంతమందిని వంచితుల్ని చేశాడో! ఇంతజేసినా అతనిపట్ల ఎవరికీ ద్వేషం కానీ, విరోధ భావంకాని లేవు. చూడు! ఎంత చిత్రమో!

అవి వేసవి సెలవులు. సెలవులు ప్రారంభమైననాడే అమ్మ దగ్గరకు వెళ్ళి రావాలని నేను ప్రోగ్రామ్ వేసుకున్నాను. కాని రంజన్ అభ్యర్థనని త్రోసివేయలేక, ఒక పది రోజులు అతని వద్దనే అతిథిగా విశ్రాంతిగా గడపదల్చుకున్నాను. హాస్టల్ వదలి, రంజన్ యింటికి మకాం మారింది. అది నిజంగా నా సొంత ఇంటిలానే భావించుకున్నాను.

ఒక నాటి రాత్రి :—నేనేదో మంచి పుస్తకాన్ని ఒకదాన్ని ఏకదీక్షతో చదువుకొంటున్నాను. ఒంటరిగా గదిలో వున్నప్పటికీ తలుపు వేసుకోవాలన్న అభిప్రాయం నాకు కలగలేదు. అలా రాత్రి రెండు గంటలవరకూ చదువుతూనే వున్నాను. మైకంలో సంపూర్ణంగా తూగుతూ, ప్రొఫెసర్ నా మంచం వద్దకు హఠాత్తుగా వచ్చాడు. రావడంతోనే మారుమాటగానీ, ప్రశ్నగానీ లేకుండా నన్ను గట్టిగా కౌగలించుకున్నాడు. "నేను నిన్ను ప్రేమిస్తున్నా ?...నా ప్రేమకు సాటిలేదు...నీ ప్రతి కదలికనీ, ప్రతిభంగిమనీ ప్రేమిస్తున్నాను. కమలారాణీ! ఇవాళ నీ సర్వస్వాన్నీ నాకిచ్చేయాలి నీవు. నేనిక యేమాత్రం భరికచలేను రాణీ!" అంటూ తడబడుతూ బలంగా నన్ను బంధించి వేశాడు—కౌగిట్లో !

హఠాత్తుగా జరిగి ఈ సంగటన నన్ను నిశ్చేష్టురాలిని చేసింది. ఏదో పెద్ద పులివచ్చి నామీద పడినట్లయింది. కోటి సర్పాలు నన్ను పెనవైచుకొని కాటేస్తున్నట్టనిపించింది. ఆ పాద మస్తకం వణికిపోయాను. నా నరాలన్నీ నిప్పుపడి మండిపోతున్నాయి యే సుందర స్వప్నాన్ని ఆధారంగా చేసుకొని నేను జీవితం నిర్మించుకుంటున్నానో, ఆ స్వప్నం అరక్షణంలో భస్మమై పోయింది. ప్రొఫెసర్ ఇలాంటి సిగ్గు మాలిన పనికి దిగుతాడని నేను కలలోకూడా అనుకోలేదు. నాకు అతనిపట్లగల పవిత్రభావం గంగలో కలిసిపోయింది, ఆశ్చర్య, భయ, సందేహ, ఆందోళనలు నా గొంతు నులిమివేస్తుంటే నేను కొంచెం సంబాళించుకుని ఇలా అన్నాను.

"నేను నిన్ను అన్నగా భావించుకుంటున్నాను. నన్ను వదులు రంజన్ !"

"నేను మాత్రం నిన్ను చెల్లెలని పిలవడంలేదూ? పిచ్చిదానా! ఈ చెల్లెలూ అన్నల సంబంధాలు ఏకగర్భస్తులకు కాని మనకెందుకు: లోకంకోసం తప్ప? సమ్మేళనానికి ఇదో ఆధారం. అంతే తల్లీ అని ఎవతెనన్నా గౌరవంగా పిలిస్తే తల్లి అవుతుందా? చెల్లీ అని పిలవగానే చెల్లెలవుతుందా? నీవు నన్నెప్పుడూ అన్నా అని పిలవ్వొచ్చు. అభ్యంతరం యేముంది? ఇది వ్యావహారిక జగత్తుకు మాత్రమే." అన్నాడు రంజన్ వికటంగా నవ్వుతూ.

నా ఒళ్ళు భగ్గున మండిపోయింది. అతనిపట్టు విడిపించుకుంటూ "నీవింత సిగ్గులేని వాడవని నాకు తెలీదు ప్రొఫెసర్ !" అన్నాను.

"ఇందులో సిగ్గులేనితన మేముంది? మనం స్త్రీ పురుషులం. సహజమైన పనేకాని అసాధారణమూ, అసహజంగా మనం ప్రవర్తించడంలేదు. అంతేగాక ప్రకృతి మనకు విధించిన బాధ్యతను నిర్వర్తిస్తున్నాం. ఎవరికైనా యిదితప్పదు. దీన్ని సిగ్గులేనిపని అనేవాళ్లు వట్టి బుద్ధిహీనులు. గాడిదలు. నేను స్త్రీని సహజదృష్టితో స్త్రీగానే చూస్తాను. కమల్ ! ఈ త్రుప్పు సాంప్రదాయాలనీ, ఆచారాలనీ, నీవు మరచిపోవాలి. అవన్నీ వట్టిచెత్త. గాలికబుర్లు. ఇలాంటి ఆలోచనలోనే; నీవు కోమలత్వాన్ని కృశింపజేసుకుంటునావు. ఉన్న కొద్ది సమయంలోనే సుఖపడేమార్గం వెదుక్కోవాలి." అన్నాడు.

నాకు మరీ అసహ్యం అనిపించింది. "నీవువట్టి పశువ్వి, ఇంకా ఆ పశువు నీకంటే వేయిరెట్లు నయం. దానికన్నా తుచ్ఛుడివి. నన్ను వదలిపెట్టు. లేకుంటే బావుండదు. నీమానమర్యాదలన్నీ నాశనం అవుతాయి."

అంటూ ఘోరంగా ఎంతో పెనగులాడి ఆ వజ్రబంధనం లోంచి బయటపడ్డాను. నాకు కోపం రెచ్చిపోయింది. వాడు ఉన్మత్తుడిలా యింకా నావైపు రాబోతూంటే నాకు పరిజ్ఞానం నశించింది. బల్లమీద పళ్లెంలో సీమరేగు పండ్లూ (సేబులూ) ఒక చిన్న కోతకత్తీ అమర్చి వున్నాయి. తక్షణం నేను దాన్ని అంది పుచ్చుకున్నాను.

"రంజన్ ! ... అడుగు వేశావంటే ఖూనీఅవుతావు జాగ్రత్త. అనవసరంగా కుక్కచావు చావకు. నాయీ చేతులతో విశ్వాసఘాతకిలా నిన్ను హత్యచేయవలసిన దుస్థితి రాకుండా చూచుకో" అని గర్జించాను. అంతపెద్దగా కఠోరంగా నేనెట్లామాటాడగలిగానో యిప్పటికీ నాకు అర్థం కాదు. నాలో కలిగిన ఈ పెనుతుఫానులాంటి పరిణామంతో పాపిష్ఠిఫేసరే హడలిపోయాడల్లేఉంది. పిల్లిలా మెల్లగా వెనుకడుగులు వేస్తూ అవతలికి జారుకొన్నాడు. మైకం వదలినట్లుంది. అతను అటువెళ్ళగానే నేను గదితలుపులనూ, కిటికీ తలుపులనూకూడా మూసి బిగించుకొన్నాను.

రంజన్ విషయంలో, లోగడనుంచీ నాకున్న ఉన్నతభావం పటాపంచలైపోయింది. నాలో అగ్నిజ్వాలలు రేకెత్తాయి. ధారాపాతంగా కన్నీళ్ళవర్షం ప్రారంభం అయింది. రంజన్‌ని అమాంతంగా పొడిచి చంపేయాలనీ, లేకపోతే

ఆత్మహత్యయైనా చేసుకోవాలని అనిపించింది. నాఒళ్ళు వణికిపోతుంటే, నామీద నాకే రోతపుట్టింది. ఇంతపశువును సోదరునిగా నేనెలా భావించాను. వీడికంటే మాఅన్న యెన్నో లక్షలరెట్లునయం. వాడుదొంగ కావచ్చు. కాని ఈరకం పశుత్వంలేదు. ఆలోచనల్తో గదిలోనే నాప్రాణం అంతమౌతుందేమో ననిపించింది. బంగారు కలలన్నీ ఒక్కొక్కటే భస్మమవుతూ, కళ్ళముందు కన్పించాయి. ప్రొఫెసర్ ప్రవర్తనతో నాకు మనసు విరిగిపోయింది. వేయిముక్కలైంది. నా ఆశలూ, ఆదర్శాలూ, భస్మం అయిపోయినాయి. ఇకనాకు మిగిలింది నామమాత్రమైన శరీరమేననిపించింది. ఇదే కాలిపోకుండా మిగిలింది. వట్టి దగాకోరు, దౌర్భాగ్యుణ్ణి- నేను, నా మార్గదర్శకునిగా, రక్షకునిగా నిర్ణయించుకున్నాను.

స్త్రీ యెంతత్వరగా మోసానికి గురిఅవుతుందో నా యీ జీవితమే నిదర్శనం రాజా! ఏ స్త్రీ జీవితంలోనైనా ప్రవేశించి లోతునిమనం వెతగ్గలిగితే, అక్కడకనుపించేదిఆమె పట్లజరిగినఅన్యాయం, అత్యాచారం,మాత్రమేలభిస్తాయికాని ఆదరణకాదు. అభిజాత్యంపేరుతో ఆడవాళ్ళని దోపిడీ చేసిందిలోకం. ప్రేమ పేరుతో వచించింది. మర్యాద, ధనం, పేరుతో మోసగించి యివాళకూడా అడుగడుగునా స్త్రీ అమ్ముడుపోతూనేవుంది. కపటమర్యాదని, నయాన్ని, నిజమని నమ్మి స్త్రీ జాతి ఉరికే గోతిలోపడి సర్వనాశనమవుతోంది. ఈ మర్యాదస్థుల వలలో అమాయకులైన ఎంతోమంది యువతులుచిక్కి, తమజీవితాంతం పశ్చాత్తాపంతో రోదిస్తుంటారు.

"చచ్చాంపో?... ఈ ప్రొఫెసర్ లానే మగవాళ్ళంతా గాడిదలనుకుంటున్నావా? మగజాతి మీదనే విశ్వాసంపోగొట్టుకొని కత్తి దూసేస్తున్నావే!" రాజు ప్రశ్నించాడు

"అవును... విశ్వాసం నశించింది! రాజా! నిజంగానే...నా యీ జీవితయాత్రలో చాలామంది పురుషులు తారసపడ్డారు. అందర్నీ నేను దేవతలుగానే భావించాను. అందర్నీ విశ్వసించాను. ప్రతివిశ్వాసం నన్ను గాయపరుస్తూనే వచ్చింది. ప్రతివారి ప్రవర్తన నిరాశగానే కన్పించింది. అందరి వ్యవహారధోరణి, జీవితంలో అభిమానాన్ని అంతం చేసేదిగానే పరిణమించింది. ఈ పెద్ద మనుషులందరిమీదా బహిరంగంగా ప్రతీకారం తీసుకోవాలనిపిస్తున్నది. కాని ఒక సాధారణ స్త్రీని. ఎందరిమీదనని, యెలాపగ తీర్చుకోను? అసాధ్యం. తీర్చుకుంటే ఈ వాతావరణాన్ని మార్చగలనా? ఈ అసహ్యపు పంకాన్ని ఒక్కర్తెనే కడిగి శుభ్రం చేయగలనా? యేదో ఒక పెనుగాలి, విలయాగ్ని రేగి పాతదంతా తుడిచిపెట్టుకపోయి, అసాధారణంగా పరివర్తన రావలసిందే! ఈ పరివర్తన యెప్పుడు వస్తుందో చెప్పలేను. తోచదు. మానవ వ్యక్తుల అంతర్బహిర ప్రవర్తనల్లో సారూప్యం కలిగిననాడే యిది సాధ్యం. ఇది సాధ్యంకావాలంటే యెన్నో మహోద్యమాలు, ఆత్మసంస్కారకృషి మౌనంగా సాగవలసివుంది. మానసిక సంఘర్షణలు అధికంకావాలి. మానసిక విప్లవం పెద్దయెత్తున రావాలి. దాంతో సమాజ స్వరూపం మారిపోవాలి. పెత్తనం, గౌరవంచాటున నేరంచేసే సాహసం తిరిగి తలెత్తకుండా పోవాలి. ఇవాళా, రేపూ నేరానికి తగిన శిక్షలుకూడా యెక్కడాలభించడంలేదు. నేరాలు

అధికం కావడానికీ వాటికి అలవాటు పడడానికి ఇదో ముఖ్యకారణం కూడాను. నేరాలు చేస్తూకూడా తాము చేస్తున్న నేరాన్నిగురించి ఆత్మలోనైనా గమనించనంత స్తబ్ధమైపోయింది ప్రపంచం. మనుష్యులు మనస్సులుకూడా ఆత్మప్రబోధాన్ని వినననంత కఠినంగా కరుడు గట్టుకొని పోయాయి. బహుశా మనుషులకు ఆత్మ అనే వస్తువున్న సంగతికూడా వీళ్లు విస్మరించినట్టువుంది.

"అబ్బ! ఘోరమైన విమర్శ జేసావు కమలారాణీ! నీవు విమర్శకులకు గురువుగా ఉండదగ్గదానివిసుమా! ఆత్మ కథ సాకుతో అధునాతన ప్రపంచంమీద కత్తివిసుర్లు విసురుతున్నావు. దాని సారస్యాన్ని నగ్నంగా బయట పెడుతున్నావు. ఈ నీ ధాటికు నావంటి విమర్శకుడి మనస్సు కూడా తూట్లుపడి జల్లెడలా అవుతుంది"

"ఓ! ... అంత సుకుమార హృదయం మీది. పాపం! పురుషుల్ని పొగడితేనే మీకు ఆనందం కలుగుతుందా! మీరుకూడా పొగడ్తలకు ఉబ్బిపోతారనిపిస్తుంది. ఎంతచెడ్డా మగవాళ్ళుకదూ?"

"అవును ... సందేహమేముంది!" అంటూ పక్కున నవ్వాడు రాజు. కమలారాణికూడా యీ మాటకి విరగబడి నవ్వింది.

"అబ్బ! యెంత చక్కని ప్రత్యుత్తరం. ప్రాణంతీసుకోవాలనిపిస్తోంది. అరె! ప్రాణం తీసుకోవాలనిపిస్తోందేమిటి? ఈ దీనుణ్నికూడా నీతో బాటు ముంచాలని వుందేమిటి కొంపతీసి?

"అంతటి సాహసమే వుంటే యీ చిక్కుల్లో పడ్డ డమే సంభవించేదికాదు. యిలా నిరంతరం కన్నీళ్ళతో, వెక్కిళ్ళతో కాలంగడిపే అవసరమే కలిగేదికాదు."

"అబద్ధం, మాటమాటకూ విరగబడినవ్వుతూ యేడుస్తున్నానని, కన్నీళ్ళు కురుపిస్తున్నాననీ అంటావేం? ఎక్కడా యేడుపుచిహ్నంకూడా లేదే?"

"అవును రాజా! విరగబడి నవ్వటం అలవాటైంది. ప్రస్తుతం యిదే జీవితాలంబనం. ఇదిలేందే నేను శూన్యం. దీన్నికూడా హరించుక పోవద్దని భగవంతుడిని సదా ప్రార్థిస్తుంటాను."

రాజు కొంచెం విమర్శనా దృష్టితో "నీ నవ్వుకో, నీకో, శుభం. నేను శాపం ఈయనుకాని, నీ నవ్వులో సహజత్వం గోచరంకాదు. దీనివెనుక బాధాపూరిత ఆక్రందనం వినవస్తూవుంది. నీవు నవ్వుతూంటే యేదో యేదో ఆకస్మిక బాధని నిగ్రహించుకొంటూవున్నట్లుంటుంది. దేన్నో మరచి పోవాలని నవ్వుతూన్నట్లుంది" అన్నాడు.

అక్షరాలా నిజంరాజూ! నీవునానవ్వుని సరిగాఅర్థం చేసుకున్నావు. నాబాధని పట్టేశావు. యేనాడునాకు నవ్వు రాదో ఆనాడు నాబ్రతుకే అంతంఅవుతుంది. దేనిమీదా నిర్బంధం విధించదల్చుకోలేదు. నేను నాతో మాట్లాడ వచ్చిన వారందర్నీ చిరునవ్వుతో సాదరంగా ఆహ్వానిస్తాను. అందంతో అలా చిరునవ్వుతో మాట్లాడ్డం కొత్తకొత్త చిక్కులకి దారితీస్తుందని నేనెన్నడూ ఆలోచించను. విశాలమైన ఈబ్రతుకు ఎడారిలో నవ్వలేనిజీవికి బ్రతుకు బరువవుతుంది. యెప్పుడూ నిరాశపడిపోయేవారు తమనుతామే కష్టా

లకు గురిచేసుకుంటారు. బ్రతుకునుంచి తప్పించు కొందామని పారిపోయే రకాలు యెక్కడా సఫలంకాలేవు. నిరాశావాదంతో వ్యక్తిత్వమే పతనమైపోతుంది. జీవితరసంనుంచి వంచితుడవుతాడు. అందుకే నవ్వడంపనిగా పెట్టుకున్నాను.

ఈసరికే బ్రతుకుతో నేనెన్నిగింగిరాలు తిరిగానో నా మనసుకే తెలుసు. ప్రతిదెబ్బ నాకో క్రొత్త జీవితానుభవాన్ని ప్రసాదిస్తూవచ్చింది. అన్నివిధములకష్టాలని ఆటంకాలనియెదుర్కోవడం జంకులేకుండా నేర్చుకున్నాను. వ్యక్తిపొందే ప్రతి పరాజయం అతని విజయానికి ఒక్కొక్కమెట్టు సమీపానికి చేరుస్తుంది. బెదరిపోకుండావుంటే ప్రతినిస్పృహాకర ఘట్టమూ వ్యక్తి పటిష్టతకి తోడ్పడుతుంది. దుఃఖావృతను, కంటకవికీర్ణాలైన బ్రతుకులో అన్నిటికీ ధైర్యం, మొండితనం అవసరం రాజూ! శ్రమకు తగిన ఫలితం లభించదని మనం అనుకోవచ్చు. అదినిజమే కాని నిరంతర ప్రయత్నసాధనలతో ఫలితంతప్పక సిద్ధిస్తుందని నానమ్మకం. ఈ సుదీర్ఘ కాలంలో నేను యెన్నోఉత్తరాలు నీకువ్రాశాను. ఎందరిద్వారానో కబురుచేశాను. కాని నీవు రాలేదు. నాకు ప్రత్యుత్తరము యివ్వలేదు. అయినానేను నిన్ను వెన్నాడుతూనే వచ్చాను. నా చిరునవ్వు నిరాశలో పడకుండా నిన్ను వెన్నంటుతూనేవుంది. నన్ను నీవెంత నిర్లక్ష్యదృష్టితో చూస్తున్నా నేను నిన్ను ప్రతిరోజూ నవ్వుతో ఆహ్వానిస్తూనేవున్నాను. నేను నీరచనలన్నీ క్షుణ్ణంగా చదివాను. నీ విమర్శనాత్మకసంపుటాలు దీర్ఘదృష్టితో పరిశీలించాను, నీవు ప్రతిమాటనీ సంధి, వివరాలు, విడదీసిచూస్తావు. నీరచనలన్నిటిలో ఒకక్రొత్త దృక్పథం కొత్త తత్వ పరిశీలన సమాజాన్ని

అపమార్గం, అసమర్ధ దుర్జనత్వంనుండి మళ్లించే ప్రయత్నం సర్వత్రా కనిపిస్తాయి. జీవిత నిర్వహణోపాయాన్ని బోధిస్తాయి నీకథలు ఇంతెందుకు నీ ప్రతిభావంతో నాకు ఏకీ భావం యేర్పడింది. కాని నీవాస్తవికజీవన సంభాషణ సరళిమాత్రం నాకు అమితాశ్చర్యం కల్గిస్తోంది. నీవు నన్ను పరీక్షించ డానికి అలా మాట్లాడుతున్నావేమో అర్థంకాదు. అయినా నీ యీ ప్రవర్తన నాకంత అనుమాన పడవలసిందిగా కనప డటంలేదు. కాబట్టి నా కథ వినిపిస్తున్నాను రాజా !"

"వినుపిస్తున్నానంటూనే ధోరణి మార్చేస్తున్నావు. మంచిగడుసుదానివి !"

"మీారు నన్ను దోవతప్పిస్తూ మరోవేపు లాక్కెళు తున్నారు. ఇన్ని అనుభవాలు గడిచాకకూడా ఇంకా నీవు తోవతప్పుతావా అని ? ఎంతైనా స్త్రీలు. దోవతప్పని స్త్రీ యెవరని ? ఎన్ని అనుభవాలు గడించినా స్త్రీకి హృదయం వుంటుందే అదే ఆవిడని దోవ తప్పిస్తుంటుంది. ప్రతి పర్యాయం దెబ్బతింటూమరో వైపు ప్రయాణం చేస్తుంది. జీవిత మార్గం గుర్తించికూడా తిరిగి తికమకపడుతుంది. ఇలాగే జీవితాంతం తికమకలతోనే ముందుకుసాగుతుంటుంది పాపం !..."పాపం !... యెవరు ?—'స్త్రీ' !"

"అంటే నీవు యిప్పటికీ యింకా తికమకపడుతూనే వున్నావని అర్థం అనుకుంటాను."

"అవును ! సందేహంలేదు. భవిష్యత్తులో యిప్పటి ఈ జీవితంలోకూడా దెబ్బతినడం జరగకూడదనియేముంది ?"

"ఇప్పుడంత ప్రమాదం యెందుకు కలుగుతుంది !"

"అలా కలగడంలోనే నా హృదయానందం వుంది. ఈ దశలని అసహ్యించుకుంటూనే అనురక్తి జనిస్తోంది"

"వీటి మాట తరువాత చూచుకుందురుగాని ముందు ప్రొఫెసర్ కథ అర్థాంతరం కానీయవద్దు, పాపం! పూర్ణాంతం చేయాలి."

"విను... ఇక ఆ రాత్రి నేనాగదిలో యెంతో కష్టంగా గడిపాను. మనస్సుకి విశ్రాంతిలేదు. ఎప్పుడు తెల్లవారుతుందా? ఎప్పుడీ అంధకార గహ్వరంనుంచి పారిపోదామా అని యెదురుచూచాను."

"నీవు వేదాంతిలా కన్పిస్తున్నావే ని పరిభాష అసాధారణంగా కన్పిస్తుంది. నీవు నిజంగా ఒక పార్లమెంటు సభ్యురాలివైతే అమూల్యమైన నీ వర్ణనతో ఉపన్యాసాల వల్ల దేశానికేమన్నా మేలు కలగవచ్చును.

కమలారాణి మెల్లిగా లేచిగోడకి వ్రేలాడే అద్దం ముందుకు వచ్చి మౌనంగా కాస్సేపు నిలబడింది, మళ్లా వచ్చి తన కుర్చీలో కూర్చుని, "నేను పార్లమెంటు సభ్యురాలిని కావడానికి ఎలా సాహసించను చెప్పు! కలెక్టరేట్‌లో ఆఫీసు సూపరింటెండెంటు కావడానికి పడరానిపాట్లు పడాల్సి వచ్చింది. ఎన్నటికీ పార్లమెంటుకుపోలేను. వరుసగా ఐదేళ్ళ నుంచీ ఉద్యోగంచేస్తూ కూడా, ఇప్పటికో నేయి రూపాయలైనా కూడబెట్టలేకపోయాను. నేను పార్లమెంటుకు వెళ్లాలనుకోవడం చంద్రగోళంలో ప్రభుత్వం స్థాపించడానికి కలలు కనడమే. చంద్రగోళంలోకి చేరుకో యత్నపడడం యెంత కఠినమో ఈ దేశంలో పార్లమెంటును చేరుకోవడం అంత

కన్నా కఠినం. ఆకాలం యింకా రాలేదు. తప్పకుండా యెప్పుడో ఒకప్పుడు వస్తుందనే నా ఆశ. అప్పుడే ధన, ద్రవ్యాలకి విలువుండదు. రాజులు, మహారాజులు ఇప్పుడు తమ హక్కులనుంచి ఎలా దూరం చేయబడ్డారో అలాగే ఖజానాలో డబ్బు మూలిగే వాళ్ళుకూడా పార్లమెంటుకీ, అసెంబ్లీకీ వెళ్ళరాదన్న నిషేధం అప్పుడుంటుంది. ఆ నూతన శకంకోసం అంతా యెదురుచూద్దాం. ఇప్పుడు మట్టుకు అంతా ధనంకోసేయడం చాలా సులువుగానే వుంది. వేలాది మానవులు, వికలచిత్తంతో వున్నారు. లక్షలాది ప్రజలు తమ దురదృష్టానికి విలపిస్తున్నారు."

"ముందు ప్రొఫెసర్ ఎలా విలపించాడో చెప్పు. విందాం. తరువాత దేశం సంగతి."

"నేను ప్రొద్దున్నే లేచి గదితలుపులుతీసుకుని బయటికి వచ్చేశాను. ఎక్కడా అలికిడిలేదు. రంజన్ ఇంకా నిద్ర నుండి లేవలేదల్లే వుంది. తిన్నగా అతని పడకగదివైపుకి వెళ్లి పిల్లిలా లోపలికి చూచాను. నిశ్చింతగా నిద్రపోతున్నాడు. ఆముఖంలో అదే ఆకర్షణ, అదే చిరునవ్వు. అదే ప్రశాంతత తాండవిస్తోంది కాని ఆ పరాభూతచిహ్నాలు కన్పించడంలేదు. నాగుండెలు దడదడ కొట్టుకుంటున్నాయ్. కాళ్ళు తేలిపోతున్నాయి. మరేదన్నా ప్రమాదం వచ్చిపడుతుందేమో నన్న భయంకూడా ఆవేశించింది. రాత్రి సంఘటన ప్రొఫెసర్‌కి చీమ కుట్టినట్టుగాకూడా లేనట్లు అతని వాలకం చెబుతోంది. అతని నిశ్చింతనీ, నిర్లక్ష్యాన్ని చూస్తూంటే, అమితాశ్చర్యం వేసింది. రాత్రంతా నిద్రలేకుండా చాలా కృంగిపోయి వుంటాడని

నేను అనుకున్నాను. పశ్చాత్తాపంతో అతను, దగ్ధశరీరుడై ఉంటాడని ఆశించాను. కాని అదేమీ లేదు. ఎంతో నిర్లిప్తుడుగా నిద్రిస్తున్నాడు అతనికిలాంటి సంఘటనలు అలవాటే నేమో! అమాయకంగా, నిర్లిప్తంగా కనబడే వాళ్ళలో చాలామంది ఆంతరంగికంగా అతి భయంకర స్వరూపులుగా వుంటారు. ఇలాంటివారిని చూసిన ప్రతివారూ చాలామర్యాదస్థుడని అనుకొని తీరుతారు. కాని సహజ స్థితిభిన్నంగా వుంటుంది. నాగుండెలు తీవ్రంగా గాయపడి పోయాయి. అతన్ని ఆ స్థితిలో చూస్తున్నకొద్దీ నాకు అరికాలిమంట నెత్తికెక్కుతోంది. ఏదన్నా సాహసం తలపెడతానేమోనని నాకేభయుం వేసి, తక్షణం యివతలకి వచ్చి, నాపెట్టె బెడ్డింగ్ సామాను తీసుకుని వీధిలోకి వచ్చేశాను. రాత్రి యీ వ్యక్తితో నేనెలా బలవంతంగా పెనుగులాడ గలిగానా అని నాకే ఆశ్చర్యం వేసింది. ఇతనిబారినుంచి రక్షించుకో గల బలం నాకెలాలభించిందో తెలీలేదు. ఆలోచించినకొద్దీ, అతనితో పరిచయంగా గడిపిన——————ఘడియలు, స్మృతికి రావడం మొదలయ్యాయి. రంజన్‌కు కొన్ని ఆమడలదూరంగా వుండాలని స్థిరంగా నిశ్చయించు కున్నాను.

బి ఎ. పరీక్షనిచ్చాను. తప్పకుండా కృతార్థురాలనవుతానన్న నమ్మకంవుంది. రంజన్ ప్రవర్తన నా ఆశయాలను తీవ్రంగా దెబ్బతీసింది. తేరుకోవాడానికి కొంతవిశ్రాంతి అవసరమని భావించాను. ఆరోజున ఒక స్నేహితురాలియింట్లో గడిపి, మర్నాడు ఉదయమేయింటికి బయల్దేరాను. ఈసంఘటన నన్ను చాలాజాగరూకురాలిని చేసిందనే చెప్పొచ్చు. ప్రకృతి ప్రతివ్యక్తికీ ఆంతరంగికంగా మనోశక్తిని ప్రసాదం

చింది. యిదే జీవితంలో దృఢత్వాన్ని స్థైర్యాన్ని కల్పిస్తుంది. యీశక్తిని స్వాధీనంలో వుంచుకుంటే యెవరికీ భయపడవలసిన అవసరం వుండదని నాకిప్పుడు అనుభవం నేర్పింది.

"అయితే ప్రకృతిదత్తశక్తిని నీవు స్వాధీన పరుచుకున్నావన్నమాట?" "అలావశపర్చుకోవడానికి తీవ్రంగా యత్నిస్తున్నాను. కాని ప్రకృతి సహాయం యెప్పుడూ బలవంతులవైపే మొగ్గుతుంది. బలహీనులు యెప్పుడూ నాశనమవుతూనే వుంటారీప్రకృతిలో. చిన్నజీవి పెద్దజీవికి ఆహారం. ధనబలం, జనబలం, అన్నిటినీ ఓడించి పాదాక్రాంతంచేసుకుని——వేస్తుంది. మానం, పరువు, ప్రతిష్ట అన్నీ దీనికి జోహార్లర్పించాలిసిందే.

భౌతికంగా బలహీనులు బలానికి పాదాక్రాంతులు కావచ్చుకాని వారిలో మనోదార్ఢ్యం మానసికశక్తి పెంపొందించుకుంటే ఎవరికి తలవంచకుండానే యెన్నో పరిణామాలు కల్పిస్తారు, ఎందరో మహాబలవంతులు, విషసర్పాల్లా మరణించలేదు. దృఢనిశ్చయం. నిరంతరాందోళన సాధించలేనిదంటూలేదు."

"అలాగా? నిరంతరాందోళన, దృఢనిశ్చయాతే సాధిస్తే బలీయమైన వాంఛతో శక్తివంతుడైన ప్రౌసఫెర్‌ని చూచి నీవెందుకు భయపడ్డావు. అతనెందుకు సాధించుకోలేకపోయాడు. చారిత్రకంగా ఈలైంగికవాంఛ అతిపురాతనమైంది. ప్రకృతి సహజమైంది. సకలజీవ మానవ సృష్టికి

హేతుభూతం. ఈ వాంఛలు ప్రతికాలంలో నూతన చరిత్రలుకొన్ని సృష్టించడం. పాతవాటిని నిర్వీర్య పరుస్తూండడం మనం చూస్తూనే వున్నాంకదా? ఈ లైంగిక వాంఛా పూరితమైనవే ఎన్నో చరిత్రలు పవిత్రంగా ఆరాధించ బడుతున్నాయి. ఈవాంఛా పరిపూర్ణతకోసమే ఎన్నో అమూల్య త్యాగాలూ, సాహసాలు జరిగాయి. యివన్నీ అమరగాథ లయినాయికూడాను. ఈ వాంఛ అనాదినుంచి యిప్పటికి యెన్నో వసంతాలనూ, ఎన్నో శైశవాలనూ చూచింది. కాని ఇది ఆరిపోవడం మట్టుకు జరగడంలేదు. సూర్యచంద్ర నక్షత్రాలలాగే యిదీ నిత్యనూతనంగా, నిత్యప్రకాశితమై వెలుగొందుతోంది. ఈనాడుకూడా యీలైంగికక్షుధ యథాపూర్వస్థాయిలోనేవుంది. నీవు చాలా అందగత్తెవు. నీఅందం నీ వన్నెచిన్నెలు, సోయగాలు అన్నీ మరికొంతకాలానికి సన్నిపోతాయి. నీ యీ లేతగులాబీ చెక్కిళ్లు కోమలత్వాన్ని కోలుపోతాయి. చందమామలాంటి నీముఖం వసివాడిపోతుంది. ఇన్నీ జరుగుతాయికాని విశ్వంలో క్షుధమాత్రం అంతంకాదు. యిది సర్వకాలాలూ యిలాగే శాశ్వతంగా వుండి తన మహత్తును వెల్లడిస్తూనే వుంటుంది. ఇంత ప్రాధాన్యతగల ఈ క్షుధకోసమేగద పాపం! ప్రొఫెసర్ ఆందోళన నిరంతరయత్నం. అదెందుకు సాగలేదు?”

“ఓహో! నీవు తర్కంలోకి దింపి నా పరిజ్ఞానాన్ని పరీక్షించ దల్చుకున్నావల్లేవుందే! నేన్నీతో వాదించలేను. కాని నా అభిప్రాయం మాత్రం వెల్లడించ గలను. యిది నిరాధారమనీ, తర్కానికి నిలబడదనీ అంటే మాత్రము నేను అంగీకరించను. లైంగికక్షుధని జీవితంనుంచి వేరుచేసి

చూడడానికి వీల్లేదు. ఇది సహజ ధర్మం కావచ్చును. కాని దీని సంసారానికో పద్ధతివుంది. ఈ పద్ధతినీ మార్గాన్నీ వదిత్తే అది సహజం గాక పైశాచికం అవుతుంది. ఉదాహరణకు లోకంలో ఎన్ని వ్యాధులు వున్నాయి ఎన్నో ఔషధాలు వున్నాయి. ఉన్నమాట నిజమేగాని, టి. బి. ఔషధం తల నొప్పికి వాడబడదు. ఒక వ్యాధి నిర్మూల నౌషధాన్ని మరో వ్యాధి కుపయోగిస్తే జీవితం ఆఖరవుతుంది. ఒక్కొక్క వ్యాధికి ఒక్కొక్క ప్రత్యేకమైన మందువుంటుంది. దాన్నే వాడాలి. అందుకు భిన్నంగా ఉపయోగిస్తే ప్రమాదం జరగడం అటుంచి మరిన్ని జబ్బులు చుట్టుకుంటాయి. మరో విషయం సహజమయిన ఈ తత్వాలకన్నా ఆత్మహృదయం, అనే వస్తువులున్నాయి. అవే జీవితానికి మార్గదర్శక మయ్యేది. వాటికి ప్రాధాన్యత ఈ యాలిముందు. క్షుధ తీర్చుకోవడానికి సంతానాన్ని కండలుకోసి మాంసంవండుకుని భక్షించడాన్ని యీ ఆత్మ అంగీకరించదు. దాహశాంతికోసం మానవ రక్తం త్రాగలనడంలో సబబులేదు. ప్రొఫెసర్‌కు సహజమైన యీ లైంగిక వాంఛవుంటే హాయిగా యెవరినైనా వివాహం చేసుకొని సుఖించాలి కాని, తల్లులూ, చెల్లెండ్లని బలాత్కారం చేయడం, శిష్యురాండ్రకి కామ పాఠాలు నేర్పడం, దుస్సహ విషయం. అలా జరిపేందుకు అతనికి అధికారం యేముంది ? ఆ ప్రొఫెసర్‌కి ముఖం వాచేటట్టు ప్రత్యుత్తరం యివ్వక మార్గాంతరంలేదు. నేరం, కుళ్ళుతో హృదయానికి తృప్తి లభింపజేసుకునే అలవాటు లేదనను, ఉద్రేకాలకిలోబడి నీచానికి దిగజారడం నావల్లకాదు. తను ప్రొఫెసర్ నన్న సంగతికూడా స్ఫురణకు రానంతకామోద్రే

కంతో అంధుడై పతనావస్థకు చేరుకున్నాడతను. వేలాది నవ యౌవనుల, నవయువతుల జీవితాలను, శిక్షణాయుతంగా సిద్ధపరచగల గురుతరమైన స్వీయ బాధ్యతని విస్మరించి దిగ జారిపోయాడు. చదువుకున్న మూర్ఖుడు, పశువు, దొంగ, ఇలాంటి గౌరవనీయులైన దొంగలకే నేడు, సమాజంలో స్థానాలు లభిస్తున్నాయి. ఇందువల్లనే దేశంలో జరుగవలసి నంత మంచి కానీ అభివృద్ధి కానీ జరగడంలేదు. పోవలసి నంత ముందుకు పోలేక పోతున్నాం మనం. ఇదంతా దేశానికి గర్వ కారణమైన ఉత్తమ సహజ సంస్కారమే అని యెవరైనా భావిస్తే ఈ సంస్కారంపుట్టి నడిసముద్రములో మునిగే స్థితి త్వరలోనే రానున్నదనీ, ఇది యిలా గంగలో కలుస్తున్నందుకు చింతపడేవాడు కూడా వుండడనీ గ్రహించాలి"

"ఆవేశపడకు రాణీ! నీవన్నట్టు ప్రొఫెసర్ కూడా ఈసంస్కారం జీర్ణించుకున్నవాడే కాబట్టి అలాజరిగింది. అంతే, ఇంకా కనిపించిన ప్రతియువతినీ తన చెల్లెలుగానో, అక్కగానో, తల్లిగానో భావించుకొనవలసిన అవసరం మాత్రం అతనికే ముందిచెప్పు? "

"ప్రతియువతి నీసోదరిగా భావించుకోవలసిన అవసరం లేకపోవచ్చు, కాని ప్రతియువతినీ బజారువనితగా, వేశ్యగా భావించమని యెవరుచెప్పారు. యువతులకి అందని ఆకాశం జూపి రెచ్చగొట్టి మోసంచేయడం, యేమవసరం. ప్రొఫెసర్ విద్యార్థులకి దేశికుడు. మార్గదర్శకుడు. ఆదర్శవ్యక్తిగా వుండి, శిష్యులని అలానే స్థిరపరచాలి. అలాంటివాడిలా చేయడం

సహజంఅని యెవడూ అనలేదు. ఈ సందర్భంలో అతను జరుపుతున్న కృషికీ; ఆలోచనకీ, ఆత్మ అంగీకరించవలసిన నైతికవిలువలు, సహకారంలేవు. కాబట్టి అది ఆందోళన కాదు. పశుత్వం. యితడిచరిత్ర యింకాచాలావుంది. మీరు వింటే యిలా ఆయనవాదాన్ని సమర్థించ ప్రయత్నించరు. దగ్గరకువచ్చిన ప్రతివిద్యార్థిని నీ ఇలామోసం జేశాడు. పరీక్షలు ప్యాసుచేయించుతానని, ఆశలు జూపించేవాడు. విద్యార్థినులకోసం ప్రత్యేక తరగతులని నడిపించేవాడు. వాళ్లమీద ప్రత్యేకం కృపావర్షం కురుపించేవాడు. క్లాసిప్పిస్తాననీ, స్కాలర్ షిప్ యిప్పిస్తాననీ, ఎన్నో చేస్తుండేవాడు. పాపం! ఆశలకి ఆడపిల్లలు అమాయకంగా లోబడి పోతుండేవారు. కేవలం విలాసార్థం విద్యాభ్యాసానికి వచ్చే యువతులసంగతి చెప్పనక్కర్లేదు. వాళ్ళు అతిసులభంగా ప్రొఫెసర్ వలకి అందేవాళ్ళు, వాళ్లుయూనివర్శిటీల్లో, కళాశాలల్లో చేరేది విద్యాభ్యాసం కోసంకాదు. ఇంటివద్దతోచక. అలాంటి అమ్మాయిలు నాకు చాలామంది పరిచయం. వాళ్ళంతా రంజన్‌వద్దకు వస్తూపోతూ వుండేవాళ్ళు. అప్పుడప్పుడు రాత్రుళ్ళుకూడా వుండి పోతూండేవాళ్ళు, ప్రొఫెసర్ చాలా పవిత్రుడన్న వెఱ్ఱినమ్మకం వున్నవాళ్లు. నాకు వీళ్ళవిషయంలో అనుమానం పడవలసిన అవసరమ్ కలుగలేదు. కాని నాఅనుభవం తరువాత ఒక్కొక్కటి వరుసగా అర్థం అవుతూ వచ్చాయి. అన్వేషణలో మరికొన్ని వివరాలు వెలుగులోకి వచ్చాయి. ఈ రహస్యాలు కొన్ని అతిభయంకరమైనవి కూడాను. రంజన్ కామదృష్టికి గురై తప్పించుకోడానికి వీలుపడక ఆ విషఫలితాలను అనుభవించలేక, నలుగురు

విద్యార్థినిలు చివరకి ఆత్మహత్య చేసుకున్నారు. కొంతమంది యూనివర్సిటీ వదిలిపెట్టి వెళ్లాక జీవించలేని పరిస్థితి యేర్పడింది.

ఫస్టుక్లాసులో పాస్ కావాలని అత్యంత ఉబలాట పడే "రెహానా" అనే ఒకఅమ్మాయికి క్లాసిప్పిస్తానని హామీ యిచ్చి ఒకనాటి సాయంత్రం కళాశాల మూశాక తరగతి గదిలో ఆవిడతో కామకలాపం సాగిస్తున్న సమయంలో కళాశాల ప్యూను తలుపులు వేయడానికి, వచ్చి చూశాడు. ఈ విషయం ఎవరికన్నా చెబితే ఉద్యోగంలోంచి తొలగించే యేర్పాట్లు చేస్తానని రంజన్ వాణ్ని బెదరించాడు. కాని వాడు సాధారణ ఘటంకాదు. తన ఉద్యోగం పోతేపోయె. ఈ దుశ్చేష్టలన్నీ ప్రకటిస్తూ ఒక కరపత్రం ప్రచురిస్తానని వాడుతిరిగి బెదరించడంతో, కన్నంలో తేలుకుట్టినట్టుగా పరిస్థితి సర్దుబాటయింది.

యూనివర్సిటీలల్లో, కళాశాలల్లో నేడు ప్రొఫెసర్లు సాగించే దుశ్చర్యలు వేనకువేలున్నాయి రాజా! నాలుగు నెలలకిముందే పరీక్షాపత్రాల బేరం తయారు. అవకాశం ఉంటే వాళ్ళేపరీక్షలు వ్రాసిపెడతారు కూడాను. ఇందు వల్లనే నేటి విద్యాస్థాయి మరీ దిగజారిపోయింది. ఒకతప్పు మరికొన్ని తప్పులకు జన్మకారణమవుతుంది. రంజన్ అసలు తప్పులను విరివిగా సృష్టించడానికే అలవాటుపడ్డాడు.

విద్యార్థులు ఎంతకోరినప్పటికీ వాళ్ళ క్లాసులు తీసుకునేవాడు కాదు. విద్యార్థినులు కోరకపోయినా వాళ్ళ క్లాసులు రంజనే నిర్వహిస్తూవుండేవాడు. వాళ్ళకే పరీక్షా

పత్రాలు రహస్యంగా అందజేస్తుండేవాడు. ... దయావర్షం అంతా వాళ్ళవరకే పరిమితమై ఉండేది. ప్రొఫెసర్లంతా చేసేపనులు ఇలాంటివే. ఇంకెన్నో వున్నాయి. ఇవన్నీ వింటే విసుగెత్తుతుంది అంటే మంచిబుద్ధి క్రమశిక్షణగల ప్రొఫెసర్లు లేరనికాదు. వున్నారు. వారిసంఖ్య అతిస్వల్పం."

"దేశానికి వెలుగుచుక్కల్లాంటి విద్యార్థులను ఆరంభ దశలోనే అంధకార మార్గానికి పట్టించితే వారిలోవున్న మంచి నాశనమై పోతుంది. లీల, ఎంతో చురుకైందీ, సలక్షణాలు గలదీను, ఈ విడను వివాహం చేసుకుంటానని రంజన్ వాగ్దానం చేసి మోసపుచ్చాడు. తన పశువాంఛలని పూర్తిజేసుకున్నాక ఆవిడను వదలి 'రెసోనా,' వైపు మళ్లాడు. లీల గత్యంతరం లేక తన విద్యార్థి జీవితానికి స్వస్తి చెప్పుకోవలసి వచ్చింది. తరువాత రెన్నెల్లకి యేవో కొన్ని అసహ్యాకరమైన విచిత్ర వ్యాధులకుగురై మరణించినట్లు తెలిసింది.

ఈ ప్రొఫెసర్లవద్ద విషం కన్నా చురుగ్గా ప్రభావం చూపే జబ్బులుకూడా పోషింప బడుతూ వుంటాయి. ఈ విషాన్ని వీళ్ళు అందరికీ వ్యాపింపజేస్తారు. అభిమానం, కుటుంబ గౌరవంకోసం, విద్యార్థినులు మౌనంగా కుళ్లి పోవడం తప్ప మరేమీ చేయలేరు. వాళ్ళు మౌనంగావున్నా ఈ విషఫలితంబహిర్గతమవకుండా మౌనంగాయెలావుంటుంది? ప్రప్రథమంలో బహుశా వారికి ఈ దుష్కార్యములలో యేదో మాధుర్యం అనుభవం అవుతుందేమో ? ఫలితాలు ఈ మాధుర్యంకన్నా వేయిరెట్లు భయంకరంగా వుంటాయి.

ఈ రంగంలో అడుగుబెట్టక మూందు ఈ పరిస్థితులను గురించి నాకేగనుక యే కొంచమైనా తెలిసివుంటే నిజంగా నే నీ యూనివర్సిటీలో ప్రవేశించక పోయేవాన్నంటే నమ్మ. ఇలాంటి దుష్కర్మల వల్లనే సద్గుణాలూ, మేథో బలావున్న విద్యార్థులంతా మంచి మంచి మార్కులతో ఉత్తీర్ణులు కావడం జరుగుతుంటుంది. చూడండి! సాధారణము, అతి నీచమైన క్షణిక వాంఛ, యెందరి జీవితాలనూ, ఆశలనూ, పూర్తిగా మలినం చేస్తున్నదో ? కష్టించి చదివి నా కూడా థర్డ్‌క్లాస్‌లో పాస్ కావడం కొందరికి దుస్సాధ్యం. ప్రొఫెసర్ల కనుసన్నల్లో వున్నవాళ్లు ఫస్టుక్లాస్‌లో పాసవడం, అన్ని పాకర్యాలూ వాళ్ళకే దక్కటం. ఇదంతా చిత్రంగా లేదూ ? ఈ విధంగా పాసైన వాళ్ళని నేనసలు లక్ష్యపెట్టను. ఆత్మ హృదయం మెదడూ, అంతటా అవినీతి విషయం కూడు కట్టుకుని ఉన్నప్పుడీ ఉత్తీర్ణత లేకుంటేనేం ? ఎందుకూ మానవత్వం ? సిగ్గూ, బిడియాన్నీ వదిలింతరువాత ?"

రాజు చిరునవ్వుతో కమలవైపు చూస్తూ అన్నాడు : "నీలో యింతధైర్యం ఎక్కణ్ణుంచివచ్చింది స్త్రీజాతి నేటికీ యింకా యెంతో వెనకబడేవుంది. శతాబ్దాలనుంచీ స్త్రీ నిర్ల క్ష్యం చేయబడుతూవుంది. నేడుకూడా అంతేగాని మార్పు రాలేదు. నీవుమాత్రం మొండిబండలా అసామాన్యమైన దానివిలా కన్పిస్తున్నావు. నిన్ను మోసం చేయాలనుకుంటే మోసపోవడం మాత్రమే మిగులుతుంది. హంతకుడు హత్యకు గురిఅవుతాడు. అందరినీ యేడ్పించుక తినేవాడు తనే యేడు స్తాడు. నిన్ను చూచింతరువాత నా ఆదర్శభావాలు జాగరిత మవుతున్నాయి. నీమాటలు నాలో నూతనావేశాన్ని సృష్టి

స్తున్నాయి. అజంతాశిల్పాలలో చెక్కబడినట్లు నీముఖభంగి
మలో జీవిత కిరణాలు ప్రకాశిస్తున్నాయి."

"ఆపండి ! పొగడ్త అపరిమితంగా చేశారు. చాలు."

"పొగడ్తకాదు రాణీ ! నిజం."

కాసేపునిశ్శబ్దం. రాజు మౌనాన్ని ఛేదిస్తూ "నీకింత
వరకూ యెవరినీ ప్రేమించనేలేదా కమలారాణీ!" అన్నాడు
హఠాత్తుగా. కమల చాలాసావధానంగా, యేమాత్రం
వ్యగ్రత చెందకుండా "నాజీవితంలో అలాంటిదెన్నడూ
సంఘటించలేదు రాజా ! నేనెవర్ని ప్రేమించేది ? యేవో
కొన్ని ఆకస్మిక సంఘటనలకు మాత్రం గురిఅయానంతే,
వీటివల్ల పట్టి అశాంతి, బేజారూ, తప్ప మరేమీ లేదు. అని
అంతలోనే ఆలోచనలో మునిగిపోయింది. యౌవనంలో
అసంఖ్యాకమైన ఆవిడ సంతోష సంరంభాలు ఆ నిట్టూర్పులో
దాగి ఉన్నాయనిపిస్తుంది. యేదో మూలన భీమంవ్యాపించి
శ్వాస పీల్చుకోనకుండా కష్టతరం అయినట్టుగావుంది. రాజు
కూడా తీవ్రాలోచనలో పడ్డాడు.

కమల మౌనం, నవ్వులోకి మారింది. ఈ నవ్వులో
కూడా యెన్నో బాధలూ, నిరాశలూ గుప్తంగావున్నట్లు
కన్పిస్తుంది. కాని ఆవిడ నవ్వుతోవుంది. ఆవిడ ఆ నవ్వుతో
గదిలో ఒక కొత్త వసంతం విరుచుక పడ్డట్టయింది. ఈ
వసంతంలో గదంతా విరబూసిన తోటలా అనిపిస్తోంది

"నేను యింత సౌందర్యవతిని కాకుంటే యెంత
బాగుండేదిరాజూ! అప్పుడిన్ని ఆకస్మిక సంఘటనలూ, ఇంత
చికాకు వుండకపోయేది. నా బ్రతుకు ఈ క్షణంలోకూడా

యింకా మండిపోయే యెడారిలా నేవుంవి. అనుగడుక్కీ ఏదో నన్ను వెరపిస్తున్నట్టుంటుంది. నా భవిష్యత్తుకూడా భయంకరమైన అంధకారమేనేమో ననిపిస్తుంది, నా ఆశలూ, వాంఛలూ అన్నీ యిప్పుడు ద్వేషంక్రిందకు మారుతున్నవి ఆగంతంకోకూడా నిట్టూర్పులూ, అశ్రువుల నిరంతర ప్రవాహంలోనే, నేను కొట్టుకపోతానేమో ?"

"నివు భగ్నప్రేమికురాలివో, లేక ప్రణయ క్షుధార్తురాలివో అయివుంటావు కమలా! ఆడవాళ్ళకి సహజంగా వుండే యీ లక్షణం అణిచివేయబడ్డప్పుడే అందరినీ ద్వేషించ బుద్ధి అవుతుంది."

"కావచ్చు కాని ప్రేమ అనే రెండక్షరాలు నేడెంత అపహాస్యానికి గురి అయిపోతున్నై. సహజ స్వచ్ఛమైన ప్రేమని పురుషులు నిర్మూలించి నిర్లక్ష్యం చేస్తున్నారు. అసలు జీవిత పద్ధతులే సమూలంగా మారిపోతున్నాయి. పరిస్థితులు హృదయాన్ని కలతపెడుతున్నాయి."

"నీ విశ్వాసం కొంతవరకు యథార్థమేగాని భావ ప్రకటనలో కొంచెం కఠోరత్వం వుందనుకొంటాను."

"నా స్వభావం యెందుకిలా కలతపడుతూంటుందని నేను తరుచుగా ఆలోచిస్తుంటాను. ప్రస్తుత వాతావరణంలో యథార్థదృష్టితో ఆలోచించే వారందరిపనీకూడా యింతే అయివుంటుందనడంలో సందేహంలేదు.

నా యీ పరితాపం, ఆరాటం, ఆవేదనలకి ప్రధాన కారణం నేటి యీసమాజమే. శిశిరానంతరం వసంతం అంటూ ఆగమించదేమోనని నిరాశ కలుగుతోంది. ఈ శిశి

రమే చిరకాలం రాసిపెట్టివుందనీ, ప్రస్తుత యాత్రలో వసంత భరిత జీవితాన్ని గురించి కలలు గనడం భ్రమఅనీ, అని పిస్తుంది. సత్యంకోసం, హేతువుకోసం మనం మరణించడాని కైనాసరే సిద్ధపడితే, అది యీలోకం లజ్జాహీన ప్రవర్త నగా వర్ణిస్తుంది. జీవితంలో మెరుపు వెలుగులకోసం మనం వెతుకుతుంటే, ప్రపంచం మనల్ని పరిహసిస్తుంటుంది. అన్ని టినీ నిర్లక్ష్యంచేసినప్పటికీ. సిగ్గులేని క్రిందనే జమ చేయబడు తుంది. ఈ సమాజం నేడింత పతనస్థితిలో వుందిగదా అంటే. మానవత్వం నీతినియమాల మాటలు కేవలం లాంఛనంగా సంభాషణల నిమిత్తమే నన్నదశలావుంది. ఈదౌర్భాగ్యసమా జాన్నికూకటి వేళ్ళతో పెళ్ళగించే పెనుతుఫాను వచ్చే క్షణం కోసం నిరీక్షణలో వున్నాను. ఆ క్షణం యెప్పుడు సంభ విస్తుందో నీకు తెలుసా ? అప్పుడు తనువుబుద్బుదంగా వుండదు? స్త్రీ అబలగా మోసాలకి గురికాదు———"

"మనం పిచ్చివాళ్ళలా ఆలోచించకూడదు కమలా ! ఇలా ఉన్మత్తావేశంలో దీప భ్రమణకీటకంలా మరణించడం వల్ల లాభంవుండదు. ప్రతి పరాజయం, మనిషిని విజయం ముందుకు నెడుతుందనీ, ప్రతి శిశిరం తరువాత వసంతం వస్తుందనీ ఇంతకుముందే నీవన్నావు. మళ్ళీ యిప్పుడింత నిరాశ, ఎంతైనా స్త్రీ వికదూ ? ఒక్కోసారి నీవు మహా ధైర్యవంతురాలివనుకుంటాను. మరొకసారి కొవ్వొత్తిలా కరిగి ఒక గాలి విసురుకే చల్లారిపోయేలా కన్పిస్తావు. పట్టి వుద్రేకం. చూడు ! ప్రత్యేకంగా విధించబడిన సమాజ నియమ నిబంధనలు తుక్కు తుక్కు అయిపోయినై, నూతన నిబంధనలు రూపొందుతున్నాయి. ప్రచండ వేగంతో

పరిణామాలు సంఘటిస్తున్నాయి. మానవుడి నైతికస్థితిలో కూడా బ్రహ్మాండమైన మార్పు రాబోతోంది. నేటి పతన మార్గం మానవుడికి శాశ్వత మార్గంకాదు. తిరిగి అభ్యుదయం, ఔన్నత్యం యేర్పడుతుంది, నీ మాటల్లో చెప్పాలంటే ఈ స్థితి యేర్పడ్డానికి ఒక తీవ్రాందోళన, ఒక మహోద్యమం, సంఘర్షణ, అత్యావసరం, సమాజంయొక్క నేటి గొప్పగొప్ప నిర్మాణాలు అన్నీ పటిష్టమైనవి అనుకోరాదు. యివన్నీ గడ్డిపోచకన్నా బలహీనమైనవి. సహన—సమయ నిరీక్షణం అవసరం. మన సూత్రాలను యెన్నడూ విడిచిపెట్టరాదు. యిప్పటివరకూ జాగరితంగా సంరక్షించుకుంటూ వచ్చిన ఆత్మ చైతన్యాన్ని నిద్రాణంగాకుండా చూచుకోవాలి. చాలా రాత్రి గడిచింది. వినవలసింది చాలావున్నప్పటికీ వినిపించవలసివస్తున్నది. నిన్ను పరిశీలిస్తుంటే నా అంతరాంతరాల్లో ఘనీభవించిన జీవితం పైకి ఉబుకుతోంది."

"దుఃఖం అధికమై ఉక్కిరిబిక్కిరైనప్పుడెల్లా నా ఆలోచన యిలాగే వుంటుందిరాజూ!" అంటూ నవ్వింది. మళ్ళీ అందుకొని యిలాఅంది. "అదీ! యిప్పుడూ నీ నిజస్వరూపం బయటపడింది. ప్రారంభంలోజీవితం అతి కఠోరమైందన్నావు, యిప్పుడేమో నాకు జీవిత పాఠాలు బోధిస్తున్నావు."

"జీవితం అతి కఠోరమైందని నేనన్నది వాస్తవమే రాణీ! కాని నేను నిరాశావాదినికాదు. నీవు కూడా కావేమో! బ్రతుకు అడుగడుగునా నన్ను సమీక్షిస్తూనే వుంది. నాహృదయంలో జీవితానికి సంబంధించి గుప్తంగా

వున్న కఠోరనగ్నసత్యాలను నేనెలా మరచిపోగలను. ఒక రచయితగా, విమర్శకునిగా, నేను నిరాశనూ, తిరోగమన భావాలనీ, మాత్రం వ్యాపింపజేయలేను. ఎన్ని కఠిన పరిణామాలకైనా ఓర్చుకొని నిలబెట్టుకుంటూ వస్తూన్న కొన్ని సిద్ధాంతాదర్శాలు నాముందున్నాయి. యీ విద్వేషం పరీక్షల తుఫానులను తట్టుకొని మనం బ్రతికితీరాలి. మనమీద కృతక సానుభూతినీ, ఉపకార దృష్టినీ ప్రదర్శిస్తూ నేటి ఈ సమాజనేతలు. తమ పబ్బంగడుపుకోవాలను కుంటారు. కాని ఈకుహనా పుష్పాల పరిమళం మనం అతి జాగ్రత్తగా గమనించాలి మనహృదయంలో కూడా విద్వేషాగ్ని చ్ఛటల్ని నింపుకున్నామంటే ఆ అగ్ని వలయంలో మనం స్వయంగా చిక్కిపోయినట్లే ! నేనీ దుఃఖాలను విస్మరించాను. అవి జ్ఞప్తిలో నేవుంటే, మనస్సు క్షోభించి, మెదడు చికాకెత్తిపోతుంది దుఃఖాన్ని ప్రేమించడం నేనిప్పుడలవాటు చేసుకుంటు న్నాను అన్యాయ హింసలని మౌనంగా సహిస్తుంటాను. కాని నా ప్రతీకారవాంఛ నాకలంలోంచి బయటపడి, లోకంలో వ్యాపించి, కష్టహింసా న్యాయాల గొంతు నులిమివేసి జీవశక్తికి ఆహ్వానం యిస్తుంది. ధైర్య సాహసాలున్న వాడే కష్టాలని ఎదుర్కోగలడు. నిరాశాహృదయుడు దేనికీ పనికిరాడు, సమాజంమీద నేడు ఆవరించుకొనియున్న ఈచీకటి తెరలు నిరంతర ప్రయత్నంవల్లనే గాని తొలిగిపోవు. ఈ ప్రయత్నం చేయడమే మనకర్తవ్యం, సమాజ సంక్షోభం పట్ల సానుభూతి ప్రకటించే ప్రతివ్యక్తి యిందులో భాధ్యత వహించాలి.”

కమల విరిసిన మల్లెపూవులా నవ్వుతోంది:

"నిన్ను గురించి నేనెలా వూహించానో సరిగ్గాఅలానే వుంది నీహృదయం. మొదట్లో నీ ప్రసంగం నాకు నిరాశని కల్పించింది. కాని యిప్పుడు నాకు ని రా శ లే దు. ఒక వ్యక్తిని అర్థంచేసుకోవడం యెంతోకష్టం. మీరుకూడా కఠినమనస్సు లాంటివారే! మన యిద్దర్లో తేడాలేదను కుంటాను వర్తమాన, సాంఘిక జీవితంలోని చిమ్మచీకట్లలో వెలుతురు ప్రసరింప జేయడానికి మనం యత్నిస్తున్నాం. కాని అడుగడుగునా కాలంమనల్ని పరీక్షిస్తున్నది. తన యినుప కౌగిలిలో బంధించాలని ప్రయత్నిస్తోంది జీవితం దాని ఔన్నత్యం మనం గుర్తించాం కాబట్టి, కాలం అంధ దృష్టిమనను సహించలేదనుకుంటాను నీ అ భి ప్రా య మేమిటి ?"

"నాభావాన్నికూడా నీవే చక్కగా అనువదించావు. జీవితవైభవం గుర్తించి నప్పటికీ ఒక్కోసారి చిక్కుల్లో తెలిసి తెలిసే పడవలసి వస్తుంటుంది. మానవుడు పరిస్థితులకి బానిస. కొన్ని కొన్ని సమయాల్లో వద్దనుకున్నా యెవరినో ఒకరిని విశ్వసించడంకన్నా గత్యంతరం లేనిస్థితి వస్తుందికూడా, అయినా జాగ్రత్తగా మెలగడం అవసరం. జాగ్రత్త అవస రమే కాని అన్నిటినీ శంకిస్తూ అనుమానాన్ని పెంచుకోవ డంవల్ల హృదయానికి బలంవుండదు. యెప్పుడూ అ విశ్వా సం ఆవరించుకుంటుంది. నేను వీటినిగురించి ఆలోచిస్తూనే వుంటాను. ఈ ప్రపంచం సంతోషంగా కేరింతాలు కొట్టడం కోసం మనం మనసుఖాన్ని త్యాగంచేయడం, వట్టిమూర్ఖ తత్వం అవుతుంది. ప్రపంచం మనమేకాదు. కనీసం మన సుఖంకోసంకూడా మనం నాశనం కాకూడదని నాభావం."

"మానవునిలో స్వయంగావున్న బలహీనతే యిది. ఒక్కొక్కసారి తనమీద తనకే విశ్వాసం వుండదు."

"అవును ఒక్కొక్కపర్యాయం మనల్ని మనమే విశ్వసించడమ్ దుస్తరమవుతుంది. చూడండి! ఫస్టుక్లాసులో బి. ఏ. పాసవతానన్న విశ్వాసం నాకు పూర్తిగా వుండేది, కాని థర్డు క్లాసులో పాసయ్యాను. ఫలితాలు చూచిన తరువాత నాకెంతో నిరాశ కలిగింది. నా తెలివిని యెవరో పరిహసిస్తున్నట్టనిపించింది. కనీసం ఉత్తరం రాయడంకూడా రాని లీల అసలు బి, ఎ, వరకు చేరడమే ఆశ్చర్యం అనుకుంటే ఆవిడ బి. ఎ. ఫస్టుక్లాసులో పాసవడం నాకు మరీ దెబ్బతగిలినట్టయింది. అది యేనాడూ పుస్తకం చేతబట్టి చదవిన పాపాన పోలేదు. ప్రతిరోజూ సినిమాలకూ ప్రొఫెసర్ల ఇళ్ళకూ తిరగడంలోనే దానికాలంగడుస్తూండేది ఆవిడకు కావలసినంత డబ్బుంది. అందర్నీ వలపించేంత సౌందర్యంవుంది. ఆవిడకుషికార్లుకొట్టడానికి స్వంతమోటారుంది. ప్రొఫెసర్లనూ వారి వారి భార్యలనూ, తీసుకొని షికార్లు చేస్తుండేది. లీల మోటారు – అందమైన ఆవిడ నీలాల ముంగురులే ఆవిణ్ణి మొదటి తరగతికి నెట్టాయి"

"లీల ఒక్కర్తే నా ఫస్ట్‌క్లాస్‌లో పాసయింది?"

"ఒక్క లీలే నేమిటి? అలా చాలా మంది అదృష్టవంతురాళ్లు పాసైనారు. మంత్రుల భార్యలుకూడా వున్నారు. అవన్నీ వింటే మీ మనస్సుకి కష్టం."

"కష్ట మెందుకు? ఇలాంటి సంఘటన నేనుకూడా ఒకటి అనుభవించాను." "ఏమిటది? కొంచెం నేనుకూడా వింటాను. చెప్పండి."

"నేను, ఎం. ఎ., చదువుతున్నరోజుల్లో మాతో పాటు మరో పెద్ద ఆఫీసరు కూతురుకూడా చదువుతూ వుండేది మేము ప్రతిరోజూ శ్రద్ధగా తరగతులకి హాజరవుతున్నా ఆవిడ నెలకు నాలుగురోజులుకూడా తరగతిలో కనిపించకపోయేది. కాని యథాప్రకారం ఆవిడ హాజరీ వేయబడుతూనేవుండేది చివరికి పరీక్షలన్నీ అయాక చూస్తే మేమంతా రెండవతరగతిలోనూ, ఆవిడ మొదటితరగతిలోనూ పాసైనట్టు పేపర్లో పడింది. మాలో తీవ్రమైన ఈర్ష్యాగ్ని ప్రజ్వరిల్లింది. యూనివర్శిటీ విద్యార్థి సంఘంద్వారా పెద్ద ఆందోళన లేవదీశాం. ఇది అన్యాయమంటూ పేపర్లు మళ్ళీ సరిచూడాలని తీర్మానం చేశాం. ఆందోళన ఫలించి రీకలెక్షన్ అయితే జరిగింది. కాని అన్ని పత్రాలలో మొదటి తరగతికి సరిపోయినట్టుగానే వుండటం ఆశ్చర్యం వేసింది. అన్వేషిక చేసేదేముంది? ఆవిడఫోటో పత్రికల్లో ప్రాధాన్యంగా ప్రచురింప బడింది. తీరా ఆరాతీస్తే ప్రొఫెసర్లద్వారా ఆవిడ పరీక్షా పత్రాలన్నీ కచ్చితంగా ముందే తెలుసుకుందని తేలింది. తన భర్త వ్రాసిన థీసిస్ తన స్వంతం చేసుకుని ఆవిడ యిటీవలనే, పి. హెచ్. డి, అయినట్టుకూడా విన్నాను. యూనివర్సిటీ పరిశీలకులే ఆవిడని ఆటంకపెట్టనప్పుడు మన మెంత ఆందోళన చేసీ లాభంలేదు. తనకి వ్యతిరేకంగా ఆందోళన లేవదీసేప్పుడు ఆమె నాతో "జీవితాన్ని కాంతివంతం చేసుకోవడానికి కొద్దిపాటి తప్పు చేయటం అనుచితంకాదు. అది తెలివీ, చురుకుదనం క్రింద లెక్క వేసుకోవాలి. కాని తప్పుకాదు. ఇది ప్రాపంచక ధర్మం. బలహీనులెప్పుడూ పరాజయంపాలే అవుతుంటారు.

బలవంతులూ, చురుకైన మేధావంతులూ, అభ్యుదయ పథంలోనే వుంటారు. ఈ ఇరవయ్యో శతాబ్దంలో ఊరికే గానుగెద్దులా పుస్తకాలు ముందేసుకొని, చెమటపట్టేట్టు చదివితే లాభంవుండదు. మన యీ శ్రమ, తెలివితేటలను యెవడూ న్యాయంగా పరిశీలించేవాడు లేనప్పుడు శ్రమపడడం బుద్ధితక్కువ. మానవుడి తెలివినిబట్టి మంచివాడని నిర్ణయించే రోజులు గతించినవి. యిప్పుడు బాహ్యాడంబరాలకున్నంత విలువ దేనికిలేదు; రాజా ! నీవు నిజంగా నాతో కలిసి మెలిసి ఉంటే నిన్నో ఆకాశ నక్షత్రాన్ని చేసివుండేదాన్ని." అంటుండేది. కాని యీ మార్గానికి నా హృదయం అంగీకరించలేదు. ఆలోచించి ధైర్యంగా ముందుకెళ్లాలనే తప్ప, తప్పుడు తోవన నడిచి, ధృవ నక్షత్రం అయి కూర్చోవాలన్న కోరికనాలోలేదు.

"ఇప్పుడావిడ యేంచేస్తోంది ?"

" ... ... ... ... "

— కుర్రవాడు యువకుడుగాను. యౌవనం వృద్ధాప్యంలోకీ మారుతోండడం పరిపాటి. ఈమార్పులు ఎప్పుడూ వస్తుండేవే. అలాగే తప్పుల్లో మునిగితేలే మనిషి చివరికి అందులోనే మునిగి దెబ్బతిని పడిపోతాడు. తప్పులు తమాషాలద్వారానే గొప్పతనం, బలం ఆర్జించుకోవడానికి కలలు గనడం మొదటిరకం బుద్ధిహీనత. భూకంపం వచ్చిందంటే పర్వతాలుకూడా కలిగి పప్పు పప్పైపోతాయి. ఎంత పట్టు పునాదిగల వృక్షమైనా తుఫానుగాలికి తాళలేక మొదలంటా కూలిపోతుంది. అలానే వీళ్ళపనికూడా అవుతుంది. రమణి చివరకి ఒక గెజెటెడ్ ఆఫీసర్ని పెళ్ళిచేసుకుంది.

విద్యార్థి దశలో అవలంబించిన కుమార్గం ఆవిడకి నిజంగానే వంటబట్టిపోయింది. పెళ్ళయిన కొన్నాళ్ళకే ఆవిడభర్తని వదలిపెట్టి ఇంకో మిలటరీ ఆఫీసరుకౌగిట్లోకి వెళ్ళిపోయింది. యిలాగే ఆవిడ యెంతమందికో మారింది. అన్నిచోట్లానిరాశే ప్రత్యక్షం అవడంతో విసుగెత్తి ఒక కాలేజీలో అధ్యాపకురాలైంది. కాని విద్యార్థులకి పరీక్షా పత్రాలను బహిరంగ పరచిందన్న నెపంతో ఉద్యోగంలోంచి తొలగించబడింది. కొన్నాళ్ళు నిరాశ్రయురాలు. మరికొన్నాళ్ళ తరువాత ఆవిడికి పిచ్చెత్తిందని తెలిసింది. బహుశా యిప్పుడామెపిచ్చాసుపత్రిలో పడివుంటుంది. తప్పుడు మార్గంలో నడిచిన వాళ్ళంతా యేదో ఒకనాడు తమకు తగిన శిక్షనిఅనుభవించి తీరతారు. పది సంవత్సరాల కొద్ది కాలంలోనే వృద్ధులైపోతారు. పిచ్చోళ్లౌతారు. ఇంతకన్నా యెక్కువ శిక్ష యేంకావాలి ?

"మీా యీా అభిప్రాయంతో నేను సంపూర్ణంగా యేకీభవించలేనందుకు క్షమించండి. నేరస్థుడికి శిక్ష యెక్కడ లభిస్తుందంటారు, వాళ్ళే హాయిగా వుంటున్నారు, అలాంటి వాళ్ళు చాలామంది నాకు తెలుసు. అధికారం పేరు ప్రతిష్టలతో వున్నారు. దాదాపు అంతా యిలాంటివాళ్ళేనేమో! పదిమందిని ఖూనీచేసిన హంతకుడే ఇవాళ సమాజానికి నేత్రుత్వం వహిస్తున్నాడు, దోపిడీదార్లే నేడు అదృష్టాకాలాన్ని ఆడించే అదుపు కలిగివున్నారు. దొంగలూ నీచులే నేడు మన, ధన మన ప్రాణాలకి రక్షకులుగా నిలబడుతున్నారు. ఈ పరమ దౌర్భాగ్యంయొక్క ప్రభావం నరనరానా జీర్ణించుకు పోయింది. ఇది వదలిపోతుందన్న

ఆశ యేకోశానా లేదు. దుర్మార్గు డెప్పుడూ బల సంపదలతో తులతూగుతూ సౌఖ్యంగా జీవితం గడుపుతుంటాడనీ కాలం కూడా వాడికే కలిసివస్తుందనీ, బలహీనులెప్పుడూ పతనం అయిపోతుంటారనీ, చరిత్ర చెబుతోంది. దుర్మార్గుడన్న వాడు మచ్చుకైనా లేకుండా ప్రపంచమేనాడూ పవిత్రంగా లేదు. వాళ్లే ప్రభువులై పాలించడంకూడాకద్దు ప్రజలూ, వాళ్ళ దుర్మార్గాన్ని గొప్పతనంగా స్తోత్రాలుజేస్తూ బ్రహ్మ రథాలు వాళ్ళకు పడుతూంటారు. వాళ్ళ ప్రతి తప్పుడు మాటా, ఒక సిద్ధాంతంగా రూపొందుతుంది. ఉదాహరణకు స్త్రీ జీవితాన్ని తీసుకోండి. ప్రపంచంలో యింత ప్రజా స్వామ్య యుగంలోనూ స్త్రీ యింకా ఒక అబలే! చట్టాలూ శాసనాలూ సమర్థిస్తున్నా ఆవిడ అరక్షితగానే వుండి పోతున్నది. అందరితో సమానం కాలేకపోతున్నది. ఎక్కడ చూచినా ఆవిడతో పశుప్రవర్తనే! సాంప్రదాయ ధర్మం స్త్రీని బొమ్మను జేసి నిలబెట్టింది. పురుషుణ్ని పూజించాలి. సౌఖ్యాన్నీ, చిరునవ్వునూ, చివరకు ఉనికినీ పురుషుడి సేవలో అర్పితం చేయాలి. సమాజాన్ని ధిక్కరించకూడదు. స్త్రీని సంతోషపెట్టడానికి పై దుర్మార్గాలన్నిటికీ మగవాడు మంచి మంచి పేర్లు సృష్టించి పెడతాడు. ఈ కపటనాటకంలో స్త్రీ చిక్కి తనని తనే విస్మరిస్తుంది.

"అసలుకీలకం స్త్రీ తననుతనే బలహీనురాల ననుకొంటుంది. అదే స్వయంకృతాపరాధం. తనహక్కులను గురించిన శ్రద్ధ తనకే లేనప్పుడు ఇక మరొకరు చేసేదేముంది? స్త్రీ యెప్పుడూ పురుషుడి ఆటవస్తువుగానే వుంటూవచ్చింది. పురుషుడి అదృష్టంతోటే తనభవిష్యత్తును లంకెవేసుకొని

కూర్చుని ప్రతిక్షణం పురుషుడి సహాయంకోసం అర్రులు చాస్తూవుంటుంది. ఇందులో నిజంగా పురుషులని అనవలసిన పనిలేదు."

"నిజమేకావచ్చు కాని పురుషుడు మాత్రం ఆవిడ నెప్పుడూ అన్యాయానికి గురిచేస్తూనేవచ్చాడు. ఎన్నో ముఖస్తుతులు సమయానుకూలంగాజేసి తనకోరికలని పూర్తి చేసుకుంటాడు. పుష్పంకన్నా సుకుమార మైందంటూ కౌగిలింతల్లో నలిపివేస్తుంటాడు. ఇలానే ఎన్నో అందమైన పేర్లుబెట్టి తెలియకుండానే మోసంజేస్తాడు. తనింత పగటి మోసానికే గురియవుతున్నానని ఆలోచించేంత తీరిక ఆవిడకి చిక్కడమే అరుదు. ఆలోచనే కలిగితే స్త్రీ యింత బలహీనంగా యెప్పుడూవుండదు. దైవం ప్రసాదించిన హక్కులు పురుషుడితోపాటు ఆవిడకూవున్నాయి. కావాలంటే కదన రంగంలో సైన్యాన్ని ఉరికిస్తుంది. కళాశాలలో అధ్యాపకత్వాన్ని వహిస్తుంది. కాకలుతీరిన నాయకురాలు కాగలుగుతుంది. పాలకురాలుగా భాసిస్తుంది. వాటన్నిటికీ వందల కొలది నిదర్శనాలు మనకు చరిత్రలో కనిపిస్తాయి, స్త్రీ తన కోసం, తనరక్షణకోసం, స్వయంగా ఒక వుద్యమాన్ని, ఆందోళననీ మాత్రం నిర్వహించడం లేదు. ఆవిడ కర్మక్షేత్రంనుండి వైదొలగే వుండేదెప్పుడూనూ !

ఇందువల్లనే నాలుగుగోడలమధ్య అంతఃపురంలో బంగారుసంకెళ్ళతో నిర్బంధితురాలై పోయింది. నేటికాలం స్త్రీ, యీ మాయాజాలంలోంచి బయటపడడానికి యత్నిస్తోంది. తనపరిస్థితిని సంస్కరించుకోవడానికి, పునర్నిర్మించుకోవడానికీ తీవ్రంగా ఆలోచిస్తోంది. నేడుకనిపిస్తున్న

మార్పుకు, ఈ పరిణామమే కారణం. స్త్రీలు పురుషులకన్నా యెందులోనూ తీసిపోరని మళ్ళీ ఋజువు పరిచేకాలం త్వరలోనే వచ్చేస్తుందన్న విశ్వాసం నాకుపూర్తిగావుంది. నేటి సమస్యల వాస్తవిక దృష్టిలో పరీక్షించడానికి స్త్రీ గనక ప్రయత్నిస్తే, ప్రపంచంలో పీడలన్నీ నశించి, శాంతి సౌభాగ్యాలు శాశ్వతం అవుతాయని కూడా నేనునమ్ముతాను. అప్పుడిక పొరపాట్లుజరిగే అవకాశంవుండదు. అత్యాశ్చర్యకరంగాయేర్పడే ఈమహాపరిణామం, యేరాజకీయవేత్తలవల్లా కాని ఈ పనివల్ల, ప్రపంచంలో సంతోషం, సౌఖ్యం న్యాయం, సమానధర్మం సృష్టిఅవుతాయి. సుఖశాంతులు ప్రపంచాని కేర్పడతాయి.

ఒకవైపు నేటికాలం స్థితినిజూస్తే గుండె తరుక్కుపోతుంది. స్త్రీలతో వ్యాపారం నడిపే కేంద్రాలు నేడు కూడా వున్నాయి. ఆవిడ వ్యభిచారంలోకి దిగక గత్యంతరం లేకుండా చేయడం జరుగుతూనే వుంది. సమాజం యొక్క నిరంకుశ దౌర్జన్యాలతో విసుగెత్తి అతి లజ్జాకరమైన జీవితం గడపడానిక్కూడా స్త్రీ సిద్ధపడవలసి వస్తోంది. యే పురుషుడి మెడడైనాసరే స్త్రీ పట్ల కుట్రని ప్రేరేపిస్తుంటుంది. కాని విముక్తిని గురించి ఆలోచించదు. ఈ కుట్రలకు స్త్రీ తన జీవితాన్ని సమర్పించుకుంటుంది. ధైర్యంతో యెవరైనా స్త్రీ యెదిరిస్తే సంఘం ఆవిడనో సిగ్గూ భిడియం లేనిదాన్నిగా చిత్రించి అసహ్యమైన పేర్లు పెడుతుంది. ప్రజాస్వామ్యం అత్యుత్తమ దశలో తలెత్తుతున్న ఈ రోజుల్లో కూడా స్త్రీల క్రయ విక్రయాలు సర్వ సాధారణంగానే జరుగుతున్నాయి. జీవితం కేవలం పరిహాస భాజనంతప్ప మరే

మీా కాకుండా పోతోంది. వ్యభిచారం అన్న నిందాపదం పురుషులపట్ల యెందుకు అన్వయించదని నా ప్రశ్న! ఈ కేంద్రాలలో పురుషులెందుకు వుండరు? పురుషుల్ని మరొకరు ఎందుకు తీసుకొనివెళ్ళరు. ఈ లక్షణాలన్నీ స్త్రీల విషయంలోనే యెందుకుండాలి చెప్పండి? అని ఉద్వేగంగా అంటూంటే కమలారాణి కళ్ళవెంట అశ్రువులు రాలినవి. కాని వాటిని వెంటనే ఆవిడ తుడుచుకుంది.... "నీవేనా కన్నీళ్లు పెట్టుకునేది కమలా?"

"కన్నీళ్లు పెట్టుకోవడమంటే నాకు చెడ్డ అసహ్యాం రాజూ! కాని ఈ దరిద్రపు కన్నీళ్లు అప్పుడప్పుడు అప్రయత్నంగావచ్చేస్తుంటాయి. సరేకాని, స్త్రీని బానిసగా చూడడమే మగవాడి సహజ మనస్తత్వమైంది, లక్షరూపాయల వజ్రపునగలుధరించే స్త్రీకానివ్వు, బంగళాల్లో, సౌధాల్లో వుండేదేకానివ్వు, లేక మరేమహారాజుభార్యకానీ, ఎవరైనా సరే వారి వారి పురుషులు వారిని బానిసలుగానే భావిస్తారు, పురుషుడు యే అంతస్తులోవున్నా, ఈ మనస్తత్వంలో మాత్రం మార్పురాలేదు. ఈ భయంకరవాతావరణంలో స్త్రీకి స్థైర్యం, సౌఖ్యం, లభ్యమవుతాయన్న ఆశలేదు. పురుషుడి పిడికిలిలోనుంచి స్త్రీ విడివడడమే కష్టం అనిపిస్తూంది. స్త్రీ సహజమని ఘోషిస్తువుండే సిగ్గుదొంతరలూ, తెరలూ యివన్నీ పురుషుడికల్పనలే"

"ఇందులో పురుషుడు నేరస్తుడు కాడు. స్త్రీవంచనమే నేరం. ఆందోళన ధైర్య ప్రదర్శనలంటే స్త్రీ సహజంగా భయపడుతుంది. అవో పెద్దప్రమాదకరమని భావించి ఉపేక్షిస్తుంటుంది." అన్నాడు రాజు చిరునవ్వు నవ్వుతూ.

"రాజూ ? స్త్రీ ఆవేదనను నిట్టూర్పులగా, మాత్రం నీవు అనుకుంటున్నావల్లేవుంది. దుష్టవాంఛల పరిపూర్ణ సాఫల్యం నిమిత్తం పురుషుడు తన ఆత్మనే. అంతగృహిణినికూడా లక్ష్యపెట్టడు. స్త్రీని నికృష్టంగా సిద్ధపరచడమే మగవాళ్ళకు సహజతత్వమైపోయింది. ప్రతి పురుషుడు ప్రతిస్త్రీని అనుమానదృష్టితోనే పరిశీలిస్తుంటాడు. ఆవిడ తన కోసమే జన్మించిందనుకుంటాడు కూడాను." అంటూ ఒక నిట్టూర్పును చల్లగా వదలింది కమలారాణి. మళ్ళీ ప్రారంభించింది. "చాలా మంచిమార్పు వచ్చిందని గమనించడంకూడా నేడొక అపరాధమే ! ఇప్పుడుకూడా స్త్రీస్వాతంత్ర్య నినాదాన్ని అసహ్యించుకునేవారున్నారు. ఇంకా స్త్రీని ధనంతో కొనేయగలగడం జరుగుతూనేవుంది. స్త్రీనిదాసిగా, తలపోయటం మగవాడికి అలవాటుగానేవుంది.

స్త్రీ అంటే కష్టాలపుట్టిల్లనీ ఆపదలకు ఆలయంఅనీ కొందరు పెద్దలైనవాళ్ళే అంటున్నారు. అసహ్యాం, ఆపద, ఇవన్నీ స్త్రీ నిమిత్తమే జన్మించాయని చెప్పొచ్చు, అతి ధైర్యవతులైన కొందరు సోదరీమణులెవరైనా మహిళా పునరుద్ధారణోద్యమ రంగంలో నడుంకట్టి కృషిచేస్తుంటే వాళ్ళనుగురించి యెన్నో కట్టుకథలల్లడం, యేవోమాటలు చిలవలూ, పలవలూ సృష్టించి ప్రచారం చేయడం, ప్రత్యేక పద్ధతులద్వారా, వేపుకతినడం, మొదలైన వ్యవహారాలతో బెదరిస్తూ వారిని కార్యక్షేత్రంలోనుంచి వెనక్కి మళ్ళించడానికి ఆటంకాలు కల్పిస్తున్నారు. బయటికి స్త్రీస్వాతంత్రం గురించి, సానుభూతితో యెలుగెత్తి ఉపన్యసించే నాయకశిఖామణులుకూడా అప్పుడప్పుడూ యిలాంటి వాటిల్లో

ఆంతరంగికంగా తలమూరుస్తూ వుంటుంకంటే, ఆశ్చర్యం అనిపించకుండా వుండదు." ...

కమలారాణి ఉపన్యాసాన్ని రాజు అతికుతూహలంగా విని ఆపిడపని పరికించిచూస్తూ కాసేపు మౌనంగావుండి చిరునవ్వుతో "ఖేదపడనవసరం లేదు రాణీ!...నిన్ను నీవు రక్షించుకోవడానికి" సమర్థురాలవైనప్పుడు అన్నిసమస్యలూ అవే పరిష్కారమవుతాయి అన్నాడు.

"అన్నంత సులువుగా యీ సమస్యలు పరిష్కారం అవుతాయన్న ఆశ నాకు నిజంగా లేదు సుమా! చీకటి గుహలావున్న స్త్రీ బ్రతుకులో కాంతి కిరణాల ప్రవేశం అసాధ్యం అనిపిస్తుంది. ఆడది యెంత ఆందోళన చేసినా గమ్యం అంతగా దూరమైపోతోంది.

తమ నేరాలను కప్పిపుచ్చుకోవడానికి పురుషులు స్త్రీలనెప్పుడూ స్తోత్రం చేస్తూవుంటారు. మహిళల కష్టాలు తమకే యెక్కువ కలవరపరుస్తున్నాయంటూ తమ భాషలో మొసలి కన్నీరు కారుస్తూ, స్త్రీల సానుభూతి పొందటానికి యత్నిస్తుంటారు. చూడండి! ఈ మొసలికన్నీళ్ళకి అర్థం? యేదైనా ఒక సంఘానికి అధ్యక్షురాలిని స్త్రీని చేయవచ్చు. అదైనా తమ మధ్యన స్త్రీ అంటూ ఒక తెనువుంచుకొని తమ హృదయాలకు ఆహ్లాదం కలిగించుకోవడానికి మాత్రమే! మగవాళ్ళ యీ ప్రవర్తన పట్ల విషాదం ప్రకటించడం వల్ల లాభం యేమీలేదు. వూరికే విని సంతృప్తి పడడం తప్ప. నాకుమాత్రం వీళ్ళ ఈ అనన్యవాత్సల్యం చూస్తే విపరీతమైన నవ్వొస్తూంటుంది.

ఆసలు ఈ మగవాళ్లు గ్రహించడానికి వీల్లేనంత జిత్తులమారివాండ్లు. యెంత సాధు స్వభావులో! దేవతల వలె కొందరు కన్పిస్తుంటారు. కాని అలా భావించడమంత ఘోరమైనపొరపాటు మరొకటి లేదంటాను. నా అను భవంలో చెప్పాలంటే యెక్కువగా సరళస్వభావుల్లాకన్పించే వాళ్ళే ఆంతరంగికంగా మహా ప్రమాదకారకులుగా వుంటారు. మగజాతి స్వభావం గ్రహించి ప్రతి స్త్రీ కూడా నిరంతర జాగరూకురాలై వుండాల్సిన అవసరంవుంది." అని కొంచెం ఆగింది కమలారాణీ.

"ఐతే నామీద కూడా నీవు దెబ్బతీస్తున్నా వన్న మాటేగా!" రాజు చిరునవ్వుతో అన్నాడు. కమలకూడా నవ్వుతో రాజును చూసింది. రాజు హఠాత్తుగా లేచి, "సరే అయితే నేనిక వెళతాను." అన్నాడు. కమల తక్షణం లేచి అతని బుజాన్ని పట్టుకొని అణిచి కుర్చీలో మళ్ళీ కూల వేసింది. "నేను మాట్లాడే యేమాటైనా నీమీద దెబ్బతీయా లన్న భావంతో కాదనుకో రాజూ! నా మనస్సులోని యధార్ధాన్ని తెలిబుచ్చుతుంటా నంతే! నా అభిప్రాయంలో కూడా బహుశా దోషాలుండవచ్చు." అంది.

"నీవు లక్ష వుపన్యాసాలివ్వు రాణీ! ఆడది స్వయంగా బలహీనురాలై, తనంతటతానే వినాశమార్గంలో నడవడం మూర్ఖత్వం. ఈ తత్వం వున్నంతవరకు స్త్రీలకి మోక్షం వుండదు. ధైర్యంతో ఈ బంధనాలనుండి, విముక్తి పొంద టానికి నిజంగా యత్నించిననాడు స్త్రీని యేశక్తి నిలువరించ యుంచలేదు." అన్నాడు రాజు నిశ్చితంగా.

ఆవిడ యేదో ఆలోచిస్తూ కాస్సేపు మౌనంగా నేవుండి పోయింది.

"మళ్లీ ఏమిటిఆలోచిస్తున్నావు ? నీమాటలు వింటు న్నకొద్దీ, అన్నివిధాలా జీవితానికి అతిసమీపంగా జరిగి, అనుభవం చేసుకోవాలన్న ప్రేమ ఉవ్వెత్తుగా మనస్సులో జనిస్తోంది." అన్నాడురాజు.

"కాని నాఅనుభవాలు మాత్రం కొన్ని మరచిపోవ డానికి నేను అశక్తురాలిని. బహుశా మృత్యుదేవత ఒడిలో కూడా జీవితంలో అనుభవించిన మోసాలునూ ధక్కాముక్కా లనూ మరచి పోలేనేమో ! అయినా నీ సంభాషణల్లో ఒక విధమైన ఆనందం, ఒకవిధమైన భావావేశం, సంచలనం, నాహృదయాన్ని ఉత్సాహ పరుస్తున్నాయ్." అంది కమలారాణి.

ఇదిగో కమలా ! నీ ఒక్క_త్తెవేకాదు. నాకూడా జీవితం గురించిన కొన్ని కఠినానుభవాలున్నాయ్. కాని నేను జీవితంపట్ల విరక్తుణ్ణిమాత్రంకాదు నా యీస్వల్ప వయస్సు లోనే పరిస్థితులప్రభావం, నన్నెన్నోసార్లు చికాకుపెట్టి యిరు కునపడేసి, చివరికి ఆత్మహత్యవినా, మార్గములేని దశను గూడా కల్పించింది. అయినా నాకు బ్రతుకంటే అసహ్యం యెన్నడూలేదు. బ్రతుకులోతిన్న తాపులూ, మోసాలూ, అన్నీ వివిధపరీక్షలుగా భావించాను. 'కేవలం హృదయంతో టేగాక, అప్పుడప్పుడూ మెదడునుకూడా ఉపయోగించి పరి స్థితులతీవ్రతని ఓర్పుతో యెదుర్కొంటేనే సమస్యలకి పరి ష్కారం లభిస్తుంది." అన్నాడు రాజు. అతనిస్వరం చాలా సానుభూతి సూచకంగావుంది.

"రాజూ; నీమాటల్లో అందర్నీ ప్రభావితం చేసే మాధుర్యంవుంది." అంటూ అతనికళ్ళల్లోకి కాస్సేపుసూటిగా కాస్సేపు వాలుగా చూచింది.

"ఎందుకలా తీక్షణంగా దృష్టి ప్రసరిస్తున్నావ్." అన్నాడు రాజు.

"ఇలా చూస్తూనే అశాంతిని తరిమివేయాలనుకుంటున్నాను." కమలస్వరం చాలా ఆర్ద్రంగామారింది. స్వల్పకాలం మౌనంతరువాత ఆవిడకళ్లూ పెదవులూ చిరునవ్వుతో మెరిసిపోతున్నాయ్. ఆవిడ శరీరంలో, మొదట్లోవున్న వేడి అంతా బహిర్గతమై, చల్లదనం ఆవేశించింది. మనస్సు భారందిగిపోయి తేలికపడ్డట్టయింది, ఆవిడకళ్ళు వికసించిన తామర పువ్వుల్లా విప్పారి మెరుస్తున్నాయి.

"నీతో మాట్లాడిన అనంతరం ఇవ్వాళ నా మనసుకి లభించిన ఆనందం వర్ణనాతీతమైందిరాజా! శుభదినం నాలో అవిస్మరణీయంగా వుండిపోతుంది. ప్రపంచంపట్ల నాకున్న ఈర్ష్యా క్రోధాలు నీ ఉపదేశంతో తీవ్రత తగ్గి, యేవో మరికొన్ని భావాలు వాటి స్థానాన్ని ఆక్రమిస్తున్నాయి. ఈ సంఘం పట్ల నాలోవున్న స్పర్థ, అసహ్యం క్రమంగా తొలగుతున్నాయేమోనని భయమవుతోంది.

ఈ ప్రాపంచిక విషసర్పం నన్ను తీవ్రంగా కాటు వేసింది. ఈ సంఘంలో నేను, పెద్దమనిషని భావించిన ప్రతివాడూ, నాశరీరాన్ని కొల్లగొట్టాలని చూశాడు. ప్రతిపరిచితుడూ, తన తెలివిని ఉపయోగించి, నాచనువుని దుర్వినియోగ పరుచుకోవాలనే ఆశించాడు. నన్నో అందాల

దేవతగా అభివర్ణిస్తూ, కులటగా సిద్ధపరచడానికి చూచాటు. మరికొందరు నన్ను పొగడుతూ, దేవతగా ఆరాధించడం ప్రారంభించి, నేను మెత్తబడి, నా సర్వస్వాన్నీ వారికి అప్ప చెప్పుకోగలనని దూరూహాపాలైనారు. శరీర సౌందర్య వంతులు లక్షలమంది కవ్వించారు. కాని ఈ లక్షలలో ఆత్మ సౌందర్యం గల వ్యక్తియే ఒక్కడూ కనపడ్లేదు.

ఇవాల్టి నీ ప్రసంగం ఈ కొరతను పూరించిందిరాజా! నీ వింతవరకు యెవరి శరీరాన్నీ ప్రేమించలేదని తెలుస్తోంది. నీ వ్యాసాలూ, కథానికలూ, చాల పఠించాను. నేను నీ రచనలు చదివే పదిమందిలో నేనొకదాన్ని. నీ ప్రతి సంభా షణలో, ఒక విధమైన చురుకుదనం, భావ ప్రకటనలో ఒక విరూత్న పద్ధతి వుంటుంది. నీ రచనలు జీవితాన్ని ప్రేమిం చడం నేర్పుతాయి. జీవితంతో సంఘర్షణ ప్రేరేపిస్తాయి. వీటి ప్రభావమే నేనునిన్ను కలుసుకునేలా ప్రోత్సాహించింది అన్యోన్యాభిప్రాయాలు గ్రాహ్యం కావడం మంచిదిఅనుకొని నిన్ను పిలిచాను. మొదట మొదట నీ సంభాషణలో నిరాశ ప్రస్ఫుటమైనా, నెమ్మదిగా తరచిన కొద్దీ, నీ సహజస్వరూపం కనిపించ మొదలైంది. నీ నుంచి ఇంకా నేను చాలా నేర్చు కోవాలనుకుంటున్నాను. ఈ ప్రపంచం పట్ల నాకున్న మనోభి ప్రాయాలు, అనుభవాలూ, నీ ముందుంచాక నాకు చాలా తృప్తిగావుంది. చూడటానికి ఎంతో మౌనంగా, నిరాడంబ రంగా నీవున్నప్పటికీ, నీలో విద్యుత్తుని మించిన చలనాత్మక శక్తి ఒకటినిబిడీకృతమైవుంది. తీవ్రంగా వేడెక్కిపోయిన నా మెదడు, నీమాటల్తో చల్లబడి, ఆత్మానందం లభిస్తోంది. నా యీ జీవితంలో నలుమూలలా ఆవరించుకొనివున్న

అంధకారం చెదిరి పోవడానికి నీవు సహాయంగా వుంటావని హృదయపూర్వకంగా ఆశిస్తున్నాను, ఒక దేవతామూర్తిలా అనబోతుండగా

"ఆగు కమలా! నేనూమానవుణ్ణే. కాని దేవతను ఎలా కాగలను! ఒక స్నేహితుడిస్థాయిలో, నా సహాయం నీకు సర్వధా లభిస్తుంది. నాక్కూడా నీవంటే ఒకవిధమైన శ్రద్ధ అభిమానం యేర్పడ్డది. నీ అనుభవాలన్నీ ఆమూలాగ్రం వినాలనీ నీజీవితంద్వారా నేనుకూడా కొంతపాఠం నేర్చుకోవాలని అనుకుంటున్నా," అన్నాడు రాజు,

"నాపట్ల ఇంత శ్రద్ధవహించినందుకు సంతోషం. కృతజ్ఞురాలిని."

"అవునుమరి, శ్రద్ధవహించాల్సిన అవసరం యేర్పడ్డది. నీ చిరునవ్వు తెరవెనుక స్ఫుటంగా కనుపించేబాధనూ, దుఃఖాన్ని దూరంచేయాలిగదా? నీ కఠోరానుభవాలకు, స్నిగ్ధసౌకుమార్యమైన అనుభవాల పరంపరనికూడా కొంత జతచేయాలిగదా?" అని రాజు కమలారాణి ముఖంలోకి చూచాడు.

కమల ఈ మాటలువిని పెద్దగా నవ్వుతూ, మెరపు తీగలాంటి తనచేతిని రాజువైపు చాచింది. రాజు హఠాత్తుగా ఆ చేతిని తన చేతుల్లోకి తీసుకుని, చాలా సమయం గడిచిపోయింది కమలా! ఇక వెళతాను అన్నాడు"

"సరే వెళ్ళండి! కాని, ప్రతిరోజూ వస్తానని వాగ్దానం చేసి మరీవెళ్ళాలి." అందికమల.

"అవశ్యం. ఇదే వేళకు వస్తుంటాను; నీవు మళ్లీ రావద్దనేదాకా ?"

"నిన్నుకూడా అలా అనేంత కఠోరదశ నాకు కలుగుతుందంటావా ? అలా అనను లే ! పూలపొదల్లో ముండ్లు కూడా వుంటాయి. ఆ ముండ్లనికూడా పూల మొగ్గలుగా మార్చేస్తాను రాజా !"

"కృతజ్ఞుణ్ని. ఇక వెళ్ళనా ?"

"మంచిది. కాని రేపుయెదురు చూస్తుంటానుసుమా"

"ఎక్కువసేపు యెదురు చూడనీయను లే." అంటూ రాజు బయటపడ్డాడు. జీవితంలో యింతటి బాధాపూరితమైన అనుభవాలున్నప్పటికి, ఆవిడ హృదయంలో యింతటి సజీవస్పందనశక్తి వున్నందుకు, ప్రతిమాటా నగ్నసత్యసమన్వితమై వున్నందుకూ రాజుకు చాలా సంతోషం వేసింది. అతను నడుస్తూ ఆలోచిస్తున్నాడు. కొద్దిగంటలలోనే ఆవిడతో చాలా సాన్నిహిత్యం సాధించుకున్నాడు. ఆశ్చర్యాకరమయిందేదీ కన్పించడం లేదు. అంతా సహజంగానే వుంది, కమలను సంరక్షించే బాధ్యత, తనధ్యేయ మేమిటన్న భావం, హఠాత్తుగా రాజుకుకలిగింది. కన్నీళ్ళకు కఠినపాషాణం కరగదు. నిర్దిష్టకార్యం, నిరంతరయత్నం, అవసరంఅవుతోంది.

కమలమనస్సులో గాఢంగా ఆవరించుకొనివున్న నిరాశామేఘాలని తరిమివేయడం తన బాధ్యతయన్న విషయం నిర్ణయమైంది. ఇంటికి వెళ్ళి ఆరాత్రి నిద్రపోవడానికి ప్రయత్నించాడు. కాని యీ ఆలోచనలు అతని మనస్సులో చక్రభ్రమణంచేస్తూ నిద్రపట్టనేలేదు. ఎలాగో అతికష్టంమీద ఆరాత్రి మేనువాల్చాడు.

రాజు యింతత్వరగా కదలిపోవడం కమలకి యిష్టం లేదు. కానిఅతనువెళ్ళడానికిచాలాతొందరపడ్డాడు. అతనలా వెళ్ళిపోగానే ఆవిడకళ్ళల్లోంచి రెండుముత్యాలబిందువులు చెక్కిళ్ళమీదికి జారినవి. తనమనస్సులో యెవరో నిప్పుపుల్ల గీచి వెలిగించినట్లయింది. ఆవిడకళ్ళని గట్టిగామూసుకుంది. కాని మనస్సులోరేగిన అగ్నియింకా వుధృతమవుతోంది!... మంట !... అంతామంట ! ఆవిడకి అంతా అయోమయంగా, చికాగ్గావుంది. రాజు మాట్లాడుతున్నంతసేపూ, తనకోపెద్ద అండ లభించినట్లుగా అనిపించింది. ఈరాత్రంతా నిండుపున్నమఅనుకుంది. రాజు ప్రతిమాట ఆవిడలో సంచలనాన్ని స్థైర్యాన్ని ప్రేరేపించినది. కాని అతను వెళ్ళడంతోనే స్థైర్యం అగ్గిలామారింది. రాత్రంతా అంధకారవృతం, భయంకరం అయిపోయింది.—ఆవిడపరంపరగా ఆలోచిస్తూ తనస్థితుల పర్యాలోకనం ప్రారంభించింది. చాలా అలసట జెందనట్లుందావిడ మనస్సుకి, ఆవిడికి గతచరిత్రంతా స్మృతిలో నిలబడింది. తనమీద ప్రయోగింపబడిన కర్కశత్వం, అసాధారణమైందిగా భావనలోనిల్చింది. అత్యున్నత, సాంస్కృతిక శిఖరాలకెగబ్రాకిన ఈప్రపంచంలో, మనిషి యెంతనీచుడవుతున్నాడు. ధనంకోసం స్త్రీకోసరం, యిక్కడ యెంత అమానుషత్వం ప్రదర్శింపబడుతోంది ? ఒకరి అభిప్రాయాలపట్ల మరొకరికిలక్ష్యంలేదు. ప్రేమఅని, ప్రణయమని కపటనాటకాల్తో ఆడదాన్ని బంధించి, బుద్ధిహీనురాలిని చేస్తున్నారిక్కడ. యీనాటకం చివరిరంగం తెరపడ్డాక, స్త్రీ కేవలంఒక ప్రదర్శనవస్తువుగా తయారవుతూంది. ప్రతివాడూ

ఆత్మాభిమానం, పరువు మర్యాదలను గురించి ఉపన్యసిస్తాడే గాని, అవసరంవస్తే అందరికీ ఆత్మాభిమానం, పరువూ మర్యాదలు, వుంటాయన్న భావం గాలికెగిరిపోయి, అంతా అసహ్యం క్రిందికి మారిపోతుంది మనం దేవతలాంటివ్యక్తి అనుకునే అనడే, మరికొంతసేపటికి దయ్యంలా వికృతచర్యలు చేస్తుంటాడు

ఇలాంటి పరువు మర్యాదలుగల ప్రబుద్ధులమధ్య, ఒక నిస్సహాయ స్త్రీ, అబల, తనని తానెలా రక్షించుకోగలుగుతుంది ? ఎన్ని చిక్కులనుండి విముక్తి పొందగలుగుతుంది. అడుగడుగునా, మూర్తీభవించిన మోసమే ! 'అమ్మా ! చెల్లీ' అని పిలుస్తూనే, విషపు వాంఛలను వెళ్ళగ్రక్కేమనుషులు. ఛీ ! ఛీ !! యిప్పటివరకూ ఎంతోపవిత్రమైనదిగానూ, యెంతో మర్యాదాయుతమైనదిగానూ, భావించబడే యీ సమాజానికి దుర్గంధపు చీడపట్టుకుంది. ఎవరిది పవిత్ర జీవితమని భావిస్తుంటామో, వారి జీవితపు లోతుల్లోకి వెళ్ళి పరిశీలిస్తే, అక్కడ మరొక వస్తువు కనిపిస్తుంది. సహజమైన ఆ వస్తువును గురించి మనం కలలో కూడ ఊహించియుండము.

రాజు మాటలు, ఒక ప్రత్యేక పద్ధతిలో ఉంటాయి. జీవితాన్ని అతను ఒక ఉద్యమము, సంఘర్షణగా, వర్ణిస్తాడు. కాని, ఒక అబల ఈ ఉద్యమ సంఘర్షణలో, తన పాత్ర నెంతకాలము నిర్వహించ గలుగుతుంది ? ఎంతకాలము తన అభిజాత్యాన్ని కాపాడుకొనగల్గుతుంది ? చుట్టూతా విష సర్పాల్లా బుసలు కొట్టే మనస్తత్వాల మధ్యన కాటు తినకుండ ఎలాయుండ గల్గుతుంది ?

ఈ ఆలోచనతో కమలకి స్త్రీ జన్మము మీదనే తగని విరక్తి జనించినది. అసలు దేవుడు ఈ స్త్రీ జాతిని సృష్టించిన దెందుకో ఆవిడికి అర్థం కాలేదు, జీవన ప్రాంగణంలో, స్త్రీకి మరియొక వ్యక్తి తోడుఉండి తీరాలి. చిన్నతనములో, అమ్మ నాన్నల రక్షణ, తర్వాత భర్తరక్షణ, వృద్ధాప్యములో సంతాన రక్షణలో పడియుండటం. ఇంకా బోలెడన్ని కఠోర సమాజ నియమ నిబంధనలు, మొత్తం మీద స్వాతంత్రత అనే భావముకూడ స్త్రీ మనస్సులోనికి రాకుండా అడ్డుకొంటున్నాయి. ఈ లోకంలో కాంతి రేఖలని ఆశించటమే ఒక మహాపాపం క్రింద గణనకు వస్తుంది. కమల ఆలోచిస్తుంది.

తన తల్లి తండ్రికోసమే, తన జీవితాన్ని నాశనము చేసికొంది. పతియే ఆవిడికి దేవుడయ్యాడు. భార్య అనేది, కనీసము (బతికి ఉందనైనా తెలియని భర్త దేవుడు కావడమేమిటో! అతనికోసరము స్త్రీ తన జీవితాన్ని ఎందుకు ధ్వంసం చేసికోవాలి! కమలకి చివరికి, ఈ వాతావరణం, ఈ ప్రపంచం మీదనే తీవ్రమైన అసహ్యమేస్తున్నది.

పురుషులను ఆశ్రయించటం, నేరస్థులను ప్రోత్సహించటంలాంటిది. నేరస్థుడే తన జీవితాన్ని అతి సౌఖ్యవంతముగా గడుపుకొంటాడు. గాని, అభిజాత్య సంపన్నులే అడుగడుగున అనేక అవస్థలకు గురి అవుతారు. అమాయకులైన వారంతా అష్టకష్టాల పాలవడం తప్పనిసరి. చివరికి వారి జీవితమే ఒక కొలికరాని సమస్యగా మారేదశ ఏర్పడుతుంది. కాలవాహిని తరంగాలు, వీళ్ళని సుఖపడనీయకుండా, వెనక్కి నెట్టేస్తాయి. వాళ్ళ మంచితనమే వాళ్ళకు ప్రమాద

కరమైన శత్రువుగా తయారవుతుంది. జీవితమంతా బాధా పంకిలమవుతుంది. ఈలాంటి వారందరి అంతిమ గమ్యస్థానము మృత్యుదేవతా పీఠమే-ఇంకా ఆలోచిస్తునేవుంది కమల.

దీపంపెట్టి వెతికినా మర్యాదస్తుడు, సహృదయుడు, సాహసికుడు అయిన వ్యక్తిత్వం మచ్చుకైనా కన్పడదే! సాహసం సచ్ఛీలంలో, ఇంతవెనుకబాటు, దూరపుతనం ఎలా సంభవించినది ? కమలకి నాలుగువైపులా అంతా అంధ కారమే కనుపిస్తుంది. జీవితంతో సంఘర్షణ పడాలి. ఆందో ళన సాగించాలి, అంటాడు రాజు. కాని ఈ సంఘర్షణ, ఎందుకోసం ? కష్టాలు అధికం చేసికొనటానికా ? కాల మృత్యువు వాలవడానికా ?

కమలకి తలతిరిగి మూర్ఛవస్తున్నట్లు అనిపించినా, యింకా ఆలోచిస్తునేయుంది. అంతలోనే ఆవిడ ఆలోచనా ధోరణి మరోవైపు మళ్ళింది. ఏమైనా రాజు మాటలు హృదయారాటాన్ని తగ్గించి ఆహ్లాదం కలిగిస్తాయని, అతని మాటలు వెలుగును ప్రదర్శిస్తుంటాయని విశ్వాసంఏర్పడింది.

స్త్రీ కేవలం పురుషునికోసమే సృష్టించబడిందనుకోవ టం శుద్ధ అవివేకం. జీవిత సమస్యలను పరిష్కరించుకోలేక దూరంగా పారిపోవటం ఒట్టిపిరికితనం. జీవితం కష్టాలమయం అనుపదం మరచిపోయి, జీవిత ఆమూలాగ్రం అర్థం చేసు కోవటానికి ప్రయత్నించాలి. భావోద్రేకముతో పరిగెత్తటం వల్ల, కించిత్తు లాభం ఉండదు. జీవిత ప్రాంగణములో నిల బడి, ఒకటీ రెండుసార్లు తలుపు తట్టడంతోనే సౌఖ్యద్వారం తెరుచుకోదు. ఇందుకోసం నిరంతర శ్రమ అవసరము. ...

ఇల్లాంటివే రాజుమాటలన్నీ, చాల నిష్కపటంగా మాట్లాడేస్తాడు,

రాజుమాటలంటే తనకు చాల ప్రేమ ఏర్పడుతున్న మాటనిజం. ఈ ప్రేమలో ఏమన్నా స్వార్థపూరితమైన మనుత గుప్తమైయుందా యని మళ్ళీ ఆలోచనలో పడింది. అసలు ప్రేమ, అనేదే ఒక స్వార్థావలంబనము. ఏదో ఒకస్వార్థం లేనిదే ఒక విషయం పట్ల ఆసక్తి జనించదు... కమల మెదడులో చిత్ర విచిత్రమైన ఆలోచనలు రేకెత్తుతున్నాయి. వీటితో ఆవిడ సతమతమవుతోంది.

మనుషులందరినీ, ఒకపాయలో మంచివాళ్ళుగా ఈ పాపిష్టి దేవుడు ఎందుకు సృష్టించలేదు? పరమాత్ముడందరినీ ఆదరిస్తాడని అందరుఅంటారు. కానిఅలాఅందరినిసమానంగా చూస్తే. అంతా సమానంగా ఎందుకుండరూ? ఇందులోనే కొందరు దుర్మార్గచక్రవర్తు లెలాగు కల్గుతున్నారు? ... కమలకి భగవంతునిపట్ల ఒక కొత్తదృష్టి ఏర్పడినది,

రాజుమాటలు చూస్తే, చాల పవిత్రంగా ఉంటాయి. అతని రచనలు, సంభాషణ గమనించాక అతన్ని గౌరవించకుండా ఉండబుద్ధికాదు, ఎటూ నిర్ధరించుకోలేక, మనస్సు యాతన పడిపోతున్నది. అప్పటికప్పుడు రెక్కలు కట్టుకొని తానే స్వయంగా రాజుముందు వాలాలనీ అతనితో యింకా బాగా మాట్లాడాలనీ, అనిపించింది కమలకి. కాని, అంతలోనే తన నిగ్రహహీనతకి, తనలో తానే సిగ్గుపడింది.

అన్నివసతులూ అలంకారాలతో కూడిన ఒకయింట్లో కమల ఒంటరిగానేవుంటూంది, ఒక పనికత్తె, మరొనౌకరు కుర్రోడు, ఆవిడకి తోడుగావుంటున్నారు. ఆవిడచేసే

వుద్యోగం, ఆఫీస్ సూపరింటెండెంట్ అయినా గెజిటెడ్ ఆఫీసరు స్థాయిలో జీవితం మంచినీటుగా, గడుపుతూండేది. తను తక్కువదాననే భావం ఆమెలో యేనాడుకన్పించదు. ఆమె జీవిత విధానమే వేరు. కలెక్టరేటిలోని సిబ్బంది యావత్తూ, ఆవిణ్ణి అదోభావంతో చూస్తున్నప్పటికీ, అన్ని పరీక్షలకూ తట్టుకుంటూ ఉన్నతాశయాలతో ధైర్య స్థైర్యాలతో ఉద్యోగం సాగిస్తోంది.

ఇంట్లో తీరికవేళల్లో కమల పియానో వాయిస్తూ కాలం గడుపుతుంది. భావావేశంలో ఒక్కోసారి వివశురాలై పాటలు పాడ్డం ప్రారంభిస్తుంది. ఆవిడకంఠంలో, అత్యంతాకర్షణీయమైన, అతిలోక మోహనమాధుర్యంవుంది. ఆపాటలువినే ప్రతివారిహృదయం విద్యుద్వేగంతో తిరిగే పంకాలావుంటుంది. అంతటా నిశ్చలమౌనం ఆవహించి, ప్రకృతి సర్వం ఆవిడతియ్యనిపాటని, తన్మయత్వంతో వింటున్నట్టుంటుంది కమల యింటికివచ్చిన మిత్రులు, మిత్రురాండ్రంతా అక్కడవున్న క్షణంసేపైనా తమకష్టసుఖాలను మరచి తాదాత్మ్యం పొంది, హృదయం తేలికపడుచూ వుంటారు. యేదోనూతన ప్రపంచంలో ప్రవేశించినట్లు వూహించుకొని, తిరిగి అక్కణ్నుంచి నిష్క్రమించడానికి మనసొప్పనివారిలా తటపటాయిస్తుంటారు. కమల తనను మనసారా ప్రేమిస్తున్నదనీ. కమలహృదయాన్ని తానే జయించాననీ, ప్రతిమిత్రుడూ తనలోతనే పూర్తిగా విశ్వసిస్తూవుండేవాడు, మొత్తంమీద అంతా కమలపట్ల అభిమానం ప్రదర్శిస్తారు, ఆవిడ మెప్పు పొందటానికి పోటీపడి కృషిచేస్తుంటారు. అధికంగా ఆఫీసులో తనతో పనిచేసే బృందంఅంతా ఉబుసుపోక నిమిత్తం ఆవిడ

ఇంటికివచ్చి తిట్టవేస్తున్నా, ఎన్నడూ ఆవిడ విసువు ప్రదర్శించదు. ఆవిడి సంభాషణ అందరితోనూఅలౌకికత్వంతో పొంగిపోతుంటుంది, ఈ సంభాషణతో కొందరి గుండెలే గడ్డకట్టిమంచుగా ఉండిపోతే, మరికొందరికి జిజ్ఞాస రేకెత్తుతూండేది. ఇంకొకరు సౌభాగ్య జీవిత స్వప్నాలను కంటూంటారు. మర్నాడు తన జీవితగమనాన్నే మార్చుకోవాలనుకుంటారు. మరో మిత్రుడు ధ్యానంగా ఆవిడ నిజతత్వం గురించి పరిశోధనలో పడతాడు. ఇంతమంది ఇన్ని విధాలుగా మునకలు వేస్తున్నా, కమల ముఖంలో ఔదాసీన్యం, చింతా రేఖలు యెప్పుడూ అంకురించేవికావు. ప్రతిమాటకీ ప్రతి ప్రశ్నకీ, చిరునవ్వు నవ్వుతూనే ప్రత్యుత్తరం యిస్తుంది. చిరునవ్వు ఆవిడ పెదలవులకి శాశ్వితంగా అంకితమైపోయిందనిపిస్తుంది.

'అబ్బ ! ఎంత సుఖమయ జీవితం; చీకూచింతా లేదు." అని ప్రతివారూ అనుకుంటారు. కమలకూడా నిజంగానే ఆత్మ విశ్వాసం అధిక స్థాయిలో వుంటుంది. యికతాను ప్రతి కష్టాన్ని ధైర్యంతో యెదుర్కొనగలనన్న ఆత్మ విశ్వాసం ఆవిడకి అధిక బలాన్ని చేకూరుస్తుంది.

◆ ◆ ◆ ◆ ◆

ఆ పట్నంలో యెక్కణ్నుంచోవచ్చి కొత్తగా ప్రాక్టీసు ప్రారంభించాడు- డాక్టర్ రావ్. మంచి స్ఫుర ద్రూపి. నాజూకు శరీరం. అతన్ని చూస్తే ప్రథమంగా, అతనొక ఆర్టిష్టు, అనుకుంటారేకాని, డాక్టర్ అని యెవరూ అనుకోలేరు. స్ఫురద్రూపంతోపాటు, మృదుహాసం, మధుర భాషణమునూ అతనికి అలంకారంగా వుండేవి. చాలా మందికి

ఏదో ఒక జబ్బు నెపంతో కులాసాగా అతనితో మాట్లా డాలనిపించేటంతటి ఆకర్షణ డాక్టర్‌లోవుంది. అందరిమీదా అతని వ్యక్తిత్వం ఇంద్రజాలంలా పనిచేస్తుంది.

డాక్టర్ రావు ప్రారంభించిన కొన్ని నెలలకే పట్నంలో సగానికి పైగా ప్రైవేటు డాక్టర్లంతా బోర్డులు త్రిప్పవలసినస్థితియేర్పడ్డది. ఇక ప్రభుత్వ వైద్యశాలవైపు తిరిగి చూచేవారే లేక దాదాపు ఖాళీగానేవుంది. తెలిసిన ప్రతిరోగీ డాక్టర్ రావు హస్తవాసి మంచిదనీ, ఓపికతో ప్రతి జబ్బునూ పరీక్షిస్తాడనీ, అక్కడికేవస్తారు. ప్రతిరోగి తోనూ మధురంగా నవ్వుతూ మాట్లాడ్డం, ఓపికతో జబ్బును గురించి తెలుసుకోవడం, ట్రీట్‌మెంట్‌లో తరతమ భేదాలు లేకుండా వారి వారి స్థితినిబట్టి, బిల్లు చేయడం అతని ప్రత్యే కత. ఈ ప్రత్యేకతే ఆయన ప్రాక్టీసుని మూడు నెల్లో మూడు పూవులూ ఆరుకాయలూ కాయించింది. అతనంటే ప్రతివారికీ ఒక సదభిప్రాయం.

డాక్టర్ రావు ఆఫీస్‌గది ఆధునిక పద్ధతిలో అలంక రించబడి, ఆకర్షణీయంగా వుంటుంది. కాని ఏకాలంలో యేక వ్యక్తికన్నా యెక్కువ నిలబడి ఆయనతో మాట్లాడే యేర్పాట్లు మాత్రం కావాలనే చేయలేదు. ప్రథమంలో ఆయనవద్దకు వెళ్ళే స్త్రీ రోగులు వెంటతమకి తోడుగా మరొకర్ని తీసికెళ్ళేవాళ్ళు. కాని ఒకసారి వెళ్ళాక తమ ప్రక్కని మరొకర్ని తీసుకొనిపోవడం వారికే ప్రాణ సంకటంగా వుండి, ఒక్కళ్ళు మాత్రమే వెళ్ళడానికి ఉబలాటపడేవారు. ఇకపేషెంట్లూ, ఔటు పేషెంట్లతో, డాక్టర్ రావుకి ఒకక్షణం తీరికగా కూర్చోవడం పడక

పోయినా, అంత బిజీలోకూడా యెప్పుడూ, నిశ్చయాత్మన దరహాసంతో వుండేవాడు. స్త్రీలలో అధికభాగం, కళాశాల విద్యార్థినులే అతనివద్దకు రోగులుగా వస్తారు. తరువాత స్త్రీ అధ్యాపకురాండ్రను చెప్పుకోతగ్గవారు. వీరంతా యేదో ఒక మంచుకోసరమన్నే, ఒకఖాళీసీసాను స్వయంగా పట్టుకొని, కొందరు బహిరంగంగానూ, కొందరు పరదాల్లోనూ, ఆస్ప త్రికి చేరుతుంటారు. ప్రతివారిమీదా డాక్టర్ ప్రభావం చాలావుండేది. అతిస్వల్పకాలంలోనే పట్టణవైద్య జీవితం లోనూ- సాంఘీక జీవితంలోనూ డాక్టర్ రావు ఒకసుడిగాలిలా వ్యాపించిపోయాడు. ఒకరికెంత అల్పమైన పడిశం, తదితర వ్యాధులు యేర్పడ్డా తక్షణం డాక్టర్ రావునే వెదుక్కుంటూ రావడంతో ఆదివారాలు కూడా ఆస్పత్రి తిరునాళ్ళగానే వుంటుంది. రోగులు వచ్చేటప్పుడు తమవెంట వేదనా భారాన్ని తెచ్చుకొని, తిరిగివెళ్ళేటప్పుడు అమూల్యాను భూతుల భారాన్ని దానికిబదులుగా తీసుకువెళతారు. డాక్టర్ రావును చూచి ఆయనతో మాట్లాడ్డానికే రోగులైనట్లు కొందరి ప్రవర్తన వుంటుంది. అసంపూర్ణమైన యేదో ఒక వాంఛ పూర్ణం చేసుకోవడానికే డాక్టర్ దగ్గరకు వస్తున్నట్లు మరికొందరుంటారు. అందరినీ ఆకర్షించగల సూదంటిరాయి అతడు,

డాక్టర్ రావు ప్రశస్తి కమల చెవులకూడా పడింది కాని ఆమె అంతగా యీ విషయంపట్ల శ్రద్ధచూపలేదు. కాని ఒకనాడు కమల గుమాస్తా సహచరురాలు మహా లక్ష్మివచ్చి తనకు ఘోరమైన జలుబు పడిశం పట్టుకుందనీ, డాక్టర్ను చూడకపోతే ఇన్ఫ్లూయంజాగా అది మారుతుం

దేమోననీ, భయం ప్రదర్శిస్తూ రావు దగ్గర ట్రీటుమెంటు తీసుకోవాలనీ పట్టు పట్టింది. యిద్దరం కలిసి ఒకసారి అలా ఆస్పత్రికి వెళదాం రమ్మంది

కమల సాక్షేపంగా నవ్వుతూ ఇలా అంది. "జలుబు చేసిందా లేక మరేదన్నా ... ? ఆస్పత్రికి వెళ్లాలని ఆరాట పడుతున్నావే లక్ష్మీ! రావువైద్యంకన్నా ఇంద్రజాలం అధికంగా ప్రయోగిస్తాడని విన్నానులే! ఒక్కసారి ఆస్పత్రి కెళ్ళి వచ్చారంటే ఆజబ్బు యెప్పటికి న య ం కా ద నీ. రోజూ ఆస్పత్రికెళ్ళవలసి వస్తుంటుందనీ అంటారు. నిజంగానే అలాంటి జబ్బేనని తేలితే ?

"నీమాటలు నాకేంఅర్థం కావటంలేదు" అ ం ది కమలముఖం ఉబ్బిపోతుంటే ! ... ...

"నీకు బాహ్యస్మృతి వుంటేగా అర్థంకావటానికి ? "

"ఏమిటో నీతోమాట్లాడ్డం కష్టం కమలా ! ప్రతి చిన్నవిషయాన్ని సాగదీసి సాగదీసి ఏవో అర్థాలుతీస్తావు."

"ఉన్నమాటఅంటే వులుకెందుకు లక్ష్మీ ! యేదో కొంచెం వాసనతగిలినట్లుగావుంటే అలా అన్నాన్లే ! మరొక మాట, చూడు ! ఆస్పత్రికి వెళ్లేదానికి, జలుబుభారంతో గుండెలు కొరుక్కుపోయేదానికి, ఇంతముస్తాబూ హంగామా యెందుకే ? అబ్బ ! నీశృంగారం నేనే కౌగలించుకోనేలా వుందే ! వయోమహత్యం, జబ్బుతో వున్నా చాయలుపోవు, కండ్లలో కర్పూరదీపాలు వెలుగుతోంటాయి. ప్రతిరోజూ పుట్టినరోజూపండుగే. నిజంకాదులక్ష్మీ ! " కమల నవ్వుతూ అంది.

కమల మాటల్లో మహాలక్ష్మి కొంచెం సిగ్గుపడినట్లే వుంది. ఆవిడకండ్లలో ఒకవిధమైన వెలుగుస్ఫురిస్తుంటే, చీర అంచులుసర్దుకుంటూ, నీవేంతక్కువ అందగత్తెవుపాపం ! మేముకష్టపడి గంటన్నర ముస్తాబుచేసుకున్నా నీసహజమైన సౌందర్యానికి దీటుకాదు. పెద్దవృద్ధురాలివైనట్లు మాటలు మళ్లీ! నిజంగా పూలవానలావుంటుంది. మేంయెవరినీ ఆకర్షించలేముతే" అని ఒకచల్లని నిశ్వాసం వదిలింది లక్ష్మి.

"పంతంగా మాట్లాడ్డంతప్పితే ఇది నన్ను వర్ణించడంకాదూ ? అంది కమల విరగిబడి నవ్వుతూ.

"ఐతే నీవు నాఅందాన్నెందుకు వర్ణిస్తున్నావో, నాకే తెలీదంటావేం ? -- " అందిలక్ష్మి.

తెలియాలనే గదా ! డాక్టర్ రావు కళ్ళలో చూపులు తీక్షణంగాకలిపి జలుబు పీక్కుతింటున్నది, దీనిమాటేమిటని నిక్కచ్చిగా అడగదల్చుకున్నావునువ్వు కాదా ? నీ జలుబుకు కారణం గుండెలోని తుఫాను, అంటూ నాకు బాగా తెలుసు లక్ష్మి ! స్త్రీ సహజతత్వం స్త్రీకి తెలిసినంతగా మరెవరికీ తెలియదు. ఈ అమాయకపు చిరుతెరల చాటున యెంత సుడిగాలి చెలరేగుతుంటుందో తోటి స్త్రీకన్నా డాక్టరికి తెలుసా ? అదంతా పోనీగాని, యివాళ నీ చిరునవ్వుల అర్థరాలుచూస్తున్నకొద్దీ, నిన్నింకా తనివితీరా చూడాలనిపిస్తుందే లక్ష్మి ! అంటూ కమల హఠాత్తుగా తన రెండు బాహువుల్లో మహాలక్ష్మిని బలంగాకౌగలించుకొంది. ఇద్దరూ ఒకేసారి పగలబడి నవ్వుకున్నారు. ఎందుకు నవ్వుకున్నారో వారికే అర్థంకాదు.

"పాపం ! డాక్టర్ రావు యివాళ ముగ్ధుడై నిరసించి వర్తుల భ్రమణం సాగించేస్తాడు; నీ ముంగురుల అలంకారపు ఒద్దికచూచి" అంటూ లక్ష్మి ముంగురులు ముద్దెట్టుకుంది.

కమల మాటలు లక్ష్మికి వివశత్వాన్ని కల్పించేంత సంతోషకరంగా వున్నాయి. కమల వర్ణనలోని యథార్థాన్ని నిజంగానే నేడు డాక్టర్ రావు ముందు పరీక్షించుకోవాలను కుంటున్నది. ఏవో తీయని తలపులు కరిగి, కరిగి పాయలు పాయలుగా గుండెల్లోనుండి శరీరమంతటికీ, రక్తనాళాల్లో నుంచి పరివ్యాపిస్తున్నట్టుంది. ఆవేశంతో కమల చేతులు పట్టు కుని, "ఆలస్యం చేయకు కమలా ! త్వరగా బయలుదేరు" అంది లక్ష్మి.

"నిన్ను బాధపెట్టడం నాకిష్టం లేదు. తప్పక పోదాం." అంది కమల.

"ఇలాగే వచ్చేస్తావా ? ఈ వేషంతోనే ? ఈ చీరలో యేమన్నా ప్రత్యేకత వుందా ?"

"నాకేం రొంప పట్టించుకోవాలని లేదు తల్లీ ! నిక్షేపంలావున్నాను. ఇలానే వస్తాను." అంటూ సూటిగా చూచి మళ్ళీ ఒకసారి పెద్దగా నవ్వింది కమల.

"సరె ! సరేలే ! నీవు వెంటవుంటేనే చాల్లే ! ఈ ఉపకారానికి చాలా కృతజ్ఞురాలిని."

"నా ఉపకారం సంగతి అలావుంచులే. ఇప్పుడు డాక్టర్ ఉపకార హృదయాన్ని పరీక్షించాల్సుంది."

మహాలక్ష్మి నవ్వుతూ వివశురాలై కమల బుగ్గమీద చిన్నగా గిల్లి "నిజంగా నీమీద ఒట్టు. నీ ఈ సహజ సౌందర్యములోనే పెను ప్రళయం ఉప్పొంగుతుంటుంది." అంది లక్ష్మి. ఈ మాటతో కమల ముఖం వివర్ణమైపోయింది.

"నాలో విలయశక్తి వుండాలని నేను కోరుకోవడం లేదు. నేనొకరిలో విలయం సృష్టించాలనికూడా లేదు. కోరి కోరి నాలోగల విలయాన్ని దర్శించేవారిని నేను చేసేదేమీ లేదు. అదో విస్మృతి పథం తప్ప."

"ఇందులో విశేషం యేముంది కమలా! సౌందర్యమే ఒక ప్రళయం. ప్రతివారూ శ్రద్ధాళువులై పరిశీలించే సల్లక్షణాలు నీలో చాలావున్నాయి. నీ యీ సహజత్వం అంటే పడిచచ్చేవాళ్ళు లక్షమందివుంటారు. నాకు తెలుసు. నా కండ్లకే నీ వింత అందంగా కనపడుతున్నప్పుడు యిక మరో కళ్ళ మాటేమిటి!" అంది లక్ష్మి కిలకిల నవ్వుతూ.

కమల లక్ష్మిబుగ్గలు రెండూనులిమింది. అవిక్షణంలో గులాబీల్లా ఎఱ్ఱబడిపోయాయి. వాటిని అమాంతం ముద్దెట్టుకుని "మంచిచాతుర్యంగా మాట్లాడుతున్నావే!" అంది. ఇద్దరూ నవ్వుతూ లేచి నిలబడ్డారు.

"లక్ష్మి! ఇవాళ డాక్టర్ రావుతో ద్వంద్వయుద్ధం ప్రకటించడానికి సిద్ధంగా వున్నట్టుంది నీవు. కాని జాగ్రత్త! ఈ జలుబు హృద్రోగం క్రిందికి మారి దెబ్బతీయకుండా చూచుకో."

ఉబుసుపోకకోసం మాట్లాడుతూమాట్లాడుతూ ఇద్దరూ తిన్నగా డాక్టర్ రావు ఆసుపత్రివైపు నడక సాగించారు.

కమల తీవ్రంగా ఆలోచిస్తోంది. సౌందర్యం మనిషికి ఒక్కో-సారి పిచ్చెక్కిస్తుందనీ, యౌవనందీన్ని ద్విగుణీకృతం చేస్తుం దనీ, ఆవిడ భావం. ప్రస్తుతం మహాలక్ష్మిమీద అందం, యౌవనం రెండూ స్వారీచేస్తున్నాయనీ, దీనిఫలితంయెలావుం టుందోననీ, ఆవిడఆలోచిస్తూ లక్ష్మినితదేకంగా ఒక కంటపరిశీ లిస్తోనదుస్తూంది. లక్ష్మి కండ్లు మిలమిల మెరిసిపోతున్నాయి. లక్ష్మిని చూస్తే నిజంగానే ప్రేమజబ్బు పట్టుకుని, యింకా చూడాలనిపిస్తుంది. చిరునవ్వులో ఇంద్రజాలం లేకుంటే, లక్ష్మి నవ్వులో అంతమాధుర్యం, ఆకర్షణ వుండదేమో! ఇది హృదయ గతమైన యింద్రజాలం. లక్ష్మిని మరోసారి ముద్దెట్టుకోవాలనిపించింది కమలకు. చివరకు ఉండబట్ట లేక అడిగింది "నీలో ఈ హఠాత్పరిణామం ఎందుకు కలి గింది లక్ష్మి! ఎన్నడూలేని ఇంద్రజాలికశక్తి నేడు నీలో ఆవేశించినట్టుంది, యిది పదిమంది నడిచే మార్గంకాబట్టి సరి పోయిందికాని లేకుంటేనా? నిన్ను బలంగా కౌగలించుకొని తీరేదానిప్పుడు" అంది.

"వాంఛ అంత బలీయంగావుంటే కానీ! నాకేం అభ్యంతరంలేదుకాని ముస్తాబు చెరిపావో నాకు చెడ్డకోపం వస్తుంది." అంది లక్ష్మి నవ్వుతూ.

"ఛీ! ఛో! సిగ్గులేని ముఖం!"

"సిగ్గుపడాల్సిందేముంది? ఏకాంతంగా వున్నప్పుడు జరిగేపని నాల్గురోడ్ల కూడలిలో జరిగితేమాత్రం అసహజ మేముంది? నలుగురూ చూస్తారనేనా! ఆ చూచేవాళ్ళు యెక్కడో ఓచోట యిలాచేస్తున్నవాళ్ళే?"

"షటప్, లజ్జలేకుండా మాట్లాడావంటే కాలవలోకి తోసేస్తానేయ్ లక్ష్మీ!" ఇద్దరూ ఒక్కసారి మళ్ళీ గల గల నవ్వుకున్నారు. రోడ్డుమీద నడిచిపోయే అనంతజనంలో ఒక రిద్దరు వీరినవ్వులు ప్రత్యేక శ్రద్ధతో విన్నారేమో!

ఆస్పత్రి సమీపించగానే కమల పైటచెంగుని చుట్టూ త్రిప్పి గట్టిగా నడుముకి బిగించింది. మెత్తని పట్టుచీర బిగిం పులో ఆవిడ స్వచ్ఛమైన పాలరాతి విగ్రహంలా మెరుస్తోంది యేదో నూత్న విలాసం వికాసం ఆ విగ్రహంలోంచి ఉధృతంగా ప్రవహించుతున్నట్లుంది.

కమల, లక్ష్మి ఇద్దరూ ఆస్పత్రి గేటువద్ద ఆగిపోయారు. గేటుకీపరు అంగీకారం తీసుకొని డాక్టర్ రావ్ రూంను సమీపించారు, రూంవద్ద ఆస్పత్రిజవాను అభ్యంతరపరచి క్యూ "ననుసరించ వలసినదిగా కోరాడు. కమలారాణి, మహాలక్ష్మి ఇద్దరూ క్యూలో నిలుచున్నారు. ఇంతకు ముందే పురుషుల క్యూ అయిపోయింది. ఇప్పుడు వరుసగా స్త్రీలు ఒక్కరొక్కరే డాక్టరు గదిలోకి వెడుతూన్నారు.

కమలారాణి ముందు, ఆమె వెనుక మహాలక్ష్మి వరసలో వున్నారు. కమల, మహాలక్ష్మిని ముందుకురమ్మని కోరింది. కాని మహాలక్ష్మి అందు కంగీకరించక "ఇల్లానే బావుంది... నీవు చూపించుకున్నాక, నావంతెలాగూవస్తుం దిగా?" అన్నది.

"నేను చూపించుకోవడానికి ఏమీ జబ్బులేనిదే!... నేను నీకోసమే తోడుగావచ్చాను, అందుకోసం నీవేముందు కురా?..." అంది కమల.

లేదు కమలారాణీ! ఇది బాగానేవుంది... ముందు నీవు పద....ఇక ఈ విషయాలలో బలవంతంచేయకు." అంది మహాలక్ష్మి.

"మహాలక్ష్మి! ఇదేం బావుండదు. చెప్పినమాట వినాలి మరి!"

"నేను నీకోసం ఎంతసేపైనా ఓపిగ్గా వుంటాను. ముందు నీవు పద"

కమల ముఖంలో ఈసారి కొంచెం ఏదో మార్పు వచ్చినట్లుంది. ఆమె తనలోతానే "పాపం! డాక్టరు నన్ను ఏం పరీక్షించగలడు" అనుకుంది. నేనే అతనికి మందులా కాకపోతేసరి. అందుమూలంగా ఏరోగం లేనినాకు క్రొత్తగా శిరోబాధ కలగకుండా వుంటే అదేచాలు"

ఆమె తిన్నగా డాక్టరు గదిలోకి ప్రవేశించింది. డాక్టర్ రావును చూడగానే ఆమెలో వింతచలనం ఆరంభమైంది. మహాలక్ష్మి ఇంకా బయట 'హాల్' లోనే వుంది. కమలారాణి నవ్వు మొహం చూసి, డాక్టరు ఆ దోలా చూడడం ప్రారంభించాడు. కొద్దిసేపలా చూసి, గంభీర ముద్ర తాల్చి, నెమ్మదిగా "మీరు వచ్చినపని?" అని ప్రశ్నించాడు.

కమల క్రీగంటచూస్తూ "కొద్దిరోజులుగా నాఛాతీ ఎందుకో నొప్పెడుతున్నది. కొంచెంసేపయాక ఆ నొప్పి గుండెల్లో కెక్కుతుంది. ఆ తరువాత మెల్లగా తలకు చేరుకొంటుంది. అబ్బ! డాక్టర్! ఈబాధతో నేను వేసారి

పోతున్నాను. ఏం చెయ్యాలో, ఎలా పోతుందో తెలియడం లేదండీ!" అన్నది.

డాక్టర్ రావు ఈ విచిత్రమైన కేసును చూసి తనలో తానే నవ్వుకున్నాడు. కమలకేసి చూస్తూ "పదండి ! ప్రక్క గదిలో మిమ్మల్ని పరీక్ష చేస్తాను," ... "అంటూ కుర్చీ నుంచిలేచాడు.

కమల పరీక్ష గదిలోకి వెళ్ళింది. ... గదిలోవున్న టేబిల్ మీద పరుండమని ఆదేశించాడు డాక్టరురావు. ... కమల టేబిల్ మీద వాలింది అదురుతూనే. స్టెత్ స్కోపుతో డాక్టరు ఆవిడను పరీక్షించసాగాడు. ఏదో అర్థం అయినట్లు తలూపి. "ఇకలేవండి" అన్నాడు.

కమల ఉలికిపాటుతో లేచింది.

"మీరు చాలా ఆరోగ్యంగానేవున్నారు ... బాధే మిటో నాకేంఅర్థంకావడంలేదు. " అంటూ డాక్టర్ కమల చేతిని పట్టుకున్నాడు. కమల ఎందుకో రెండడుగులు వెనకు వేసింది

"అదేమిటండీ ! చెయ్యిలాతెండి ! ... వెనక్కుపో తారేం ! ... ఏమన్నా ఆలోచిస్తున్నారా ? " అన్నాడు. కమలసిగ్గుపడుతూ డాక్టరుకు చేతిని అందించింది. డాక్టరు ఆమెచేతిని చూసి, బాగానే వుందంతా. ... కాని మీబా ధకు కారణమేమిటో బోధపడడంలేదు. ... ఏమైవుంటుం దంటారు ? " — అన్నాడు డాక్టరు రావు. ...

అదితెలియకనే కదండీ ! మీవద్దకువచ్చింది. ... "

"నిజంగానా ! . ; "

"ఊఁ నిజమే ! ... మీరుడాక్టర్లు ... రోగానికి తగినమందు ఇస్తారని నాకు తెలుసు ... నేను మిమ్మల్ని బాగా ఎరుగుదును. ... "

కమల పెదాలు వాటంతటవే కదులుతున్నాయి.

థ్యాంక్స్ ... ఓసారి తీరికచేసుకొని మీరు మా యింటికి తప్పకుండారండి నేను వివరంగా మిమ్మల్ని పరీక్ష చేసి, తగినవైద్యం జరిపిస్తాను. ... " అన్నాడు రావు,

ఆవిడ పెదాలుపై చిరునవ్వు పేర్కొని ఎఱు పె: క్కాయి.

"చాలాబాగా నవ్వుతారండీ – మీరు ! ... ఇంతకూ మీపేరేమిటో చెప్పారుకాదు ! — ? "

"చీటీమీద ముందుగానే వ్రాసుకున్నారు నాపేరు ;

"ఓ ... ఐయామ్‌సారీ ! మరచిపోయాను — " —.

"ఫరవాలేదు లెండి ! ... నన్ను కమల అంటా రండీ ! "

"అవునవును ... నిజంగా మీరు కమల పుష్పానికి మల్లేనే నవ్వుతారండీ ! "

"డాక్టరుగారు వైద్యంతోపాటు కవిత్వం కూడా చెప్పేస్తున్నారు. ... చాలా వింతమనుషులల్లేవున్నారు. మీరు ... "

"అవునవును ... అయినా నేనూ మీలాంటి మనిషినే సుమండీ ! "డాక్టరు తన పాంటు జేబుల్లోకి చేతులు జొనిపి, మాటల్లోకిదిగాడు.

"మంచిది... రేపు తప్పకరండి !" అన్నాడు అదోలా చూస్తూ.

కమల చిరునవ్వులు చిందిస్తూ బయటికి నడచింది. గుమ్మం వద్దనే మహాలక్ష్మి తారసపడ్డంచూసి "ఇక వెళ్ళండి రాణీగారూ ! పరీక్షమటుకు జాగ్రత్తగా చేయించుకు రండి !" అంది.

డాక్టరు కొంచెం సంబాళించుకునేటంతలో తలుపు తెరుచుకొని మెరుపులా మరో స్త్రీ గదిలోకి అడుగు పెట్టటం చూశాడు. మహాలక్ష్మి ముఖం గులాబిలా విప్పారివుంది పెదాలపై చిరునవ్వు తాండవిస్తోంది.

"కూర్చోండలా ! "అంటూ డాక్టర్ రావు ఎదుట వున్న ఒక కుర్చీని చూపించాడు.

"డాక్టరు గారూ ! నా కుడికన్ను అదే పనిగా ఊరికే అదురుతూవుంటుంది. కొంచెం బాధగాకూడా వుంటుంది." అంది కుర్చీలో కూర్చుంటూ.

"మీకండ్లు బావున్నాయే... నొప్పెలా వస్తుంది ! అన్నట్లు మీ రెవరి నిరీక్షణలోనైనా వుండడం లేదుకదా!" అన్నాడు రావు పరిహాస పూర్వకంగా

మహాలక్ష్మి చిరుకోపం నటిస్తూ "నిరీక్షించవలసిన అవసరం నాకేం లేదు" - అంది.

"అయితే మీకంటి బాధకు మరేదైనా ఒక కారణం వుండి వుండాలి"

"అందుకేగా మీకు చూపించడానికి వచ్చాను.

"మీ కండ్లు నిజంగా ఒక ప్రదర్శన శాలలో వుంచ దగినవి" అన్నాడు డాక్టరు నవ్వుతూ.

"అలాగే కానివ్వండి డాక్టర్ ! కాని ఒక్క షరతు. ఆ కండ్ల క్రింద మీ చమత్కారమైన వ్యాఖ్యకూడా వుండాలి మరి. "అంది మహా లక్ష్మి ప్రతిగా నవ్వుతూ.

"మీరు నిజంగా చాలా మంచివారండీ !"

"అది మీ అభిమానం మాత్రమే లెండి !"

"మహాలక్ష్మిగారూ! మీరు ఏమీ విచారించకండి! త్వరలో మీకండ్లు తప్పకనయమవుతాయి." అన్నాడురావు.

డాక్టరు లేచి మహాలక్ష్మిని పరీక్షచేసే గదిలోకి తీసుకు పోయాడు. ఏదో మధురమైన పరిమిళం మహాలక్ష్మి శరీరం నుండి వస్తూంది.

"మీరు సాధారణంగా ఏ అత్తరు వాడుతూంటారు" ప్రశ్నించాడు డాక్టరు.

"హీనా !" క్లుప్తంగా సమాధానం.

"కండ్లకుకూడా అత్తరు పూస్తారా !" అడిగాడు కొంటెగా.

మహాలక్ష్మికి నవ్వువచ్చింది. ఫక్కున నవ్వేసింది. డాక్టరు మహాలక్ష్మి కన్నుల్లోకన్నులుపెట్టి పరీక్షగాచూశాడు. "మీకండ్లలో ఏలోపము లేదండీ! అయినప్పటికి కొంచెం మందువేస్తాను, ఈ రోజుల్లో రోగాన్ని పట్టికాదు డాక్టరు మందిచ్చేది ... రోగినిబట్టి సుమండీ! ఇదిగో! మందు.

పడుకునేవేళ రెండుచుక్కలు కంట్లో వేసుకొని మరీపడుకోండి రాత్రుళ్ళు అంతగా మేల్కొని వుండటం మంచిదికాదు."

"ఏమంటున్నారు డాక్టరుగారూ నేను ఎవరికోసం నిరీక్షించేదాన్నికాదు. కాని —"

"కాని ఏమిటి! మరెవరైనా మీకోసం నిరీక్షిస్తుంటారనా ?

"ఆవిషయం నాకెలా తెలుస్తుంది "

"ఒక్కోసారి ఇతరుల నిరీక్షణ ప్రభావం మనమీద పడుతూవుంటుందిలెండి ?"

"ఏమో! నేనుమాత్రం అలాంటి వార్నెరగను."

"మిమ్మల్ని చూస్తూనే మీనిరీక్షణలో తపించిపోయే వాళ్ళసంఖ్య మీకు తెలియకుండా అదే అభివృద్ధి చెందుతుందనిపిస్తుంది. వాళ్ళు అలా మీ నిరీక్షణలో అదేపనిగా నిట్టూర్పులు విడిచిన కారణంగానే మీకండ్లకు వుండి వుండి యీజబ్బు వచ్చిందికామోసు!" డాక్టర్ రావు గంభీరంగా అన్నాడు.

మహాలక్ష్మితప్పును దొరికించుకున్నట్లు వెంటనేడాక్టర్ కేసిచూసి "ఏమండీ! ఇప్పుడేకదా ? నా కండ్లకేజబ్బు లేదన్నారు. ఇప్పుడు మళ్ళీ యేదో జబ్బుఅని చెబుతున్నారు ఏమిది ? చిత్రంగా మాట్లాడుతున్నారు ... ఇంతకు నన్నేం చెయ్యమంటారు ?" అంది చమత్కారంగా,

"నేను వైద్యుణ్ణి. మీ బాధను తొలగించడానికి తప్పక నాచేతైన సహాయం చేస్తాను."

"ధన్యవాదాలు !"

"మహాలక్ష్మిగారూ! మీచేతిగాజులు బావున్నా యండి!

"మీకేమన్నా కావాలా? అంది కొంటెగా.

"థాంక్స్. నేను మగవాణ్ణి. నాకిచ్చేదికూడా మీరే కొనుక్కుని పెట్టుకోండి."

"భలేవారండీ మీరు! అయితే మీరుతప్పక జ్ఞాపక ముంచుకో దగినవారు. మిమ్మల్ని కలుసుకోవడం చాలా సంతోషకరం."

"ఇలాగే తరచు వస్తూవుండండి. వీలున్నప్పుడు నేనే స్వయంగా మీ బసకువచ్చి కలుసుకుంటూంటాను..."

మహాలక్ష్మి సంతోషంతో "డాక్టరుకు తనచిరునామా వ్రాసియిచ్చింది. కమల, మహాలక్ష్మి నిరీక్షణలో బేజారెత్తి పోయింది. ఇంత ఆలస్యం యెందుకైందో అర్థంకాలేదు.

ఇంతలో మహాలక్ష్మి వచ్చింది. కమల కోపంతో "ఇంత ఆలస్యం ఎందుకైంది?" అని అడిగింది.

"ఏమో! అయింది. డాక్టరు చాలా మంచివారల్లే వుంది కమలా! ప్రతిరోజూ ఆయనతో ఒక అరగంటసేపు కబుర్లాడిపోతే బావుండుననిపిస్తున్నది." అంది మహాలక్ష్మి.

"ఊహూఁ!...అయితే నిన్ను ఎవరు రావద్దంటున్నా రిప్పుడు...? నేను నీకోసమేవచ్చాను యింతదూరం. పద వెడదాం ఇంటికి."

"అదేమిటే!...చాలు? చాలు!! ఇక మాట్లాడకు. నాకోసమే వచ్చానంటావ్. నీవేమన్నా అప్సరసవా. ఏ జబ్బులూ రాకుండా వుండడానికి?"

"ఊహుం! కాదు. డాక్టరును చూసినప్పటినుంచీ నీ ధోరణే మారింది. నీవు చెప్పడంలేదు అసలుసంగతి."

"ఉండు కమలా! డాక్టరు చాలా మంచివాడు. ఆయనకోసం నా సర్వస్వం అర్పించాలని హృదయం కోరుతున్నది. నిజంగా ఆయన నన్ను ఎంతో ఆకర్షించాడు. ఆ అమాయికమైన ముఖంలో చెప్పరాని ఆకర్షణ వుందంటే నమ్ము, నేను గదిలో ప్రవేశించడంతోనే వెళ్ళినపని మరచిపోయి, ఆయన తీరును గురించిన ఆలోచనలోపడిపోయాను. నీవు నాకోసం బయట నిరీక్షిస్తూ వుండగలవన్న ఆలోచనే లేకపోయింది,

కొంచెంసేపయాక డాక్టరూ, నేనూ పరస్పరం భావంలో కలిశాము, ఆయన పెదవివిప్పి ఏమేమో మాట్లాడాడు. ఇప్పుడు నాకవి సరిగా జ్ఞాపకం లేవుకాని ఆయన మాట్లాడుతూంటే హృదయంలో పేరుకు పోయిన చీకట్లేవో పోయి నాలో వెలుగు ప్రవేశించినట్లు తోచింది." అంది మహాలక్ష్మి,

కమల, మహాలక్ష్మిమాటలకు నివ్వెరపోయింది.

"ఏమే నీహృదయం అంత నిర్బలమా ! పురుషుడు కనబడితేనే నిన్ను నీవు మరచిపోయి ఏవో పిచ్చికలలు కనేదాని వైనావు. "అంది కమల.

"ఏమోనే ! ఆయన మాటలు వింటుంటే చెప్పరాని ఉత్సాహం కెరళ్లెత్తుతుంది. ఏవేవో అనుభూతులు మదిలో విద్యుత్తులా ఆవరిస్తాయి" మహాలక్ష్మి అన్నది.

"నిజంగా నీవు పిచ్చిదానవే మహాలక్ష్మి ; ఇంత తేలిగ్గా స్త్రీ, పురుషులబారికి చిక్కితే, ఇక బాగానేవుంటుంది. మగవాళ్లు చాలాబుద్ధి చాతుర్యంకలవాళ్ళు ... నేను నీ నిర్మలహృదయాన్ని శంకించను! కాని నిజపరిస్థితుల్ని చెబుతాను. స్వార్థపరులైన పురుషులతోడి ప్రేమ, ... స్నేహం, చాలా ప్రమాదకరంగా వుటుంది. దానితో వాళ్లు ఇతరుల వినాశనానికి గోతులు త్రవ్వుతారు. వాళ్ళచల్లనిమాటల్లో నిప్పుకణాలు నిక్షిప్తమై వుంటాయి. వాళ్ళ ప్రేమకలాపం బొమ్మలాట లాంటిది. అదికొంచెంసేపయాక, అవసరంతీరాక అవతల పారేయటం మాత్రమే జరుగుతుంది. ఇలాంటి సందర్భాలలో మనం తొందరపడడం మనకు తీరని నష్టాన్ని కలిగిస్తుంది. — " కమల సానునయంగా అన్నది.

"నిజమే కమలా ! నీవన్నవన్నీ నిజమే. కాని యీ డాక్టరు అలా కాదనిపిస్తుంది. ఆయన మాటల్లో మటుకు నీవుచెప్పిన అంశాలేవీ నాకు గోచరించలేదు, జీవితం కేవలం ఉచ్ఛ్వాసనిస్వాసాల సంపుటిమాత్రమే. అందుకోసం మనం అంతగా విచారించపనిలేదు. "

నీవు నిజంగా ఇలాంటి విషయాల్లో అమాయకురాలివి. యవ్వనంలో వేసే ప్రతిఅడుగు చాలా జాగ్రత్తగా వేయాల్సి వుంటుంది. వెలుగు చీకటిలాగ, చీకటి వెలుగులాగ కని పిస్తూంటుంది. ఏ మాత్రం పొరపాటు చేసినా యవనంలోని మనఅందం, అభిజాత్యంఎందుకూ కొరగాకుండా పోతవి. ఈ ప్రాపంచిక సౌఖ్యాలు నరక సదృశంగా మారుతాయి. మహాలక్ష్మీ ! ఇది నేను అనుభవంమీాద చెబుతున్నాను. వయస్సు కొద్దిదైనా నాయీా స్వల్పజీవితంలో ఎన్నో సంఘటనలు నాకు అనేకరకాల గుణపాఠాలునేర్పాయి. అవన్నీ మరపురాని స్మృతి చిత్రాలు.

జీవితంలోని ప్రాథమిక దశనే సమగ్రమని భావించడం కూడదు. భవిష్యత్తును కూడా ఒకకంట కనిపెడుతూనే వుండాలి ఎల్లప్పుడూ. జీవితంలో ఏవిధంగానైనా క్లిష్టపరిస్థితి సంభవిస్తే మనని ఆదుకొనే ఉదారహృదయం ప్రపంచంలో దొరకడం దుర్లభం. ప్రథమ దర్శనంతో అపరిచితుడైన డాక్టర్‌ని ఇంతగా పొగడతూ, అతని గుణ గణాల గురించి ఖచ్చితమైన అభిప్రాయాల్ని స్థిరపరచు కోవడం కూడదు. ఆమాటకొస్తే అసలు ఇలాంటి స్థిరాభి ప్రాయాలు యేవ్యక్తిపైన అయినా వుంచుకోవడం అంత బుద్ధి తక్కువపని ఇంకోటిలేదు.'' అంది కమల.

“నిగూఢంగావున్న నీమాటలు ఉత్తమ సందేశాన్ని స్తున్నాయి కమలా రాణీ! తప్పకుండా వీటికి విలువనిచ్చి ఆచరణలో పెట్టడానికి ప్రయత్నిం చేస్తాను.'' మహాలక్ష్మి దృఢమైన నిశ్చయంతో బదులు పలికింది.

"ప్రశాంత చిత్తంతో ఆలోచిస్తే అర్థంకానిదంటూ వుండదు లక్ష్మీ! ఏ పురుషునితోనైనా ఒక్కసారే ప్రగాఢ పరిచయం కలిగించుకోవడం నష్టాన్ని చేకూరుస్తుంది. ప్రపంచంలో నివసించడానికికూడా అర్హతవుండాలి. మన వ్యక్తిత్వం ఆదర్శప్రాయంగా వుండడమే ఆ అర్హత. తనంతట తాను అనవసరమైన బంధనాల్లో ఇరుక్కునిపోవడం వెడగు బాటు. మంచిదమ్మా! నేను మళ్ళీ కలుస్తాను. సెలవు" అంటూ వెళ్లిపోయింది కమల.

◆ ◆ ◆ ◆ ◆

మహాలక్ష్మి బారిష్టర్ బదరీనాథ్‌గారిపుత్రిక. బారిష్టర్ పదవిలోనే బదరీనాథ్‌గారు చాలా కాలం పనిచేసి దురదృష్ట వశాత్తు పక్షవాతం రావడంమూలాన ప్రస్తుతం విశ్రాంతి తీసుకుంటున్నారు. ఈ కారణంగా వారి కుటుంబం ఎన్నో ఆర్థిక చిక్కులకు గురికావడంవల్ల మహాలక్ష్మి బి. ఎ. పాసై, పై చదువులకి వెళ్ళలేక ఇంట్లోనే వుండవలసివచ్చింది. బి. ఏ. చదువుకున్న అమ్మాయి కాబట్టి, స్నేహితురాలు కమల ప్రోద్బలంతో, తండ్రిగారి అనుమతితో కమల పనిచేసే కలెక్టరాఫీసులోనే ఉద్యోగం సంపాదించుకొన్నది.

కమల తరుచుగా మహాలక్ష్మి యింటికివస్తూ పోతూ వుండేది. బారిష్టరుగారుకూడా కమలని యెంతో ప్రేమగా చూచేవాడు. కమల జిల్లా కలెక్టరు కూతురనీ, ఉన్నత కుటుంబానికి చెందనదనీ ఆయనకు తెలుసు. అప్పుడప్పుడూ కమలని తనయింట్లో భోజనానికి ఆహ్వానిస్తూండేవాడుకూడా. బారిష్టరుగారి పెద్దకొడుకు ఒక తను 'లా' చదువుతున్నాడు ఇతనికి కమలంటే మంచి అభిమానం. కమల దృష్టిలో మహా

లక్ష్మి యింకా చిన్నపిల్ల అనే భావం వుంటున్నది. అందు కని మహాలక్ష్మి అనుకోకుండా, ఏ తప్పుదారీ పట్టకుండా జాగ్రత్తవహించే బాధ్యత తనదైనట్లు భావించేది.

డాక్టరుతో తాము యింతవరకు చేసిన సంభాషణ ఏమంత మంచిదనిపించలేదు. ఆవిడ ఆలోచించడం మొదలు పెట్టింది. నిజంగా డాక్టరు చాలాఅందగాడు. ఆయనముఖం చూస్తూంటే ఎంతో ఆకర్షణగా కనిపిస్తోంది. ఒకసారి చూసిం తరువాత ఆయన్ని మరచిపోవడం అంతసులభం కాదని పిస్తుంది. నిజంగా ఆయనతో మాట్లాడుతున్నంతసేపు, తననుతానే మరచిపోయింది. అతని మృదువైనమాటలు ఎంత ఉదాత్తంగా వున్నాయి. అతని సంబోధన ఎంతనిరా డంబరంగా వున్నది? అతని గుండ్రని కన్నుల్లో ఎంతజీవ కాంతి తాండవిస్తోంది! అతని వంకీలుతిరిగిన జుట్టు ఆ ముఖానికి ఎంత అందంగా రూపొందింది. నిజంగా యదార్థ మైన ఆకర్షణ పుట్టుకొస్తుందతనిలో. అప్పటి తనస్థితిని తనే పూర్తిగా మరిచిపోయింది. ఆమె ఆలోచన మరోవైపు మళ్ళింది. అతని అమాయికమైన ముఖంలో ఏదైనామోసం లేదుకద? ఏమనిపినైనా చూడడంతోనే శంకించడం కూడా అంత న్యాయంకాదు. తన మృదువైన చేతిని తాకి నప్పుడు నేను అనిర్వచనీయమైన మాధుర్యం చవిచూచినట్ల యింది. వెనువెంటనే శరీరం కంపించి పోయిందికూడా!

సినిమారీలులోని బొమ్మల్లా ఆమెమేధస్సులో ఆలో చనలు ముమ్మరంగా తిరుగసాగినయ్. డాక్టరు రావు విష యమై అదేపనిగా ఆమె ఆలోచించడం మొదలుపెట్టింది. ఇలా ఆలోచిస్తూనే కమల తన యింటికి చేరుకుంది.

ప్రొద్దునే్న, స్నేహితుడు రమేశ్ వచ్చి రాజన్‌ను నిద్రలేపాడు. రాజన్‌కు సరిగా తెలివిరాక అటు ఇటూ బద్ధ్దిగిల్లడం ప్రారంభించాడు. రమేశ్ మళ్ళీగట్టిగా తట్టి లేపాడు. అతికష్టంమీాద రాజన్ లేచి కూర్చున్నాడు. రాత్రి విడిచిపెట్టిన ఆలోచనలు మళ్ళీ మెదలడం ప్రారంభించాయి. కమల! కమలమాటలు—కమల హొయలు—అన్నీ అతని కొక్కొక్కటే వరుసగా గుర్తుకు రాసాగినయ్.

"అరే బాబూ! లేచి మళ్ళీ దయ్యంలా అలాకునుకుతూన్నావు. రాత్రి నిద్రపోలేడా?" అన్నాడు.

"అవునురా! నిజంగా అంతే"

"నేను ఎన్నో సార్లు చెప్పాను. ఇలా రాత్రుళ్లు మేల్కొనేబదులు దేన్నైనా కట్టుకోమ్మని. లేకపోతే ఈ రాత్రుళ్ళు నిన్ను నిద్రపోనీవు."

"ఎప్పుడొచ్చినా నీవు నా ఒంటరితనం గురించి ఏడుస్తూంటావు. పెళ్ళికాని నీమఅదళ్ళు, మేనకోడళ్ళు ఎవరైనా వున్నారా?"

నీవు కావాలంటే నేను ఎవరితోనైనా నీవివాహం జరిపిస్తాను,"

"అవును బాబూ? ఊరకరారు మహాత్ములన్నట్లు ఏపనీలేకుండా నీవు వచ్చేవాడవేకాదు!"

"లేదు? లేదు!! ఇవాళ నిన్నోమాట అడిగితెలుసుకుందామనుకుంటూన్నాను. నీకుపెళ్ళంటే ఎందుకంతభయం?

"అరే! చాలించవోయ్ నీ అధికప్రసంగం. నేను పెళ్ళివిషయం మాట్లాడే స్థితిలో లేను.

"మరియేస్థితిలో వున్నావురా! పెళ్ళికూడా ఒక ఆహ్లాదకరమైనస్థితే!"

"అవును ఆహ్లాదకరమైనదే"

అయితే నీవెవరినైనా ప్రేమించావా ఏమిరా!"

"ఆఁ ప్రేమిస్తున్నాను. పూలనూ, చంద్రుణ్ని, మన వూరిప్రక్కనవుండే గోదావరి వెల్లువనీ, అందంగా తోక ఆడిస్తూ ఎప్పుడూ ఇంటిముందు కావలిగాచే ఈ కుక్కనూ, ఇంతగా నన్ను చీకాకుపెట్టే నిన్నుకూడా నేను ప్రేమిస్తూ వుంటాను, ఇప్పుడు చెప్పరా నేనువీటన్నిటినీ పెండ్లిచేసుకోనా పిచ్చివాడా! ప్రేమ - వివాహం రెండూ వేరు వేరు విషయాలు. ఆమాటకొస్తే పెండ్లికిపూర్వం నీలోవున్న ఉత్సాహం శక్తి, ఆకారదీప్తి ఈనాడు కనిపించడంలేదు. నిరంతరం సంసారపు గొడవలో అవస్థ పడుతున్నావురా నాన్నా! పెండ్లాంగోలపడలేక మరదలకో మొగుణ్నింటగట్టాలని యీ అగచాట్లు పడుతున్నావు. గోరుచుట్టుపై రోకటిపోటన్నట్లు ఇంకా మీఅక్కయ్యకూడా ఇంట్లో తిష్టవేసి తనకూతురుకో మంచిసంబంధం వెతికిపెట్టమంటోంది. వాటితో నీకయ్యే సతమతం ఏమిటో నేను తెలుసుకుంటూనే వున్నాన్రా. వీళ్ళపోరుపడలేక, మాయిల్లొకటి దొరికిందని, నీ సమస్యలతో నన్ను ప్రాణంతీయడానికి వచ్చావు. అరే బాబూ! నీఅవస్థ నీవుపడు అయినప్పటికి స్నేహితుడవు కాబట్టి చెబుతున్నాను. ముందు నీపరిస్థితిని చక్కబఱచుకో! ఆ తరువాత నన్ను గురించీ, పెండ్లిండ్లగురించీ ఆలోచింతువుగాని. అవసరానికి అప్పుతీసుకుంటావు - తిరిగి యివ్వలేవు. ఎన్నాళలా కాల

క్షేపం చేస్తావు? నాకే 50 రూపాయిలవరకు యివ్వాలి. ఇలాఎంతమందికి మొగనామంపెట్టావు? అయ్యాబాబై రూపాయిలు యివ్వద్దుగాని, బాబూ! దయవుంచి ఇకనాతో పెళ్లిమాట యెత్తకు. దానివిషయమై నేనుఅనవసరంగా నీమాటలకు మోహ మాటపడి, బురదలో దిగదలుచుకోలేదు. ఆపై బ్రతుకు తెరువుకోసం ఇంటింటికీవెళ్ళి బిచ్చమెత్తుకోలేను. నాలుగు గంటలకేలేచి, పిల్లల్ని సముదాయించడం నావల్లకాదు. నా సుందర స్వప్నాలను విషాదంలో ముంచెత్తలేను. నేను నవ్వుతూ యితరులను సంతోషపెట్టాలనే నిరంతరం అను కుంటూవుంటాను. ప్రపంచంలో పెండ్లికంటే విలువైన పను లను నేను నిర్వహించాల్సివుంది. నీ మఱదలు–కోడలు కోసం మరెవరైనా వెతుక్కో–బాబూ!" అన్నాడు రాజన్.

రమేశ్ ఏమీ మాట్లాడలేదు. రాజన్ మళ్లీ ప్రారం భించాడు. 'రమేశ్! నీపరిస్థితిచూస్తొంటే చాలాబాధవేస్తుంది. శవంలా వస్తావు. నీ నిరాశా పూరితమైన మౌన దృష్టులు నన్ను ఆందోళన పరుస్తాయి. నీ మౌనం నీ అమాయికత, చాటుగా ఏదో గొంతెత్తి బిగ్గఱగా అరవాలనుకుంటున్నట్లు వుంటుంది. కానినాకు తెలుసురమేశ్! నీలోవిప్లవంరేకెత్తించే శక్తికూడా లేదని. నీవు చిన్నతనంలోనే వివాహం చేసు కొని, పెద్ద పొరపాటు చేశావు. పెండ్లికిముందు నీ వెంత బావుండేవాడివి? నీ కళ్ళు యెంత మెరిసిపోయేవి? ఆ అంద మంతా ఎవరో బలవంతంగా అపహరించినట్లు కనబడుతుంది. నీ చెక్కిళ్ళ కలిమిని ఎవరో హరించినట్లుంది. ఇలా వుండి కూడా ఇతరులకు ప్రమాదకరమైన సలహాలుయిస్తూవుంటావు

నీకు వలెనే నా చెక్కిళ్ళ సౌందర్యాన్ని మరెవరైనా నలిపి వేస్తే భావుంటుందనుకుంటున్నావా ?"

రమేశ్ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. రాజన్ వెంటనే లేచి, రమేశ్ చెక్కిళ్ళను నిమురుతూ "మిత్రమా ! నేనేమైనా పొరపాటు మాట్లాడితే నన్ను మన్నించు."

"నిజమే రాజన్ ! నేను చాలా పొరపాటు చేశాను. నేను చాలా అన్యాయం అయినాను. నా విషయమై నేను ప్రస్తుతం యే మీ ఆలోచించే స్థితిలో లేను." అన్నాడు రమేశ్.

"నాకు తెలుసు రమేశ్ ! నీ స్థితి. నీకు నాచేతనైన సహాయం చేస్తాను. ప్రస్తుతం నావద్ద 50 రూపాయలున్నయ్ తీసికెళ్ళు మీ అక్కతో చెప్పు, ఆవిడకూతురుకీ వరుణ్ణి ఆవిణ్నే వెతుక్కోమని, మీ ఆవిడతో గట్టిగా చెప్పు, వాళ్ళ నాన్ననే కూతురి పెళ్ళి ప్రయత్నాలు చేయమని. నీవు మాత్రం నీ విషయమే ఆలోచించుకో. లేకపోతే ఈ విచారంలో నీవు చచ్చిపోతావు. నీ పిల్లలకు నీవు బిచ్చమెత్తుకునే పరిస్థితిని తెచ్చిపెట్టకు. నీ విషయాన్ని చక్కబెట్టుకోవడమే సమస్య అయినప్పుడు ఇతరుల బాధ్యతల్ని తలపైన ఎందుకు వేసుకుంటావు ?

ఇలానే నిన్ను నీవు అన్యాయం చేసుకొని వాళ్ళ పనులు చేస్తూ కూర్చుంటే, ఒకప్పటికి వాళ్లే ఆకాశంలోని నక్షత్రాల్ని త్రెంచుకు రమ్మంటారు. సముద్రంలో మునిగి ముత్యాల్ని పట్టుకొని రమ్మనే స్థితికి వస్తారు" అన్నాడు ఆవేశంగా రాజన్.

రమేశ్ తలవెంట్రుకలలో చేతులుదూర్చి "నీఅభిమా నం నాపట్ల ఇంతగావుండటం అదృష్టంరా రాజన్ ! నీకు నేను చాలా ఋణపడివున్నాను. నీవు నా బాల్యమిత్రుడివి. నావలె నీవు కావాలని నేనెన్నడూఅనుకోను. నీవు ఆనందంగా కాలక్షేపం చేయాలి. అదే నాకుకావల్సింది. నా ఉద్దేశ్యం నిన్ను అపమార్గాన్ని పట్టించాలనికాదు. నీ యిష్టంవచ్చినట్లు జీవితాన్ని సుఖమయంచేసుకో. జీవితాన్ని నేను ఆనందప్రద మైనదిగా భావించేవాణ్ణి మొదట్లో, డబ్బే అన్నింటికీ మూలం అని నాకు అప్పట్లో గోచరించలేదు. ఇప్పుడునేను సంసారం అనే తిరుగలిలో నుగ్గుగావించబడుతూన్నాను. దీన్నుంచి తప్పుకోవడం అంతసాధ్యంగా తోచడంలేదు." అన్నాడు.

రాజన్ అనునయిస్తూ "ఫరవాలేదు రమేశ్ ! ధైర్యం గావుండు. వెళ్లు ! నీపని చూసుకో . ! " అన్నాడు.



సాయంకాలం భోజనం ముగించుకొని కమల పత్రిక చదువు కొంటూంది. గదితలుపులు ఎవరోబయటనుంచి చప్పు డుచేస్తున్న అలికిడి అయింది. పనిమనిషి తలుపు తెరచింది.

"హల్లో కమలారాణి ! అంటూ రాజన్ గదిలోపలికి వచ్చాడు.

కమల చిరునవ్వు నవ్వుతూ లేచి రాజన్‌కు స్వాగతం చెప్పింది. రాజన్ చిరునవ్వునవ్వుతూ "శ్రమపడకండి ! నేనే కూర్చుంటాను" అన్నాడు.

"అలా కాదు రాజన్ ! నేనెవరికి స్వాగతం చెప్పినా సాధారణంగా కూర్చునే చెబుతూంటాను. నేను లేచిస్వాగ తం చెప్పిందల్లా ఒక్క నీకే ! ... " అంది కమల.

"ఇంతదయ నాపట్ల యెందుకో ! "

"ఎందుకంటే, నీవు చాలా నిర్దయుడివి. అందుకని. నిన్నెప్పుడూ బలమైన త్రాళ్ళతో బిగించి. నాయెదుట వుంచుకోవాలనిపిస్తుంది. " కమల రీవిగాఅంది.

"నిర్దయుడిపట్ల నిర్దయగానే వ్యవహరించాలి. తప్పదు. నీవునీయిష్టం వచ్చినట్లు నన్ను శిక్షించవచ్చు. ... "

కమల ఫక్కున నవ్వూతూ కుర్చీలో కూర్చుండిపోయింది.

నిన్నుచూడగానే నేను అనుకోకుండా ఇతర విషయాలన్నీ మరచిపోతాను. అందమైన ఏకొండలోయల చెంతకైనావెళ్ళి అక్కడనీతో ప్రశాంతంగా కొంతకాలంవిశ్రాంతి తీసుకోవా లనిపిస్తుంది, నిత్యం నన్ను వేధించే ఈ ప్రాపంచక విషవలయంనుంచి దూరం అవ్వాలనిపిస్తుంది రాజన్!-రాజన్! అదేమిటోగాని ఒక్కొక్కప్పుడు ఈ జీవితమే చాలించాలని పిస్తుంది. జీవితంలో గతంలో అనుభవించిన సుఖాల తెరలూ, గడచివచ్చిన కష్టాల వంతెనలూ అన్నీ ఒక్క సారి సుళ్ళుతిరిగి, ఇప్పుడు నాలో అమితమైన నైరాశ్యం పేరుకొని వుంది. ఏ కొండరాయికైనా తలను కొట్టుకొని చనిపోవాలినిపిస్తుంది. - కాని రాజన్ ! ఇంతనైరాశ్యంవున్నా ఎందుకో నీవు కనిపించేసరికి అదంతా మాయమైపోయి, సంతోష వెల్లువ నాలో ముప్పిరి గొంటున్నది. ఈ బలీయమైన ఆకర్షణ నీలోనేవ్వుందని భావించక తప్పడంలేదు. అలాంటి ఉత్తమస్థితిని కల్పించిన నీకు నా సర్వస్వాన్ని అర్పించాలనివుంది." అన్నది కమలారాణి.

రాజన్ ఆశ్చర్యంతో "ఏమంటున్నావు కమలా! ఇవాళీలా మాట్లాడుతున్నావు. ఇందుకు నా అర్హత యే పాటిదో ఆలోచించావా అన్నాడు.

"నీవు అన్నివిధాల అర్హుడవే. నీలో లేనిదేమిటి? అంది కమల.

"నీవు నన్ను పూరికే పొగిడేస్తున్నావు. అలా పొగి. డితే నేను తట్టుకోలేను."

"అదేమీ కుదరదు. మీరునిస్సందేహంగా గొప్ప వారే. మీరు నాపొగడ్తలన్నీ తట్టుకోగలరులెండి!" అంది కమల.

"థాంక్స్!-"

"నిజంగా మీ వ్యక్తిత్వంలో అంతులేని ఇంద్రజాలం వుందిరాజన్!"

"అదుగో! మళ్లీపొగిడేస్తున్నావు"

"పొగడ్తకాదు, యధార్థమే!"

"ఇవాళ పూర్ణిమ కదూ!

"పున్నమునాటి రాత్రులంటే నాగు చాలాయిష్టం హాయిగా వుంటుంది. అన్నీ మరచిపోయి, ఆనందలో కాల్లో వుండగలం. మనస్సుమనకు తెలీకుండానే మధురానుభూతిలో నృత్యం చేస్తుంది," అందిఅదోరకంగా ముఖంపెట్టి.

"ఇవాళ నీవు విచిత్రమైన ఆలోచనల్లో పడిపోయావు కమలా రాణీ!"

"లేదు రాజన్ ! ఆలోచనలు కావు, నాలో ఒక మధురానుభూతి కలుగుతోంది. అనతి కాలంలో నాలో ఏదో ఒక విప్లవాత్మకమైన పరిణామం జరగబోతున్నట్లు పొడకట్టుతున్నది. ఈ స్థితినాకే ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నది. ఈ నాటి నామనస్థితి ఒక క్రొత్తమార్గావలోకనంలో అనిశ్చితమై వున్నది. నీవు దానికి మౌన సందేశ వార్తాహారుడవై వున్నావు. నీ విషయమై ఇప్పుడు అదేపనిగా ఆలోచిస్తూ వున్నాను. నీరాకకోసం అదేపనిగా నిరీక్షిస్తున్నాను కూడా !" కమల తన్మయత్వంలో అనసాగింది.

రాజన్ కన్నుల్లో సంతోష రేఖలు పొడసూపినయ్. అతనిలో యేదో తెలియని ఉత్సాహ దీప్తి కమలకు స్ఫురించింది. అది చూచి కమల కొంచెం సిగ్గుపడ్డది. ఆనంద రసప్రవాహం ఆవిడ హృదయంలో పరుగులెత్తి నట్లైంది.

"రాజన్ ! ఇవాళ యెంతో సుదినం. నా మనస్సు అపరిమితమైన ఆనందాన్ని పొందుతున్నది. పోగొట్టుకున్న దేదో చేతికి దొరికినట్లైంది"

"ఏమి దొరికింది కమలా !"

"ఏమో !—"

"ఏదీ ! అదేదీ కనిపించడం లేదే !" చిలపిగా చుట్టు ప్రక్కలకు తిరిగి చూచాడు.

ఏయ్ మిష్టర్ ! అటు కాదు. ఇటు ఇక్కడ కొంచెం చెవి పెట్టిచూడు ! అంతా వినిపిస్తుంది." అంటూ గుండె వేపుకి వ్రేలెట్టుకొని చూపింది.

"నీ గుండెలోంచా వినిపించేది ! ఏం వినిపిస్తుంది. కొట్టుకునే చప్పుడుమాత్రం వినిపిస్తుంది" రాజన్ అన్నాడు.

"ముందు వినాలి ! ఆ పైన ఏం వి ని పి ం చి ం దో తెలుస్తుంది."

"నీ హృదయం చాలా వేగంగా కొట్టుకుంటోంది కమలా ?"

నీవు చాలా అల్లరిమనిషివి, నా జీవితంలో దట్టంగా అలముకొన్న నిరాశను తొలగించి ఆశా మధువుని నింపావు"

రాజన్ నవ్వుతూ "నిన్ను నేను అర్థం చేసుకోలేక పోయాను కమలా ! నీవు చాలా మంచిదానివి. నా ప్రశాంత జీవితంలో కలవరం సృష్టించావు. దీని పర్యవసానం మనం యిద్దరమూ ఆలోచించ లేదు. అన్నాడు.

"కలవరం ! అంత ఆందోళనకరం కాదులే, రాజన్ ! అది సంతోషప్రదంగా వుంటుంది. నేను నిరంతరం నీవెంటనే వుంటాను."

కమలమాటలు వింటుంటే రాజన్‌కు అమితమైన ఆశ్చర్యం కలిగింది. అతను దీర్ఘాలోచనలోపడిపోయాడు.

జీవితం విచిత్రసంఘటనల సంపుటి. నిముషంలో ఏం జరుగుతుందో తెలియదు.

"ఏమిటాలోచిస్తున్నావు రాజన్ !" అంది కమల.

"ఏమీ లేదు. —"

"అదేపనిగా ఆలోచించకు. అన్నీ సరిగానేవుంటాయి. నా ప్రవర్తన చూచి నీకుభయంకలిగిందేమో ! — ఏమీ ఆందోళన పడవలసిన అవసరంలేదు. ..."

"అలాంటిదేమీ లేదు."

"అయితే ఇలా బేజారైపోతున్నావేమిటి ?"

"నేనేం బేజారౌతున్నాను ?"

"ఏమైనా కొద్దిగా మందుపుచ్చుకోవాలనుందా ?"

"అది లేకుండానే, నేను నిషాలోవున్నాను."

"చాలా బాగుంది, రాజన్ ! ఇంతవరకు నాజీవితభవిష్యత్తు అంధకార బంధురం అనుకుంటూండే దానిని, కాని ఈనాడు మహోజ్వలంగా భాసిస్తున్నట్లుంది."

త్వరపడి నావిషయమై అంతిమ నిర్ణయానికి రావడం అంతమంచిది కాదు. ..."

"నా నిర్ణయాలు ఎప్పుడూ వ్యర్థమైపోవు. ..."

"నీనిర్ణయాల పట్ల ఇంతగర్వంకూడదు కమలారాణీ!"

"నా నిర్ణయాలపట్ల నాకు సంపూర్ణమైన విశ్వాసం వుంది. ... అంటూ కమల, రాజన్‌ని మరింత సమీపించింది. ...

రాజన్ ; తన బాహువులు చాచాడు కమల అందులో ఒదిగిపోయింది. రాజన్ అలానే చాలాసేపు తన బాహువుల్లో కమలని వుంచుకొని, ఆమె ముంగురుల్ని తన మునివ్రేళ్ళతో తాకడం మొదలెట్టాడు. కమల మైమరచి అలా వుండిపోయింది.

రాజన్ జరిగినదంతా ఒకసారి నెమరువేసుకొన్నాడు. అతనలా ఆలోచిస్తూండగానే అతనికి తెలియకండా కమల శరీరములోని రక్తం వేగంగా ప్రవహించడం ప్రారంభించింది గుండె అదేపనిగా ధ్వనిస్తున్నది.

"కమలా ! ఏమిటిలావున్నావేం ? "

"ఇదేభగవదిచ్ఛ. — "

"రాజన్ చిరునవ్వు నవ్వుతూ "నీయిచ్ఛకదూ ! "

"భగవదిచ్ఛముందు మనయిచ్ఛ యేపాటిదిరాజన్!"

"చాలా తెలివైనదానివే. ఇప్పుడు భగవంతుని వెన కేసుకొస్తున్నావు ... "

"ఆయనదయ లేకపోతే నీవు నాకెలా లభిస్తావు - "

"ఇక నేవెడతాను కమలా ! చాలా రాత్రయింది -" రాజన్ లేవ బోయాడు.

కమలారాణి రాజన్ చేయిపట్టుకొని కూర్చుండ బెడుతూ "ఊహూ! వెళ్ళడానికి వీల్లేదు ... నిన్ను వెళ్లనివ్వను "

"ప్లీజ్! వెళ్ళనివ్వు ! రేపు తప్పక వస్తానుగా !"

"వీల్లేదు ఇకనుంచి నేను నీకోసం అదే పనిగా నిరీక్షిస్తూ అవస్థపడలేను."

"అంతగా ఆందోళన పడకు రాణీ! అది ఆరోగ్య దాయకం కాదు."

"మీతో చాలా మాట్లాడాలి రాజన్! త్వరపడితే నేనేమీ చెప్పలేను."

"ఊఁ! ఊఁ! అయితే చెప్పు తప్పక వింటాను..."

* * *

బంధువుల యింటికి వెళ్ళిన మహాలక్ష్మి కొన్ని రోజులు గడిచాక తిరిగి వచ్చింది. డాక్టరురావు ఆమెకు పరిచయం అయినప్పటి నుంచీ, అతణ్ణి గురించి రకరకాల స్వప్నాలు కంటూ వచ్చింది. డాక్టరురావును ఎలాగైనా

కలవాలనే ఉబలాటం ఆవిడలో మిక్కుటమైంది. కమలను కలువగానే, ఆమెతో డాక్టరు వద్దకు వెళ్ళొద్దామని చెప్పింది మహాలక్ష్మి.

కమల, మహాలక్ష్మిని బ్రతిమాలుతూ "నీవే వెళ్లు.- నేను రాలేను అంది"

"కాదక్కా! నీవు తప్పకుండా రావాలి... నామీద ఒట్టే." అని మూతి బిగించుకుంది మహాలక్ష్మి.

కమల మాట్లాడక పోవడంతో బిగ్గఱగా "కమలా! నీకథకుణ్ణి గురించేమైనా ఆలోచిస్తున్నావా? ఆయన ప్రస్తుతం ఇక్కడికి రావడం లేదా? లేక వచ్చేవేళైమైనా అయిందా?" అన్నది.

"ఇందులో ఆశ్చర్యమేముంది మహాలక్ష్మి! ఆయన నాకు చాలా సన్నిహిత మిత్రుడు...ఎప్పుడు రావాలను కుంటే అప్పుడు రాగలడు" అంది కమల.

"ఏదో నవ్వుతూ అన్నాను. కోపమెందుకు —?" అంది మహాలక్ష్మి.

"ఆc! చెల్లీ! డాక్టరు ఏమంటున్నాడీ మధ్య... పద నిన్ను గురించి, నేనుకూడా నీవెంట వస్తాను... కాని ఒక్క షరతు, ఆస్పత్రిదాక మాత్రమే వస్తాను. నేను డాక్టరు గది లోకి మాత్రం రాను సుమా! నన్ను మాత్రం అక్కడికి వచ్చాక బలవంతపెట్టవద్దు..."

"సరే! పద"..."

ఇద్దరూ బయలు దేరారు.

"నమస్కారం డాక్టరు గారూ! "అంది మహాలక్ష్మి డాక్టరురావు గదిలోకి ప్రవేశిస్తూ.

రావు తలయెత్తి "మీరా మహాలక్ష్మి! అంతా బాగేనా?— అన్నట్టు మీ ఆరోగ్యం మెరుగైందా" అన్నాడు.

"ఇంకాలేదు డాక్టర్! అందుకే మళ్ళీ మీవద్దకు వచ్చాను..."

"నాకుకూడా ఇవాళెందుకో శరీరం కులాసాగా లేదు."

"డాక్టర్లకు కూడా జబ్బులొస్తాయా!"

"డాక్టరూ మనిషేగా!"

మహాలక్ష్మి డాక్టరు ముఖం కేసి అదేపనిగా చూడ సాగింది.

"ఏం చూస్తున్నావు మహాలక్ష్మి! అన్నట్లు ఆరోజు నీతో కూడా వచ్చిన నీస్నేహితురాలు రాలేదే!—"

"ఆమె బయట నిల్చొని వుంది." అంది మహాలక్ష్మి.

"ఎందుకు! నామీదేమైనా కోపం వచ్చిందా?" అన్నాడు రావు.

"అస్వస్థత నాకే డాక్టరు గారూ! ఆమెకు లేదు కనక లోనికి రాలేదు..."

"నీ బాధ తగ్గించడానికి నేనున్నాను మహాలక్ష్మి! మీ స్నేహితురాల్ని కూడా లోపలికి పిలువు.—"

"ఇక్కడకి ఆవిడెందుకూ?"

"బయటవుంది గనక" అన్నాడు నవ్వుతూ.

మహాలక్ష్మి ముఖం జేవురించింది. తల క్రిందకు వంచుకుంది. కొంచెం సేపటి వరకు ఏమీ మాట్లాడలేదు... ఏదో సుదీర్ఘమైన ఆలోచనలో పడ్డది.

"డాక్టరు గారు త్వరగా మందిస్తారా! లేకనా స్నేహితురాలి భోగట్టానే తెలుసుకుంటారా! చూడబోతే ఇది ఆస్పత్రి కాదు, పోలిసు స్టేషన్లే వుంది.—"

డాక్టరురావు చిన్నగా నవ్వుతూ మహాలక్ష్మి ముఖంకేసి సూటిగా చూచాడు. ఆవిడ కోపం కాస్త చల్లారింది. అలానే నవ్వుతూ "నీవు చాలా మంచి దానివి మహాలక్ష్మి నీలో యేంగారడీవుందో! చాలా చిత్రంగా కనిపిస్తున్నావు... ఒక్కసారే నన్ను అమాంతంగా ఆకట్టుకొన్నావు... అంటూ ఆమె చేతిని, తన చేతిలోకి తీసుకొని, తొలి దర్శనంలోనే నీవు నన్ను వశపరచుకొన్నావు- మహాలక్ష్మి! నేను అన్నీ మరచి పోయాను..."అన్నాడు.

"డాక్టర్! ఇలా మరచిపోతే ఇంకమీలో మిగిలిందేమిటి? జీవితం అంటే ఖాళీ అయిపోయింతరువాత అవతల పారేసే మందుసీసాలాంటిది కాదు. "మహాలక్ష్మి సూటిగా అంది.

"కొంచెం ఓపికపట్టు మహాలక్ష్మీ ! అంతా సవ్యంగానె జరుగుతుంది.

మహాలక్ష్మి నవ్వుతూ "కృతజ్ఞతలు డాక్టర్ ! కాని నా స్నేహితురాలివిషయమై మీరంత యిదిగా అడుగుతున్నా రెందుచేత ?" అంది.

"నీవు అర్థంచేసుకోలేదు మహాలక్ష్మీ ! నీవు ఒకర్తెవే ఆవిణ్ణి బయటవుంచి అదే పనిగా మాట్లాడుతూంటే ఆవిడ బయట ఏమనుకుంటుంది చెప్పు ! ఇలాంటి చిన్నచిన్న విషయాలే తరుచు ప్రమాదాల్ని తెస్తూంటాయి." అన్నాడు డాక్టరు.

"అంటే మీ ఉద్దేశ్యం...రాకూడని సమయంలో ఏమైనా వచ్చామనా ?"

"లేదు అలాంటిదేమీ లేదు. మీ సేవకోసరం ఎల్లప్పుడూ నేను సంసిద్ధమే ! "అన్నాడు డాక్టరు.

"మీరు బాగా మాటలు నేర్చుకున్నారు డాక్టర్ !"

"నేనేం నేర్చుకున్నాను. నీ నుండి నేర్చుకోవాల్సింది ఇంకా చాలావుంది."

"అయితే ఇకనే వెడతాను డాక్టర్ ! చాలాసేపైంది ఎక్కువసేపు చేస్తే కమలకు కోపం వస్తుంది.

"అందాక నేనూ నీతో వస్తాను, ఆవిడేమనకుండా నేను సర్దిచెప్పుతాను."

“కమలకు కోపం రాకముందేనా? అంది కొంటెగా.

“రాకపోతే ఆవిడ యోగక్షేమాలు అడగవచ్చుగా!”

ఇద్దరూ నవ్వుతూ కమలదగ్గఱికి వచ్చారు. కమల ఆవరణలోవున్న తోటలో పచ్చిగడ్డిమీద కూర్చొనివుంది. మహాలక్ష్మి డాక్టర్‌లు రాగానే ఆవిడ లేచి నుంచుంది.

“కమలారాణీ! క్షేమమా! “అని ప్రశ్నించాడు డాక్టర్ రావు.

“అన్నిటికీమీరుండగా క్షేమంకాకమరేమిటిడాక్టర్” మీ దయవల్ల ఒక్కరోజులోనే నా ఆరోగ్యం బాగుపడింది” కమల సవినయంగా సమాధాన మిచ్చింది.

“నాదయకాదు...అదంతా మీదయే సుమండీ”

“అదేలా డాక్టర్! చిత్రంగా మాట్లాడుతున్నారు!”

“అవును కమలారాణీ! ఒక్కొక్కసారి ఎవరిపట్ల వారికే దయగలగాలి; మరింతముఖ్యంగా వైద్యంపట్ల వైద్యంపొందే వారికే తమమీద ఎక్కువ దయకలగాలి. ఇచ్చిన మందులు చేదువైనా, దయతో సేవిస్తేనే గుణం... లేకపోతే సరేసరి.”

“అయితే నామీద నాకు దయవుందని మీకెల్లా తెలుసు?

“డాక్టర్ అంత మాత్రం రోగివిషయం తెలుసుకోలేడా కమలారాణీ!”

“నేను మీపేషెంటునయ్యే అదృష్టమేలభించలేదుగా”

"అయితేం- మీసేవకోసం నేనెప్పుడూ సిద్ధంగానే వున్నాను."

"అందుకని నన్ను మీపేషెంటును కమ్మన్నారా యేమిటి? అంది కమలారాణి.

"అవ్వాలని మీకంతగావుంటే, నా అభ్యంతరం మేమీ వుండదు కమలారాణీ!"

"అలాగే నన్ను ఆశీర్వదిస్తున్నారా?"

"కాదు! కాదు!! మీరు చాలాసుఖంగా, సంతోషంగా వుండాలనే నా ఆకాంక్ష."

కమల ప్రసంగమాధురిని ఆస్వాదిస్తూ, తబ్బిబ్బు పడిపోతున్నాడు డాక్టరురావు. తిరిగి సముదాయించుకొని "జీవితంలో అనేక రకాల సందర్భాలువస్తూ, పోతుంటాయి. ఎవ్వరు ఏ పరిణామాలకు గురవుతారో చెప్పడం కష్టం." అన్నాడు డాక్టర్.

"డాక్టరుగారూ! మీకుజ్యోతిషంకూడా వచ్చునా?" అంది కమల.

"డాక్టరైన ప్రతివాడూ కొద్దోగొప్పో జోస్యం చెప్పగలడులెండి!"

కమల నవ్వుతూ "భలే డాక్టరుగారూ! బాగుంది. భలేవారుమీరు." అన్నది.

కమలను మాటల్లో ఏవిధంగానైనా జయించడం సులభముకాదు- అనుకున్నాడు డాక్టరురావు, మనస్సులోనే. ఆవిడ అభిమానాన్ని చూరగొనాలని ఎంతో తహతహలాడిపోతున్నాడు.

ఉత్సాహాన్ని ప్రకటిస్తూ "కమలారాణీ! మీరు లోపలికి వస్తారని గదిలో మీకోసం చాలాసేపు నిరీక్షించాను.-" అన్నాడుడాక్టరు.

"ఎందుకు నాకోసం నిరీక్షించారు — ? "

"మహాలక్ష్మితో మీరుకూడావచ్చారు కనుక. —"

"ఊరికేవచ్చాను. వేరేపనేమీలేదు. — "

"నేనూ ఊరికే నిరీక్షిస్తూ కూర్చున్నాను. ప్రత్యేకించి పనేమీలేదు. — "

"అంతగా నిరీక్షించకండి డాక్టరుగారు ! అందువల్ల ప్రయోజనం వుండదుసుమా ! "

"అలాంటి ప్రయోజనాలగురించి నాకెలాంటి మక్కువలేదు కమలారాణీ ! "

"మీరు హృదయమిచ్చి మాట్లాడుతున్నారంటే "

"అలా కాదులేండి. నాహృదయం ఇస్తే ఇకనాకు మిగిలేదేముంటుంది ? అలాంటిపనెప్పుడూ చెయ్యను. అన్నాడు డాక్టరు.

"ఒక్క హృదయం వుంటేనేమీారు ఇంత పెద్ద తుఫానును సృష్టిస్తున్నారు. ఇంకా అదనంగావుంటే ఎన్ని తుఫానులు చెలరేగుతాయో — ? "

"అలా అని మీారు ఆశీర్వదిస్తే, నాలో మరో హృదయం వచ్చిచేరవచ్చుగా ! — అయినప్పుడు మీారనే మాటలో ఆశ్చర్యంలేదు."

"ఆశీస్సులు అవసరం లేకుండానే మీాకన్నిపనులు చక్కబడుతున్నాయి. యింక అవెందుకు ?"

"అవుంటే మరీమంచిదని"

"అవి ఒక్కొక్కప్పుడు నష్టపరుస్తాయి డాక్టర్ ! అంటూ కమల మహాలక్ష్మికేసితిరిగి పద వెడదాం. ఎలా వుందిప్పుడు నీఆరోగ్యం !" అంది.

"నాఆరోగ్యానికేం బాగానేవుంది."

"అయితే డాక్టరుదగ్గరికి రావడానికి యింత తొందర పడ్డావెందుకు?"

తొందరేముంది ! రావాలనిపించింది. వచ్చాను అంతే."

"అయితేమనస్సును కాస్తకట్టేసుకొని వుంచుకోవడం ఎందుకైనా మంచిది మహాలక్షి!"

మహాలక్ష్మి కమలని ఎత్తిపోడుస్తూ "మా ప్రియ మిత్రుడు కథా రచయితనుండి అది తప్పకుండా నేర్చుకుంటాను నేను:—"

"పాపం ఆకథా రచయిత ఇప్పుడెందుకు జ్ఞాపకం వచ్చాడు ?"

ఆయానంటేనాకు చాలా యిష్టం."

"ఆయన్నే కలువు. ఆపేదేముంది?"

"నీవేమైనా బాధపడతావేమోనని... ..."

"నాకెందుకు బాధ ? నీవు పొరబడుతున్నావు "

అయితే ఈ చిన్న చిన్న విషయాలడిగి నన్నెందుకు విసిగిస్తున్నావు ?" అంది మహాలక్ష్మి.

"అవును. విసిగించక ఏం చేయమన్నావు, మరి, ఏ జబ్బు లేకుండానే డాక్టరు దగ్గఱకి రావడం, కబుర్లాడడం, ఏమిటీ అంతరార్థం ?"

"డాక్టరు రూపచిత్రం నా హృదయంలో హత్తుకొని పోయింది కమలారాణీ !"

"కేవలం రూపమేనా, ఇంకేమైనానా ? "

"ఆయన రూపం, నిరాడంబరత్వం, చిరునవ్వు, అన్నీ నాలో హత్తుపోయినై. నన్ను ఆకర్షించినయ్ !"

"నీవు డాక్టరును ప్రేమిస్తున్నావన్నమాట ?"

"త్వరపడి యిలాంటి నిర్ణయం చేసుకోవడం నష్టాన్ని చేకూరుస్తుందేమో !. ఆలోచించు జాగ్రత్తగా. "

"నీవునాకు తోడుగా వుంటే ఏనష్టం నాకు సంభవించదు కమలా !" అంది మహాలక్ష్మి.

"ప్రేమ అనే పదానికి, లైంగిక సంబధమేనన్న భావార్థం కల్పించ బడుతున్నదీనాడు. తాత్కాలిక ఉద్రేకాలకులోనై, ప్రేమ పేరుచెబుతూ, పురుషులు స్త్రీని వశం చేసుకోవడానికి ఇలాంటివి జరుపబడుతూనాన్నయి మహాలక్ష్మీ! ఈమోసాన్ని గ్రహించలేక స్త్రీ లొంగిపోయి, ఎన్నో అవస్థలకు గురౌతున్నది. ఈవిషయం తెలియనిదికాదు." అంది కమల ఆవేదనతో.

"అయితే అదే దృష్టితో ప్రతి ప్రేమను అర్థం చేసుకోవడం బావుంటుందా ?" మహాలక్ష్మి ప్రశ్నించింది.

"ఇవాళ, రేపటి ప్రేమ లలానేవున్నాయన్నీ—మహాలక్ష్మీ! బాగా ఆలోచించు. యదార్థం అదే తెలుస్తుంది. ఇప్పుడు జరిగే ప్రేమంతా మోసం! ప్రేమకోసం ప్రాణత్యాగం చేస్తామని వాగ్దానాలు కొందరుచేస్తారు. ఆత్మహత్య చేసుకుంటామని బెదిరిస్తారు. మజ్నూల్లా తయారై ఆడాళ్ళ చుట్టూతిరుగుతూ, విశ్వాసాన్ని కుదర్చ ప్రయత్నిస్తుంటారు. వాళ్ళ ఉద్రిక్త, ఉన్మాదతత్వం అలావిహరించి: అనంతరం, వాళ్ళనిజస్వరూపం బయటపడుతుంది.—ఆ తరువాత మనకు పశ్చాత్తాపంతప్పితే మిగిలేదేమీ ఉండదు. "కమలారాణి ఆవేదనపూర్వకంగా మహాలక్ష్మి భుజాలను నిముకుతూ అన్నది.

మహాలక్ష్మి సమాధానంగా "అక్కా! నీవు చాలా చిత్రంగా మాట్లాడుతున్నావు. — చెడిపోవడం అనేది స్త్రీ

పురుషులు ఇద్దరివల్లాజరుగుతుంది. కానిఅందులో ఏఒక్కరూ వేరొకరి కోరికలు కారు. ప్రతి పురుషుడికి నైసర్గికంగా కొన్ని కోరికలుంటాయి. అలాగే ప్రతిస్త్రీకి కొన్ని ఆశలూ, ఆశయాలు వుంటాయి. అవి సిద్ధించనిదే వాళ్ళకు జీవితాల్లో శాంతి లభించదు. శాంతిలేని జీవితంవల్ల ప్రయోజనం ఏమిటి? అలాంటి బ్రతుకుకంటే మరణంమేలు. ప్రేమ—సంతోషం, చిరకాలం వుండకపోవచ్చు. అది ప్రేమించుకునేవారి తప్పుకాదు. వారివారి హృదయాలయొక్క అంతస్థులనుబట్టి ప్రేమతత్వం నెలకొంటూ వుంటుంది. అందులో దోషంఅన్న ప్రశ్నకు తావులేదు. ఇవాళ్ళ నీకు గులాబీ ఇష్టంకావచ్చు. రేపు తామరపుష్పం బాగుందనిపించవచ్చు. సంచలనం అనేది జీవితానికి మరోక పరిణామాత్మకరూపం. అని నీవు విశ్వసిస్తే, మార్పులు ప్రతిజీవితంలోనూ సంభవిస్తూనే వుంటాయి. అలా జరగనినాడు రాతికీ, మనిషికి తేడా అసలేలేదు. —" అన్నది.

కమల ప్రశాంతంగా "మహాలక్ష్మి! నేను పూలతో మనిషిని పోల్చలేను. మనిషికి మానవత్వపు విలువ కావాలి. అవి సాకల్యంగా తెలిసిరావాలి. సత్యదృష్టి లేనిమనిషి మానవరూపంలోవున్న మృగం మాత్రమే. మనస్సుకల్పించే చిత్రాతిచిత్రమైన బానిసరూపాలు, కోరికల తుఫానువల్ల ఆత్మానందం మృగ్యమై జీవితం నరక సదృశమౌతుంది. అట్టి స్థితికి అవకాశం యివ్వడం అంతరాత్మకు ద్రోహాన్ని

చేకూర్చడమే అవుతుంది. ఇలాంటి కృత్రిమమైన ప్రేమలో ఎక్కువనే స్త్రీ, తనన్నతానే మోసగించు కుంటున్నది." అన్నది కమలారాణి.

"నిజమైన ప్రేమ ఎలాంటిదో వినాలనుంది కమాలా!"

"నిజమైన ప్రేమలో ఆత్మానందం సిద్ధించాలి. జీవితంలో ఏ ఒడుదొడుకులు లేని ప్రశాంతస్థితి యేర్పడాలి. అవసరమైతే ఇలాంటి ప్రేమకు ఆత్మబలిదానం చేయటం కూడా ఆనంద ప్రదంగావుంటుంది." కమల క్లుప్తంగా జవాబుచెప్పింది.

"చేసుకున్న భర్త, భార్యకు నిజమైన ప్రేమాను రాగాన్ని అందివ్వలేకపోతే ఆ స్త్రీ యేం చెయ్యాల్సి వుంటుంది."

"స్త్రీకి వివాహానంతరం భర్తవల్ల అనర్థాలు సంప్రాప్తిస్తూంటే వాటిని భరిస్తూ, నికృష్ట జీవితం గడుపుతూ పతనం కమ్మని నేను చెప్పజాలను. కాని వివాహం తరువాత స్త్రీ పురుషుల్లో ఎన్నో గురుతరమైన బాధ్యతలు ఏర్పడతాయి. వాటిని చక్కగా నిర్వహించాల్సివుంటుంది. ఏ మిత్రుడైనా తనను నిష్కల్మషంగా ప్రేమిస్తోంటే- అభిమానించి గౌరవిస్తూంటే- ఆయనతో కలసి హృదయం విప్పి మాట్లాడడం నేను నేరంగా భావించను. కాని ఆ వ్యక్తి ప్రదర్శించే ప్రేమ భావం దైహిక ప్రతిపత్తితో కూడివుండకూడదు. నిర్లజ్జాకరం కాకూడదు."

"అయితే అక్కా ! యీ సమాజం, పెండ్లిఅయ్యాకనే స్త్రీ పురుషులు పరస్పరం సంభాషించుకోవాలని నియమిస్తున్నదికదా ? అలాంటప్పుడు పెండ్లితో ప్రేమను విడదీసి చూడడమెలా ?"

"నిర్మల ప్రేమికులైనవారు దేనికీభయపడరు. అట్టి ప్రేమ ఆత్మోపలబ్ధి గలిగినది. దేహగత ప్రవృత్తి ధర్మాలకు అందేదికాదు. ప్రేమ తత్వం ప్రదర్శన పూర్వకమైనదిగా పరిణమిస్తే ప్రమాదం తప్పక సంభవిస్తుంది. దాని ఫలితం చాలా ఘోరంగా ఏర్పడడానికి అవకాశంవుంది."

"అక్కా ! నిజంగా ఈ విషయాలగురించి నేనేమాత్రం తెలుసుకోలేదు. నీ అనుభవపూర్వక విజ్ఞానం నేను చాలా అమూల్యంగా స్వీకరిస్తాను."

"నా సహాయం నీ కెల్లప్పుడూ వుంటుంది. సరే ! వెళతాను మాటల్లో చాలా సమయం అయింది." అంటూ కమలారాణి మహాలక్ష్మితో సెలవుతీసుకొని బయలుదేరింది.

మహాలక్ష్మి మనసులోనే ఎంతో ఆనంద పడసాగింది. డాక్టరును తాను జయించగలిగాననే సంతోషం ఆమెలో పరవళ్లు త్రొక్క సాగింది. డాక్టరుని ఆమె ప్రేమిస్తున్నది. ఆయన అదృష్టవశాత్తు పెళ్ళికానివాడే అయితే తప్పక వివాహం చేసుకోవాలనుకుంది.

తొలిసారిగా మహాలక్ష్మికి పెళ్ళిని గురించిన ఆలోచన జనించింది. ఉండి ఉండి కమలారాణి అన్న మాటలు

ఆవిడకు మనస్సులో స్ఫురించాయి. స్త్రీ తన్ను తాను భానిసగా భావించి, పురుషుడికి అంకితం అయ్యేకంటే, ఘోరమైనస్థితి ఆమెకు మరొకటి లేదు.

డాక్టరు ప్రేమ పూర్వకమైన సరస సల్లాపాలు మహాలక్ష్మిని ఎంతగానో ఆకర్షించాయి. డాక్టరుతో నిత్యం కలసి మాట్లాడాలని ఆవిడ మనస్సు ఉత్సాహ పడసాగింది. ఆయన ఒంటరితనాన్ని దూరం చేసి, జంటగా కాలక్షేపం చెయ్యాలని ఉవ్విళ్లూర సాగింది. ఆవిడకు ఏకాంత స్థితి లభించినప్పుడల్లా ఈ విధమైన మధురాలోచనలతో కాలాన్ని భారంగా గడపసాగింది.

డాక్టర్ రావు ఆకర్షణీయమైన ముఖం, మాటలు, కదలిక, ఆవిడమనస్సును, ఆలోచనలను, చూపులను తన వైపులాక్కుంటూ గిలగింతలు పెడుతూ కవ్విస్తున్నాయి. ఈ రకమైన రకరకాల ఆలోచనలతో సతమతమాతూ ఎన్నోసార్లు ఆయనకు జాబు వ్రాయాలని ప్రయత్నించి, తిరిగి పారవశ్యంచెంది వ్రాయలేక విఫలమవడం జరిగింది.



కొన్ని రోజులు గడిచాక రాజన్ కమలారాణిని కలవడానికి ఆవిడ యింటికి బయలు దేరాడు. ఇంతకాలం ఆయన ఏకాగ్రదీక్షతో ఒక నవలను వ్రాయడానికి సంకల్పించి దాన్ని పూర్తిచేయడంలో గడిపాడు. అది పూర్తయాకనే కమలారాణిని సందర్శిద్దా మనుకున్నాడు. కాని

ఎంత దీక్ష గొన్నప్పటికీ తన నిర్ణయం మార్చుకునేట్టు చేసింది కమలారాణి, రాత్రి 8 గంటల సమయం అయింది. రాజన్ బయలుదేరి కమలారాణి యింటికి చేరుకున్నాడు అనుకోకుండానే. ఇంటి తలుపులు మూసివున్నాయ్. ఎక్కడికి వెళ్ళివుంటుందోనని ఆలోచించడం ప్రారంభించాడు. నుదుట కొద్దిగా చెమట బిందువులు వెలిసాయి. మెల్లిగా తలుపు తట్టి పిలిచాడు. కొంచెం సేపటివరకు ఎవరు బదులు చెప్పక పోవడంలో గట్టిగా పిలిచాడు. ఈసారి లోపలనుంచి పని మనిషివచ్చి తలుపు తెరిచి "ఎవరు బాబూ! చీకటి కని పించడంలేదు." అడిగింది.

నేనే ఆయా! రాజన్‌ని."

"నమస్తే బాబూజీ! దయచేయండీ లోపలికి" అంటూ రాజన్‌ను ఆహ్వానించింది పనిమనిషి.

"కమలారాణి నిద్రపోతున్నది. లేపమన్నారా బాబూ." అనిఅన్నది ఆయా!"

'రాజన్ సందేహిస్తూ కాస్త వెనుకాడాడు. కమలని కలవకుండా వెళ్ళడానికి అతనికి మనస్కరించలేదు. ఇంతలో ఆయా వెళ్లి కమలతో రాజన్ వచ్చినసంగతి చెప్పింది. కమల ఆమెతో రాజన్‌ను లోపలికి రమ్మని కబురుచేసింది.

రాజన్, కమలగది వేపు అడుగులు వేస్తూ అంతదూరం నుంచే "క్షమించాలి కమలా! నేను "అనవసరంగా వచ్చి మీకు శ్రమకలిగించాను."

"శ్రమకలిగిస్తున్నానని ఎందుకు భావిస్తున్నారు. రాజన్! నాకేమీ శ్రమలేదు. మీరు వచ్చినప్పుడల్లా చీకట్లోకి వెలుగు ప్రసరించునట్లుంటుంది. విచారంలో కన్నీరు కార్చేకళ్ళు సంతోషంతో కాంతివంతమౌతాయి. నీరసించే హృదయం ఆనందంతో ఉబికిపోతుంది. తపించిపోతున్న మనస్సు చల్లబడి హాయిగావుంటుంది. రాజన్ బాబు! ఎంతగడుసరివి నీవు?"

రాజన్‌కు ప్రాణంలో ప్రాణంవచ్చినట్లైంది. అనుకోకుండా అతని పెదవులపై చిరునవ్వు తాండవించింది.

"అవును కమలారాణీ! నేను గడుసరినే. గడుసరిని కాకపోతే నీవిలావుండే దానివే కావేమో?

"కమల చిరునవ్వు నవ్వింది. రాజన్ కమలారాణి ప్రక్కనే కూర్చున్నాడు. అతని కన్నులు ఆశాపూరితాలై ఆమె ముఖంపై వెలుగులు చిమ్ముతూ పారాడసాగాయి.

"ఏం చూస్తున్నావు రాజన్?" ప్రశ్నించింది కమల.

"ఏమీ లేదు. ఊరికే —" మధ్యలో ఆపాను.

రాజన్ శరీరం ఆనందంతో, చలించ సాగింది. కమల తిన్నగా రాజన్ చుట్టూ తన పొడుగాటి బాహువుల్ని చుట్టివేసింది.

రాజన్ శరీరం అవశమై పోసాగింది. వెంటనే ఆమెని తన చేతులతో వారించాడు.

"ఎంత నిర్దయుడివి రాజన్ నీవు. ఇంతకూ నేనంటే నీకు కోపం యేమైనా వుందా ?"

"అలాంటిదేమీ లేదు. కాని నన్ను వదిలిపెట్టు, నీకు పుణ్యముంటుంది. ఏమిటీ ఆకతాయితనం మరీను !"

"రాజన్ ! ఎందుకలా ఇదౌతున్నావు ? నేను నిన్ను హృదయపూర్తిగా ప్రేమిస్తున్నా. నేను నీ దానినైనాను. నన్ను అన్యథాభావించవద్దు, నీవు తప్పక నన్ను స్వీకరించాలి. నీవు వస్తూనే శ్రమకలిగిస్తూనాన్నా నన్నావు. కాని నీవు నా దగ్గరికి వచ్చే స్వేచ్ఛఎప్పుడైనావుంది. రాజన్! నాయీ చొరవను నీవు అపార్థం చేసుకోవడంలేదు కదా ?" కమల ప్రశ్నార్థకంగా అడిగింది.

రాజన్ చిరునవ్వునవ్వుతూ కమలను తన బాహువుల్లోకి తీసుకొని "కమలా ? నిన్నెప్పుడూ నేను అపార్థం చేసుకోను. నీవు నా మనస్సుకు శాంతిని ప్రసాదిస్తున్న అమృతమూర్తివి. అలాంటి నిన్ను దూరం చేసుకోగలనా ? లేదు.- అలాంటి దెన్నడూ జరగదు. నీవెప్పుడూ నాదానివే రాణీ!" అంటూ చేతిలో చేతిని వేశాడు.

"రాజన్ ? నిజంగా నా అంతరాంతరాల్లో నీ పైన నెలకొన్న ప్రగాఢమైన ప్రేమ నన్ను నిరంతరం ఆందోళన పాలు చేస్తున్నది. మీకు చాలావరకు నన్ను గురించిన అన్ని విషయాలు ఈ వరకే విన్నవించాను. ఇంక నీ వంటి దయా

మయుని తోడ్పాటు లేనిదే నా జీవితం ప్రశాంతంగా గడవదు ”

“కమలా ! నన్ను విశ్వసించు ; నేనెప్పుడూ నిన్ను మోసగించను. నిన్ను మనసారా ప్రేమిస్తున్నాను.”

“రాజన్ నునుపైన చెంపలకు కమల తన చెంపలను ఆన్చింది. అలా ఇద్దరూ ఆనందంలో తన్మయులైనారు, కొంత సేపయాక ఇద్దరూ ఒకేసారిగా విడిపోయారు.

“రాజన్ బాబూ ! ఏమిటిది ? నిన్ను చూడగానే నా హృదయం ఇంతగా యెందుకు తపించి పోతున్నదో చెప్పగలనా ? ఎందుకింత ఉద్వేగపడుతోంది నా మనస్సు ?”

“నీవు నిజంగా ఉద్వేగ పడుతున్నావా కమలా ?”

“అవును రాజన్ ! నీవు పరిచయం అయిననాటినుంచీ నాజీవితంలో నిజంగా అపూర్వమైన మార్పుకలుగుతోంది. ఎన్నివున్నా స్త్రీ, పురుషుడిముందు ఏమీలేనిదేనని నిన్ను చూస్తూంటే బోధపడుతున్నది నాకు. నన్ను ఆవిధంగా పూర్తిగా ఆకట్టుకున్నావు రాజన్ ! నీవు నిజమైన ఉత్తమ కథకుడివి.”

“నిజమేమరి ! ప్రేమికుడైన కథకుడు, జీవితంలో ఒక్కరినే, ప్రగాఢంగా ప్రేమిస్తాడు. ఆప్రేమశక్తి జీవితాంతమువరకు అతణ్ని నడిపిస్తుంది, అచంచలమైన ధైర్యసాహసాల్ని చేకూర్చి ఆదర్శప్రాయమైన జీవితాన్ని సమకూర్చి పెడుతుంది.”

ఈమాటలు వింటూన్న కమలలో ఉత్సాహంఅధికం అయింది. ఆవిడముఖం కాంతివంతమై ఎంతో అందంగా ప్రకాశిస్తోంది. ఆవిడ కన్నులు నిగనిగలాడుతూ ముచ్చట గొలుపుతున్నాయి. తనఅందాన్నిచూచి తానే మురిసిపడు తున్నది. ఇలాంటి సంతోషం ఆమెకు ఇదివరకెన్నడూ కలగ లేదేమోమరి. ఈనాడుమాత్రం అపరిమితమైన వెల్లువలా, ఆమెను ముంచెత్తుతున్నది. ఆమె శరీరంపై చిరకాలంగా నెల కొన్న బరువేదో, దించివేసినట్లైంది. ఇంతవరకు తాను గత జీవితంలో అనుభవించిన కష్టాలన్నిటినీ మరచిపోసాగింది. లోగడ తనజీవితంలో జరిగిన రకరకాల మార్పుల్ని ఒక్క సారి సమీక్షించుకుంది. ఇలాంటి సుఖప్రదమైనమార్పు తనలో జరుగుతుందని ఆమె యెన్నడూ భావించలేదు. నిరాధారమైన తన జీవిత యాత్రలో ఆశాపూరితమైన సుస్థితి సంభవిస్తుందని ఆవిడఊహించలేదు.

కమలారాణి రెప్పవాల్చకుండా తదేకంగా రాజన్ ముఖం పరిశీలించసాగింది.

"ఏమిటలా చూస్తున్నావు కమలారాణీ!" ప్రశ్నించాడు రాజన్.

"ఏమో! కనికట్టుఏమైనా ప్రయోగించబడిందేమో!"

"అందుకు నాదోషమేమీ లేదుకద ?"

"వుంది, దీనికికారణం పూర్తిగానీవే ! నాలోఉజ్వల మైన అనురాగజ్యోతిని వెలిగించావు. అందువల్ల, స్తంభించి

పోయిన, నాశరీర రక్తం ఉడికెత్తి పొంగులెత్తుతున్నది. నామనస్సు ప్రశాంతంగా ఆనంద నిలయంలో హాయి ననుభవిస్తున్నది. ఈ దోషం నీదికాక మరెవరిది ?"

"ఇది దోషమెలా అవుతుంది? "

"దోషం కాక మరేమిటి? రాజన్! తన్ను తాను పూర్తిగా మరచిపోయిన ఎడారిలాంటి నిస్తేజ జీవితాన్ని ఆనందప్రవాహంలో ముంచెత్తి చల్లబరచడం–తప్పంటాను."

నీవన్నట్లు ఇది నాతప్పైఅయితే — నాఅదృష్టం ఫలించిందన్నమాటే కమలారాణీ! "అంటూ ఆవిణ్ణి తన కౌగిటిలోనికి తీసుకున్నాడు. కమల శరీరంలో బరువుదిగిపోయి తేలికతనం వచ్చింది. మత్తుగా కనులుమూసుకొని మౌనంగా వుండిపోయింది. రాజన్ ఆవిణ్ణి కదుపుతూ "ఏమిటీమౌనం? అన్నాడు.

ఆవిడ సిగ్గుతో ముఖందాచుకుంది అతని ఒళ్లోనే!— కొంతసేపలావుండి ఆలోచించసాగింది. తాను రాజన్‌ని పూర్తిగా వశపర్చుకొంది. ఈ అనుబంధం చిరకాలబంధంగా ఇలాగే వుండగలదా? ఇందుకు సమాజంగానీ, పరిస్థితులుగానీ ఏమైనకన్ను కుట్టించుకుంటాయా? ఏమైనాకానీ వీటన్నిటిని ధైర్యంగా ఎదుర్కొంటానన్న దృఢనిశ్చయానికి వచ్చింది.

రాజన్‌తో పరిచయం కాకముందు కమల పరిస్థితి మరీ అధ్వాన్నస్థితిలో వుండిపోయింది. అన్నిరకాల జీవితాన్ని చవిచూచి, విరక్తిచెంది, కేవలం జీవచ్ఛవంగా కాలాన్నిగడుపు

తూ ఎవరినీ నమ్మక, ఎవరి విశ్వాసానికీ లోనుగాక, ఒకరకమైన ఏకాంతజీవితానికి అలవాటుపడ్డది. అయినప్పటికీ ఆవిడ అంతరాంతరాల్లో ఓమూలన, వీలుంటే తనజీవితానికి శాశ్వతంగా మార్గదర్శకత్వం వహించే ఒక సహచరుడు లభిస్తే బావుండునన్న ఆలోచనకూడా వుంటూవచ్చింది. తదనుగుణంగా తనఅదృష్టం ఫలించి రాజన్‌లాంటి సహృదయుడు లభించాడు. అతని పూర్వోత్తరాల వివరాలు తనకింతగా తెలియక పోయినప్పటికి ఎందుకో అతణ్ణి అమితంగా అభిమానించసాగింది. ఆవిడ మనస్థితి పూర్వంలా కాక క్రొత్త క్రొత్త అభిరుచులకూ, అనుభూతులకు ఆలవాలమైంది. ఈవిధంగా కమల, రాజన్‌లహృదయాలు రెండూ చాలా సన్నిహితమయ్యాయి.

కమల తనలోతానే ఈవిధంగా భావించ సాగింది ...

'రాజన్: నీవు విప్లవ రూపానివి ... నాజీవితాంగణంలో అడుగు పెట్టగానే అంతులేని జీవితాపేక్ష కలిగిందినాకు. నీవు కలిగించిన అలజడి ఎన్నో మార్పులని తీసుకొని వచ్చింది.'

రాజన్ ఎడనెడ అన్నమాటలు ఆమెకు ఒకటొకటే జ్ఞాపకానికి రాసాగినయ్.

రాజన్:– కమలా! నీవునన్ను హృదయ పూర్తిగా నమ్మావు. అలాగే నేనూ నిన్ను మరచి పోలేనంతగా నాలో స్థానాన్ని సమకూర్చుకున్నాను. నా అంతరాంతరాలలో

సీమూర్తి ఇమిడిపోయింది. ఎన్ని తుఫానులు వచ్చినా మనిద్దరి ఐక్యతను విడదీయలేవు...మనిద్దరం రెండు రూపాలలోవున్న ఏకాత్మలం."

కమల:- ఎంత ప్రగాఢమైన విశ్వాసం కలిగింది నా రాజన్‌కు. అది యేవిధంగానూ వెడలిపోకుండా చూచుకోవాల్సిన బాధ్యత నాకు వున్నది. భగవంతుడా నాకు అలాంటి శక్తిని ప్రసాదించవూ ?"

ఇద్దరి మనస్సులలో ఎన్నో కోరికలుసుళ్ళు తిరగసాగాయి.

కాలచక్రం మౌనంగా కొన్ని అడుగులు ప్రయాణం చేసింది. ఈమధ్య కాలంలో కమల, రాజన్‌ల స్థితిగతులు ఒకరికొకరు తెలుసుకునే వీలుకలుగ లేదు. ఒకనాడు ఎలాగో వీలు కలిగించుకొని కమలారాణిని సందర్శించడానికి ఆవిడ బసకు వెళ్ళాడు. కాని ఆవిడ మాత్రం కనపించలేదు. చివరకు ఒకచోట మూసివుంచిన కవరుపై తన పేరు వ్రాయబడిన ఒక ఉత్తరం మాత్రం ఆయనకు దొరికింది. ఇంతలో లోపలికి ప్రవేశించిన ఆయా "కమలారాణి ఆ వుత్తరం మీకు అందజేయమని చెప్పి అర్జెంటుగా ప్రయాణమై వెళ్ళింది" అన్నది.

రాజన్ వెంటనే కవరు చించి చూచాడు.

"అకస్మాత్తుగా నా బాల్యమిత్రుడొకాయనఇక్కడికి వచ్చాడు. ఈయన ప్రస్తుతం కాశ్మీర్‌లో నౌకా విభాగంలో

కెప్టెన్ పదవిని నిర్వహిస్తున్న ఉద్యోగి. ఆయన ప్రేరేపణపై ముందు వెనుక లాలోచించకుండా కొద్దిరోజుల కొరకు మాత్రమే ప్రయాణమై వెడుతున్నాను. ఎందుకో నా హృదయం వెనుకాడుతున్నది. కారణం లోగా నా జీవితంలో జరిగిన మార్పులు ఉనుచితాలూ అన్నీ ఈ విధంగానే జరిగి నన్ను అనంతరం పశ్చాత్తప్తురాల్ని చేసినయ్. ఇది ఆదినుంచీ నాలోవున్న నైసర్గికమైన లోపం. ఇప్పుడూ అలానే ప్రేమకు లొంగి ప్రయాణమై వెడుతున్నాను. ఏం చెయ్యను రాజన్! పరిస్థితులు నన్ను ఈ విధంగా కట్టి వేస్తూంటాయి. అయినా ఈ మిత్రుడలాంటివాడు కాదని నేను విశ్వసిస్తున్నాను.... నీతో కలసి మాట్లాడకుండా వెడుతూన్నందుకు చాలా విచారిస్తున్నాను. వీలుంటే ఈ ఉత్తరం చూచుకొని కాశ్మీర్‌కు దిగువ అడ్రసు ననుసరించి రావలసింది. చాలా బావుంటుంది. ఇట్లు—కమల"

రాజన్ ఉత్తరం చూచుకొని ఆశ్చర్యపడిపోయాడు. ఓడిపోయిన ఆటగాని మాదిరిగా అక్కడవున్న ఒక కుర్చీలో అలాగే వాలిపోయాడు, కమల చెప్పకుండా ప్రయాణమై వెళ్ళిపోవడం అనేది తనకు జీవితమనే క్రీడారంగంలో సంభవించిన దారుణమైన ఓటమిగా భావించాడు. కమలారాత్రి తనలో అత్యంత ప్రమాదకరమైన హాస్యం ఒలకబోసింది. అతని హృదయం తీవ్రమైన గాయానికి గురైంది. అంత ఉన్నతస్థాయిలో కమలతో ప్రేమకలాపం నిర్వహించి

తిరిగి వెంటనే పాతాళానికి పడద్రోయబడిన స్థితివచ్చినందుకు రాజన్ తీవ్రమైన బాధ ననుభవించసాగాడు. గాయపడ్డ తన హృదయం ఏ విధంగా స్వస్థత పొందుతుందో ఊహించలేక పోయాడు. కమల జీవితంలో మళ్ళీ తనకు లభిస్తుందా ? అతని కేమీ అర్థంకాలేదు. రాజన్ బలవంతంగా ఒక సిగరెట్టు వెలిగించాడు. సిగరెట్టు చేదుగాతోచింది. అవతల పారేసి 'ఆయాను' రమ్మని సంజ్ఞచేశాడు, ఆవిడ వచ్చింది. జేబు లోంచి పదిరూపాయలనోటు ఆమెచేతిలో పెట్టి ఏదో తెమ్మ న్నాడు.

'ఆయా బయటికెళ్ళి కొంచెంసేపయాక ఒక బీర్‌సీసా ఒకగ్లాసు తెచ్చి ఎదురుగావున్న టేబిల్‌మీద పెట్టింది. రాజన్ ఒకటి, రెండు గుటకల్లో సీసాను ఖాళీచేశాడు. తిరిగి మత్తుగా మంచంమీద ఒరిగిపోయాడు. కొంతసేపట్లో అతనికిగాఢమైన నిద్రఆవరించింది.



రాత్రి రెండు ఝాములు గడచిపోయిన తర్వాత రాజన్ నిద్రనుండి మేల్కొన్నాడు. కమలమాటలు, ఆవిడ తీరు అతని మనస్సులో మాటి మాటికీ తిరుగసాగినయ్-ఆవిడ గది, పడకమంచం, సామానులు అపహాస్యం చేస్తున్నట్టు గోచరించిందతనికి, ఏఇంట్లో మొట్టమొదటిసారిగా తాను ప్రేమపాఠం నేర్చుకున్నాడో ఆయింట్లోనే ఈనాడుతీరని వేదనకు మోసానికి గురై బాధపడుతున్నాడు. తన నిర్మల హృదయం

యూవత్తు ఒక స్త్రీకి అర్పించి భగ్నహృదయుడై పరివేదనపా లవుతున్నాడు. తాను నిర్బలుణ్ణని, నిస్సహాయుణ్ణని వెతప డుతున్నాడు. మానసికంగా ఇన్ని బలహీనతలతో యెన్నడూ ఇదివరకు బాధపడియెరుగడు. 'ప్రియతమా! ఎందుకు నన్నింత కఠినశిక్షకు గురిచేసి వెళ్ళావు. ఎన్ని ఆశలు నీతో రచించుకు న్నాను, ఇవన్నీ ఈనాడు వ్యర్థంచేసి, బూడిదలోపోసిన పన్నీరుమాదిరిగా చేసి వెళ్ళావు.—" ఈవిధమైన ఆలోచన లతో ఆయనబుర్ర వేడెక్కిపోతున్నది. అతనికి స్త్రీనిగురించిన ప్రత్యక్షానుభవం, కమల ఇప్పుడు సృష్టించి వెళ్ళిన సంఘటన తోనే ఆరంభమైంది. ఈవిధంగా నీవు నాహృదయాన్ని శస్త్రంతో భేదించి, మోసగించి వెళ్ళావు. ఇలా చేస్తావని నేనె న్నడూ భావించలేదు. నీవునాపట్ల ఇంతటి నిర్దయాత్మకచర్య కుదిగజారుతావని స్వప్నంలోనైనా భావించివుండలేదు.'—

అతడు అదేపనిగా తనకుజరిగిన అన్యాయాన్ని గురించి ఆలోచించడం ప్రారంభించాడు. తనమీదతనకే అసహ్యం వేసింది. ప్రేమఅనేది నిర్మలమైన ఒక పవిత్రబంధంగా మాత్రమే తనకు తెలుసు. కాని అట్టిప్రేమ కూడా ఇలాంటి కఠినశిక్షకుగురై వంచింపబడుతుందని తానింతవరకు ఎరిగివుండ లేదు.

రాజన్ తన్నుతానే నిందించుకుంటూ మంచంమీద నుంచిలేచాడు. కోపంతో అటూయిటూ చూచాడు, ఆయా ప్రక్కనే గుర్రుపెట్టి నిద్రపోతున్నది. గట్టిగా ఒక్కపిలుపు

పిలచి ఆయానులేపి 'నేను వెళ్ళిపోతున్నాను...'అని చెప్పి బయలుదేరాడు. అతనికాళ్ళు అదేపనిగా తడబడుతున్నాయి అయినప్పటికి అతను అలానే నడకసాగించాడు.

కమల వెళ్ళిపోయిం దగ్గరనుంచి రాజన్ జీవితం అతి విచిత్రంగా సాగిపోతోంది. కమలారాణి పరిచయంతోఏర్పడ్డ అతని ఉత్సాహం, కాంతి అంతా మటుమాయమైపోయింది అతనిప్పుడొక భయంకరమైన అగాధంలోకి వెళ్లిపోతూన్న ట్లుంది. క్రమంగా తీవ్రమైన అనిశ్చితస్థితిలోపడి తన్నుతానే విస్మృతి కుహరంలో పడవేసుకుంటున్నాడు. తన జీవనసహ చరిగా, ప్రాణప్రదమైన ప్రియురాలుగా, జీవితసర్వస్వంగా భావించుకున్న కమలనుగురించిన ఆలోచనలతోనే రోజంతా గడపడం ప్రారంభించాడు. కమలను ఎంత మరచిపోవాలన్నా అతను మరచిపోయే స్థితిలోలేడు. ఆవిణ్ని మరచిపోవాలని ఎన్నోవిధాల ప్రయత్నించాడు. కాని అవన్నీ వ్యర్థమై పోయాయి. కమలారాణి అతని సర్వాంగాల్లో అంతగాఇమిడి పోయింది. అతని ఆలోచనల మొత్తాన్ని ఆ ప్రణయదేవత వశపరచుకొంది. రాజన్ ఆమెను హృదయపూర్తిగా ప్రేమిం చాడు. ఆమెపైననే తన భవిష్యజ్జీవితాశలన్నీ కూర్చుకొని ఆనంద ప్రదమైన ఉజ్వల జీవితాన్ని గడుపుదామని భావిం చాడు. ఎన్నో స్వప్నాలను వాంఛించుకున్నాడు. అవన్నీ ఈనాడు అంతరించి పోయినయ్, ఆస్మృతులన్నీ ఈనాడు రాజన్నువిపరీతంగా కృంగదీస్తున్నాయి. ఆమెస్మృతిరాజన్కు

చీకటికుటిలా తయారైంది. అతను పూర్తిగా స్థిమితంతప్పిన పిచ్చివాడులా తయారైనాడు ... దుర్భరమైన జీవితాన్ని క్షణ మొక యుగంగా గడుపుతున్నాడు.

భరింపరాని ఆవేదనతో కమలారాణికొక ఉత్తరం వ్రాశాడు.

"కమలా ! నీవు నాతో చెప్పకుండా హఠాత్తుగా వెళ్ళినాజీవితంలో యెన్నడూ కలగని పెను తుఫానును సృష్టించావు. ఈ వియోగంలో చెప్పరాని బాధననుభవిస్తు న్నాను. నా పరిస్థితి పూర్తిగా అధ్వాన్నంగా తయారయి, దుర్భరమైన స్థితికి గురైంది. ఇంక ఈవిధంగా యెంతో కాలం జీవించివుండటం దుర్లభం. నన్నింతటి దుస్థితిపాలు చేసి, అన్యాయం చేసి నాఃనుండిదూరమైపోతావనీ, మనం కన్న కలలన్నీ నీమూలంగా మిథ్యాసోపానాలై పోతవనీ నేనెన్నడూ ఊహించలేను. నానుండి దూరమై అమూల్యమైన నాజీవి తాన్ని నిర్దయగా భగ్నంచేసి సర్వనాశనం చేస్తావని భావిం చలేదు— కమలా ! ఇదినీకు న్యాయం కాదు. వెంటనే బయలు దేరిరా ! నీవు అక్కడ కులాసాగా, హాయిగా ఆనం దంగానే ఉండవచ్చు. ఇక్కడ నాపరిస్థితి అతి దుర్భరంగా తయారైంది. నీకోసం కాక పోయినా నాకోసం- నాబ్రతుకు కోసం, నీవు తక్షణమే బయలుదేరి వస్తావు కదూ ? ఇప్పటి కైనా మించిపోయింది లేదు. నాప్రాణాలు శరీరంలో మిగిలే వున్నాయి. ప్రియతమా ! నీకోసం రెప్ప వాల్చకుండా నిరీ

చూస్తూ వుంటాను. ఇట్లు నీ రాజన్! అంటూ ఒక ఉత్తరం వ్రాశాడు.

రాత్రి రెండు ఘూముల్తైంది. కెప్టన్, కమల ఇద్దరూ సినిమానుంచి ఇంటికి చేరుకున్నారు. కమల ముఖం తేటగా ప్రకాశిస్తోంది. హృదయం చాలా తేలికగా వున్నట్లుంది. ఉత్సాహంతో అడుగులు వేస్తోంది. ఆమె గులాబీ పెదిమెలపై చిరుహాసం తొణికిసలాడుతోంది. కెప్టన్, కమల నడుము మీద చేయిమోపి తిన్నగా డ్రాయింగ్ రూంలోకి ప్రవేశించాడు.

డ్రాయరు మీద కమల అడ్రసులో వున్న ఒక వుత్తరం పడివుంది. ఆవుత్తరం తీసుకొని చించి చదువు కోవడం ప్రారంభించింది. చదువుచున్నంతసేపు ఆమె ముఖం ఎందుకో అదోరకంగా వుంది. ఉత్తరం పూర్తిచేసి ఫక్కున నవ్వడం ప్రారంభించింది, 'పిచ్చిరాజన్। ఏమిటీ వుత్తరం? చిత్రంగా వుంది. ఎంత అమాయకుడవు. ఇంత మాత్రానికే నీవిలా అయిపోతే ఇక జీవితం ఎలా గడుస్తుంది...? కమలా రాణికి నవ్వాగక ఆ ఉత్తరం డ్రాయరుమీద పడేసి, మంచం మీద వెల్లికిలా పడుకొని అదేపనిగా నవ్వడం ప్రారంభించింది.

కెప్టెన్‌కు అర్థంకాక కమలకేసి చూడడం ప్రారంభించాడు. కమల అలాగే నవ్వుతూ వ్రేలితో డ్రాయరుమీద విసిరేసిన వుత్తరం చూపెట్టింది. కెప్టెన్ ఉత్తరం తీసి చూచాడు... ఆయనకూ నవ్వాగక అదేపనిగా నవ్వడం ప్రారంభించాడు. ఇద్దరూ కొంచెంసేపు నవ్వాక కెప్టెన్ కమల

నుద్దేశిస్తూ "పోనీ ! కమలా ! నీవో ప్రత్యుత్తరం రాయకూడదూ? నీకోసం ఇంతగా ఇదౌతూన్నవాడాయె! ఈ సందర్భంగా తన రూపచిత్రానొకదాన్ని గీసుకొని, తన ప్రేమచిహ్నంగా ఏ ప్రదర్శనశాలకైనా పంపుకొంటే ప్రశంసలతో పాటు మంచి బహుమతికూడా లభించి కీర్తిప్రతిష్ఠలు ఇనుమడింపవచ్చు. — దాంతో బాగుపడిపోతాడు. పాపం! ఇంతకూ ఈ రాజన్ ఎవరు కమలా ?" అని ప్రశ్నించాడు.

"ఇతనూ నాకొక మిత్రుడే ... మంచి రచయిత కూడా—నేనంటే అతనికి అమితమైన ప్రేమ. — పోనీలే ఆగొడవ ! ఇంతకూ సినిమా ఎల్లావుంది ఫ్రెండ్ !..."

"బాగానేవుంది కాని నేనడిగినదానికి పూర్తిసమాధానం చెప్పలేదు. అయినా నాకెందుకుగాని, రాణీ! పాపం! అతనికి సమాధానంవ్రాయి తప్పకుండా !

"అంటే మీరు చెప్పినవిధంగానా ?"

"నీ యిష్టం..."

"బాగుంది నీసలహా! అయితే నా పేరుతో నీవే వ్రాయరాదూ ఒకజాబు !" అంటూ ఫక్కున నవ్వుతూ బాత్ రూంలోకి వెళ్ళిపొయింది కమల.

"ప్రియమైన రాజన్ ! నీవు ప్రేమతో వ్రాసినజాబు అందింది. నామూలంగా నీహృదయానికి తీరని గాయం తగిలినందుకు నేను బాధపడుతున్నాను. నిజాబునుబట్టి ఆలోచిస్తే ప్రస్తుతం నీకుసహచరి కాగలిగిన ఒక యువతి చాలా అవసరంగా కనపడుతున్నది. ఎక్కడో దూరంగావున్న నా

కోసం అదేపనిగా పరితపించి, కృశించిపోవడం నాకిష్టంలేదు. నీవు ప్రతిభకలిగిన ఉత్తమ కళాకారుడివి. హృదయాన్ని నిర్బల పరుచుకుంటావనుకోలేదు. నా వల్ల అనుకోకుండా నీకు జరిగిన అపకారానికి నన్ను మన్నించవలసినదిగా వేడుకుంటున్నాను. రాజన్! నీ హృదయాన్ని స్వస్థ పరచుకో జీవితంలో నీకు మళ్ళీ పూర్వపు ఔన్నత్యం కలగాలంటే, నా సూచనను తప్పకుండా పాటించు. అదేమిటంటే నీ రూప చిత్రాన్ని ప్రస్తుతం ఉన్నవిధంగా ఒకటి గీసుకొని అట్టిపెట్టు అవకాశం వుంటే ఏదైన ప్రదర్శనశాలకు పంపు. బహుశా ఆత్మీయానుభూతితో చిత్రించబడే ఆ చిత్రం నీ చిత్రకళాఖండాల్లోకెల్లా ఎన్నదగినది కావచ్చును. ఇక్కడ నేను క్షేమంగా వున్నాను...."



కెప్టన్, కమల యిద్దరూ కాశ్మీర్‌లో కులాసాగా వారంరోజులు గడిపారు. అందమైన కొండలోయల్లో. అంతులేని సౌందర్యాన్ని కొల్లగొంటూ ఉల్లాసంగా కాలక్షేపం చేయ్యాలని ఆవిడకుతూహాల పడుతోంది. కెప్టన్ ఈ ప్రాంతంలోని రమణీయమైన ప్రకృతి సౌకుమార్యంలో కమూలా రాణిలో కలిసిపోయి, కరిగిపోయి, ఆత్మానందాన్ని అనుభవించాలని కలలు కంటూన్నాడు. ఆమె అందచందాలు తన హృదయంలో నింపుకొని ఎంతగానో ఉవ్విళ్లూరుతున్నాడు.

కాని కమలకు ఈ లోని ఆశలు, ఆశయాలు బొత్తిగా తెలియవు. కెప్టెన్ ఎన్నోసార్లు ఆవిడనుసమీపిస్తూ స్పర్శానుభూతికై మరింత దగ్గరైనప్పటికీ, ఆమె ఒడుపుగా తప్పు

కొనేది. అతనితో కలిసివున్నంతసేపూ హృదయం విప్పి కులాసాగా మాట్లాడేది. కాని శారీరకమైన వాంఛలకెన్నడూ లోనుకాలేదు. అతనితో క్లబ్బులకెళ్ళేది. కారులో షికార్లు చేసేది. బోటులో నీటుగా విహరించేది. కాని అదంతా తన ఆత్మానందానుభూతికి మాత్రమే !

కెప్టెన్‌కు ఈస్థితి తరుచు బాధాకరంగావుండేది. ఇంత కలిసి మెలిసి వుంటూ, కమల ఈ విధంగా వుండడం అతనికి అంగీకార యోగ్యంగాలేదు. కమలకు ఈ విషయం తెలీదు. కాని ఎంతో విశ్వాస పాత్రంగా, పవిత్ర స్నేహితురాలిగా మాత్రం గోచరించింది.

కాశ్మీర్ జీవితం కమలకు విన్నూత్నమైన ఆనందాన్ని చేకూర్చి పెట్టింది. కెప్టెన్‌తో అనుకోకుండా ఇక్కడికివస్తానని తానుఊహించలేదు. తనను ప్రాణప్రదంగా ప్రేమించి, గౌర వించే రాజన్‌తో కనీసం తనప్రయాణం సంగతి చెప్పకుండా వచ్చేసింది. ఇది యెంతదారుణమైనదో తనకు ఇప్పుడు తెలిసి వస్తున్నది. అతనితో అమరప్రేమ సౌఖ్యాన్ని చూరగొనా లని వాంఛించి, అంతగా ప్రేమించిన తనరాజన్ లేఖను అనాలోచితంగా అపహాస్యం చేసింది. నిజంగా తానుచేసిన నేరం క్షమించరానిది. అంతేకాక అతనిలేఖకు కనీసం సమా ధానంకూడా వ్రాయలేదు.

కెప్టెన్ ప్రవర్తన క్రమంగా అర్థంకాజొచ్చింది. అతడు భౌతికమైన వాంఛల తీవ్రతకులోనై తనపట్లలేని ఆర్ద్రతను కల్పించుకొని, తనలైంగికకక్షను పూర్తిచేసుకొన దలుస్తున్నాడు. ఈకోరికలోనే అతను ఒక్కొక్కప్పుడు ప్రద

క్షించేమంకుతనం, మొరటుతనం ఎంతో అసహ్యంగా వుంటోంది, ఈవిధంగా యిక యితనితో వుండడం క్షేమకరం కాదనుకొంది. కెప్టెన్ ఘోరమైన కామతృష్ణకు బలై తనను తాను నాశనం చేసుకోవడానికి మనస్కరించలేదు. జీవితంలో తనుఒక నిర్దిష్టమైన ఆశయాదర్శాలతో ముందుకుపోతున్నది. తన గతజీవితంలో యెవరిమోసాలకు గురైనా, ఎన్నిరకాల భంగపాటులు కలిగినా, సత్యానికీ విశ్వాసానికీ యెన్నడూ విఘాతం కలిగించలేదు, ఎట్టి కష్టనిష్టూరాలు సంభవించినా సత్యాన్ని పాటించాలనే దృఢనిశ్చయంతో సాగిపోయింది. ఎన్నికష్టాలు వచ్చినా ఉజ్వలభవిష్యత్తుపై విశ్వాసం కలిగి సంచరిస్తున్న ధీరురాలు తన అదృష్టం ఫలించి రాజన్‌లాంటి ఉదాత్తవ్యక్తి పరిచయ భాగ్యం, ప్రణయభాగ్యం కలిగింది. దైవతుల్యుడైన ఆవ్యక్తి నిర్మల హృదయం లోతులు తాను బాగాతరచిచూచింది.ఎన్నోదివ్యానుభూతుల్నికన్నది. అతని జీవితంతో తనజీవితాన్నిముడివేసిఆనందప్రదమైనభవిష్యత్తును నిర్మించుకుందామనుకున్నది. కాని తనసహజమానసిక దౌర్బల్యంవల్ల బాల్యపరిచితుడైన కెప్టెన్ ఆహ్వానాన్ని కాదన లేక కాశ్మీర్ సందర్శనకు విచ్చేసింది. ఈ ప్రయాణంలో ఆసుందర భూమిసందర్శనమే తప్ప వేరే ఏఉద్దేశ్యమూ కాదు.

మొదటి విశ్వాస పాత్రుడుగా, సహృదయుడుగా కనిపించిన కెప్టెన్‌లో ఇప్పుడు తన యెడల అతనిలో అక్రమ వాంఛా ప్రలోభం కలిగివున్నట్లు ఈనాడు ఆమె స్పష్టంగా చూస్తోంది. కెప్టెన్ కాశ్మీర్ సుందరభూమిలో రకరకాల ఆకర్షణలలో కమల ప్రేమను, శారీరక సౌఖ్యానికి చూర

గొనాలని విశ్వప్రయత్నం చేశాడు. కాని అతని ప్రయత్నం లవలేశమైనా ఫలోన్ముఖం కాలేదు. చివరకు ఒక రోజు ధైర్యంచేసి కమలతో తన అభిప్రాయాన్ని బయటపెట్టాడు "కమలా! నీవెందుకో కొంచెం విచారంలో వున్నట్టున్నావు. రోజు రోజుకూ నీ ఆలోచనలు అదోవిధంగా వుంటున్నాయి. పరాకు బాగా హెచ్చింది. ఇది సరిగావడానికి ఒకే ఒక మందుంది. నీవు వెంటనే వివాహం చేసుకో. నీవు అన్యథా భావించక పోతే ఒకమాట చెబుతాను నేను నిన్ను వివాహ మాడాలను కుంటున్నాను."

ఈ మాటలకు కమల చిరునవ్వు నవ్వింది. ధీమాగా కెప్టెన్‌గారూ! నేను యిక్కడికి వచ్చింది మిమల్ని పెళ్ళాడ డానికి కాదండోయ్! ఆడది ఇతరులతో మాట్లాడడమూ, కనిపించడమూ, పాపమల్లేవుంది. వుండి వుండి మీకీ కోరిక కలిగిందే. నేను చాలా విచారిస్తున్నాను. మీకుఆశాభంగం కలిగిస్తున్నందుకు క్షమిస్తారుకదూ!"

"కెప్టెన్ కమలారాణి మాటలేవీ వినిపించుకోకుండా వృథాగా అనవసరమైన కబుర్లు చెబుతున్నావు కమలారాణి! నీవిషయం నాకు బాగా తెలుసు. పురుషుని సాహచర్యం లేని స్త్రీకి సమాజంలో యేవిధంగా గౌరవంవుంటుందో నీకు తెలియనిది కాదు. అయినా నీకా భావమ్మే లేకుంటే, నాతో కాశ్మీర్ ప్రయాణమే కట్టేదానివి కాదు. కమలా! ఇంకా నన్నెందుకు పరీక్షిస్తావు? నన్ను వివాహ మాడు-మన శాశ్వత ప్రణయబంధంలో జీవిత సౌఖ్యాన్ని స్వర్గతుల్యం చేసుకుందాం. ఇప్పటికే జీవితాన్ని చాలా నిర్లక్ష్యంచేసి

గడిపావు. ఇంకా ఇలాగే కొనసాగిస్తే లోకం నీమంచితనాన్ని శంకించి, నిన్ను అపఖ్యాతిపాలు జేస్తుంది" అన్నాడు ఆవేదన పూర్వకంగా.

ఈ మాటలు వినడంతోనే కమలకు ఎక్కడలేని కోపం వచ్చింది. ఆమె తక్షణమే క్రోధంతో ఉట్టిపడుతూ "నీవు సరసుడవూ, సహృదయుడవూ అని ఇన్నాళ్లూ విశ్వసించాను. నీ నీచమైన కోరికల్ని నేను అర్థం చేసుకోలేకపోయాను. ఛీ ! ఛీ!! ఇక నీస్నేహం ఎంతమాత్రం యోగ్యమైనదికాదు, దయచేసి నాయెదుటనుంచి వెళ్లిపో ! అని ఉరిమింది.

కెప్టెన్ ఏమీ తోణకలేదు. అతను చిరునవ్వు నవ్వసాగాడు. కమల అకస్మాత్తుగా తనపై విజృంభించింది ... కమల ఈ విధంగా తనను పురుగుకన్న హీనంగా చూస్తుందని అనుకోలేదు కెప్టెన్. అతని ముఖంపై ముచ్చెమటలు పోశాయి. అతని శరీరం వణకిపోసాగింది.

కమల మళ్ళీకోపంతో "చేసిన అనుచితాలికి క్షమాపణ చెప్పుకో. — ఇప్పుడన్నమాటలు వెనక్కు మళ్ళించుకొని మర్యాదగా నీదారిన నీవు పో ! బాల్యమిత్రుడివని నిన్ను ఈ మాత్రంతో వదిలిపెడుతున్నాను—" అంది.

కెప్టెన్‌కుతనచర్యపై పశ్చాత్తాపం కలిగింది. క్షమించు సోదరీ ! నిన్ను నేను తప్పుగా అర్థంచేసుకున్నాను. —నన్ను హృదయపూర్తిగా క్షమించు ... కమలారాణీ ! మరోమాట నీకు తెలియకుండా ఇంతకంటె ఘోరమైన తప్పిదం చేశాను. నీవురాజన్‌ను ప్రేమిస్తున్నావని, ఆప్రేమను భగ్నంచేసి నిన్ను నావైపుకి ఆకర్షించుకోవాలని ... నీ సంతకంతో

రాజన్‌కు మునుపు నీకు వ్రాసిన ఉత్తరానికి జవాబుగా వ్రాశాను. —— దానికి అతను ఒక వుత్తరం వ్రాశాడు. ఇదిగో ! ఆ వుత్తరం" అని ఒక చించిన కవరును ఇచ్చాడు కమల చేతికి.

కమల ఆత్రుతతో ఆవుత్తరంతీసి చదవడం ప్రారంభించింది.

ప్రియమైన కమలా !

నీవు ప్రేమతో వ్రాసిన వుత్తరం చేరింది. నీఉత్తరం నాకేమీ బాధకలిగించలేదు. నిరంతర బాధాపరితప్త హృదయుడ్నైననాకు ఇక బాధయొక్క స్వరూపం తెలుసుకొనే శక్తి లేదు. అందువల్ల నీ జాబు నాకు ఆశ్చర్యం కలిగించలేదు. నేను నిన్ను పొరపాటుగా అర్థం చేసుకున్నాను. అవసరమైన ఆశల్ని పెంచుకున్నాను. స్థాయిని, అంతస్థును, గుర్తించక చేసిన నా అనర్థానికృత్యానికి ఇప్పుడు ప్రతిఫలం బాగా అనుభవిస్తున్నాను. నా చిత్రాన్ని ఒకటి గీసుకొని చిత్ర ప్రదర్శన శాలకు పంపుకొని బహుమతిపొంది మంచిపేరు గడించమన్నావు. సంతోషం నీ సలహా తప్పక పాటిస్తాను. నీ మాట ఎప్పుడు కాదన్నాను. నీవు ప్రేమించావు. నేను ప్రేమించాను నీవు నన్నుచూసి నవ్వావు. నన్ను నవ్వించావు. నమ్మమన్నావు. నమ్మాను. నీవు చెప్పినవన్నీ చేశాను. ఇప్పుడు చేస్తాను కాని చివరిసారిగా నీమరు లేఖలో ఒక్కటి రాయమని ప్రాథేయపడుతున్నాను. అది వ్రాస్తే – నిజంగా నేను మంచిపేరు సంపాదించుకున్న వాణ్ణౌతాను. అదేమిటంటే – "నీవు తప్పకుండా నన్ను ధ్యానించుకుంటూ, ఏ రైలుక్రింద

నైనా పడిమరణించు –" అని మాత్రం. నీవు త్తరం చూచుకొని, మరుక్షణమే ఆ పని చేస్తాను. కమలారాణీ! ముమ్మాటికీ నన్ను నమ్ము. నీ జవాబుకై నీ ఆదేశానికై నిరీక్షిస్తాంటాను. – నీ రాజన్"

ఉత్తరం చూసి కమల కన్నీరు మున్నీరుగా ఏడ్చింది. "దుర్మార్గుడా! ఎంతపనిచేశావు. నీ స్వార్థంకోసం నన్ను నా రాజన్‌ను నాశనం చెయ్యడానికి పూనుకున్నావు. – పో! ముందిక్కణ్ణించి పో!" అని గర్జించింది.

"క్షమించు సోదరీ! నేను నీచుణ్ణి" అంటూ కెప్టెన్ అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

◆ ◆ ◆ ◆ ◆

"నన్నుమీరు మరచిపోయినట్టున్నారు మహాలక్ష్మి! ప్రేమికులు యింతకఠోరంగా వ్యవహరిస్తారని నేననుకోలేదు." అన్నాడు డాక్టరు రావు మహాలక్ష్మితో.

"కమలారాణి జాడ తెలీడంలేదు. అందుకని నేను మిమ్మల్ని కలుసుకోలేక పోతున్నాను." అంది మహాలక్ష్మి పరధ్యానంగా.

"మీరు కమలనుగురించే తీవ్రంగా ఆలోచిస్తున్నట్లున్నారు. ఇంకనేం! కమలనే పెళ్ళిచేసుకోండి!— " అన్నాడు డాక్టరు రావు.

"అదేమిటి డాక్టరుగారు: అదోచిత్రంగా మాట్లాడుతున్నారు—?"

"చిత్రంకాక మరేమిటి? లేకపోతే! కమలనే ఎందుకు ఇంతయిదిగా మననంచేసుకుంటారు."

"స్నేహితురాల్ని పదేపదే జ్ఞప్తి చేసుకోవడం తప్పా! ప్రేమించిన ప్రతివ్యక్తినీ పెండ్లి చేసుకోవాలనేనా మీతాత్పర్యం? "అంది నవ్వుతూ."

"ఊహూ! మీరు చాలాచురుకైనవారే. చూడండి మహాలక్ష్మీ! మీరు కనుపించకపోతే నాకెలాగో వుంటుంది. ఇంతకాలం ఎంతోకష్టంగా గడిపాను ప్రతిరోజూ వస్తారనే ఎదురు చూస్తున్నాను. కాని నాకు ప్రతిరోజూ ఆశాభంగమే కలిగిస్తున్నారు. — మహాలక్ష్మీ! మిమ్మల్నినే నెంతగా ప్రేమిస్తున్నానో మాటల్లో చెప్పలేను. అనుక్షణం పరితపించిపోతున్న నన్నుమీరిలా బాధపెట్టడం భావ్యంకాదు. ఇకనైనా దయవుంచి నన్ను మీవాణ్ణిగా స్వీకరించండి. మీ కష్టసుఖాల్లో నన్నుకూడా భాగస్వామిని చేసుకోండి!—" అన్నాడు మహాలక్ష్మిచేతిని తనచేతిలోకి తీసుకొంటూ.

మహాలక్ష్మిపరమానందంతో డాక్టర్ బాహుల్లోకి వంగింది. యవ్వనం ఎంతమహత్తరమైందో అందులో ప్రేమికుల జంట పరస్పరం ఏకాంతంలో వున్నప్పుడు ఎంత బలీయంగా వుండి, ఇద్దర్నీ శాసిస్తుందో మహాలక్ష్మికిప్పుడు తెలిసింది. కాని యెందుకో ఆమెహృదయంలోని ఒకానొక భాగంలో యేదో తుఫాను మానంగా వస్తూన్నట్లు లీలగా స్ఫురించసాగింది.

కమల తన ఆందోళనా పూరితమైన అనిశ్చిత పరిస్థితికి భయపడ్డది. ఆమె మనస్సు వికలమైపోయింది. పట్టరాని దుఃఖం ఆవరించి వేధించడం మొదలుపెట్టింది. రాజన్ పట్ల తానుచూపిన అవిధేయతకు చాలా నొచ్చుకుంది. తనకు

తెలియకుండా కెప్టెన్ తనపేరిట వ్రాసిన వుత్తరం రాజన్‌ను ఈపాటికి ఏస్థితిలోకి మార్చిందో! — ఆవిడకు ఏడుపాగ లేదు. వెక్కి వెక్కి ఏడవడం ప్రారంభించింది. అదేపనిగా రాజన్‌నుగురించి, తన అనుచిత ప్రవర్తనగురించీ వాపోవడం మొదలెట్టింది.

"రాజన్! ఇప్పుడు నీవెక్కడున్నావు? త్వరగా ఇక్కడికి బయలుదేరిరావూ! నేను నిన్ను మోసంచేశాను. కాని నీవంటే దురుద్దేశ్యంకాని, అయిష్టతకానీ లేదు రాజన్! నన్ను మన్నించు—ఇంక జీవితంలో ఇలాంటి పొరపాటు నేనెన్నడూ చేయను. నాసర్వాశలూ నీమీదే పెట్టుకున్నాను, నన్ను హృదయపూర్వకంగా క్షమించానని చెప్పు. నా తప్పిదాన్ని ఉదారహృదయంతో నీవు క్షమించగలవని నా విశ్వాసం. నీవునన్ను క్షమించకుంటే నాజీవితం శాశ్వతంగా అంధకారమయం కాకతప్పదు. తప్పక నీవు కనికరించదగిన నిస్సహాయురాలను. స్వచ్ఛదర్పణంలాంటిహృదయాన్నిమలిన పరిచాను. అనవసరమైన బాధకు గురిచేసి నా అవజ్ఞతను ప్రకటించుకొన్నాను. ఆశలో ఎప్పుడూ నీ అనుగ్రహం కోసమై ఎదురుచూస్తూవుంటాను రాజన్!..."

ఈ విధమైన ఆలోచనల్తో రాత్రి ఎలాగో గడిపింది కమలారాణి. ప్రొద్దున్నే లేచి వెంటనే రాజన్‌కు బయలుదేరి రావలసినదిగా టెలిగ్రాం యిచ్చింది. టెలిగ్రాం ఇచ్చిన తరువాత ఆమె హృదయభారంతగ్గి, యించుకంత తేటగించింది. తన రాజన్ తప్పకుండా వస్తాడని ఆమె నమ్మతోంది. కొండంత ఆశతో నిరీక్షిస్తోంది. ఎన్నోమధుర స్వప్నాలను కెన్నది.

జీవితంలో కావలసిన ప్రపంచానుభవం గడించింది. కమల రకరకాల వ్యక్తులు, వాళ్ళ మనస్తత్వాలు ఆలోచనా రీతులు అన్నీ ఆమెకిప్పుడు బాగా తెలుసు. తాను చూచినంతవరకు రాజన్ అన్నివిధాల ఉత్తమవ్యక్తి అని ఏనాడో నిశ్చయించుకుంది.

అందమైన, జీవితారామం యొక్క శోభ శాశ్వతంగా నిలిచిపోవాలంటే, స్త్రీ-పురుషులు పరస్పరం ఉత్తమ మానవత్వపు విలువల్ని గుర్తించి సమానమైన ఖచిని సక్రమ మార్గములో అలవర్చుకోవాల్సి వుంటుంది. ప్రపంచంపట్ల ఈర్ష్యా ద్వేషాలకు లోనై, తన స్వార్థం నిమిత్తం అనేక తప్పులు చేసి, వాటిని కప్పివేయడానికి ప్రయత్నం చేయడం కంటే నేరం మరొకటి వుండబోదు. కొందరు వ్యక్తులు తమ మానసిక ప్రవృత్తులనూ, మేధా సంపత్తినీ, దుష్టకార్యాలవైపుకి మొగ్గించి సమాజానికి పీడగా పరిణమిస్తారు. చివరికి ఏతీవ్ర శక్తో అణచివేస్తే నామ రూపాలులేకుండా అణగారిపోతారు.

ఉన్నత కుటుంబానికిచెంది, అనేకమైన గౌరవ మర్యాదలు పొందుతూ, ఆడంబరంగా జీవితం గడిపిన కలెక్టరు కూతురైవుండీ, కాలంచేసిన కన్నెర్జుకుబల్లై, అనేక కష్ట సమస్యలను ఎదుర్కొంది. సమాజంలోని ప్రతి ప్రవృత్తినీ ఆమెక్షుణ్ణంగా అర్థం చేసుకుంది. అయితే ఆది నుంచీ పురుష సమాజంతోనే ఎక్కువగా వ్యావహారిక సంబంధాలు, ఉద్యోగ సంబంధాలు వుండడం వల్ల, స్త్రీగా ఆమె యెక్కువ మోసాలకి గురై, తన స్వశక్తితో, సచ్ఛీలంతో ఆపదను తప్పుకోగలిగేది. అందువల్ల ఆమె యెప్పుడు

ష్మణ్ణీ అంత తేలిగ్గా విశ్వసించేది కాదు. ప్రతి విషయంలో ఆమెకు అనుమానం హెచ్చుతూవుండేది. ఆఫీసు కార్య నిర్వహణలో కూడా ఈ అనుమానమే హెచ్చుగావుండేది. కాని రాజన్ పరిచయం కలిగాక, అతనిపట్ల మొదట్లో కొంచెం అనుమానం వేసినా, క్రమంగా అది తొలగిపోయి పరమమైన విశ్వాసం నెలకొన్నది. నిర్మలత్వంతో యిరువురూ పరస్పరం ప్రేమించుకొని, నిర్మల హృదయంతో గౌరవించు కొన్నారు.

అనుకోకుండా కమలారాణికి చిన్ననాడు తనకు బాల్య మిత్రుడూ, దూరపుబంధువూ అయిన కెప్టెన్ వచ్చి కాశ్మీరు ప్రయాణానికి తనను అంగీకరింపజేశాడు. సహజంగా ఇలాంటి యాత్రా స్థలాలంటే మక్కువపడే కమలారాణి, కాశ్మీర్ యాత్ర తప్పక చేసితీరాలనుకుంది. వెంటనే ఆమె ప్రయా ణమై వెళ్ళింది. వెళ్లేప్పుడు ఆమెకు తననుగురించి తన రాజన్ ఎంత బాధపడతాడో. ఆయనకు కపీసం తెలియపరి స్తే నైనా బావుంటుందన్న స్వల్పాలోచనకూడా పోలేదు. ఈ తప్పిదానికి కాశ్మీర్‌లో కమల సరైన గుణపాఠం పొందింది. కమలను అపరిమితంగా కలచివేసి, కలవరపెట్టిన బాధంటూ వుంటే యిదే మొదటిది. తక్కిన వాటినన్నిటినీ ధైర్యంగా ఎదుర్కొంది. సాధారణ తరగతికి చెందిన వ్యక్తులు మాత్రమే కాకుండా, ఉన్నత శ్రేణిలోవున్నవారు విద్యా సంస్కార సంపన్నులనుకోబడేవారుకూడ మోసాలకూ విద్రో హాలకు దిగజారుతారని ఆవిడ అనుభవపూర్వకంగా తెలుసు కుంది. వ్యభిచారం, వంచన, విలాసాలకు, పవిత్రమైన

'ప్రేమ' అనే పేరును పెట్టి తమ దుర్మార్గాల్ని కొన సాగిస్తూంటారు.

రాజన్‌ను కలుసుకొని, తన హృదయంలోని ఆవేద నంతా చెప్పుకొని, తన తప్పిదానికి క్షమాపణ చెప్పుకో వాలని నిశ్చయించుకుంది. అదేవిషయం ఆవిణ్ణి అనేక విధాల బాధపెడుతోంది.

దైహిక వాంఛలకూ, ఆడంబరాలకు, హృదయ దౌర్బల్యాలకు, కృత్రిమ మనస్తత్వాలకూ, ప్రేమ అనే పవిత్రభావం అతీతంగా వుంటుందన్న విశ్వాసం ఆమెలో సుదృఢంగా పెనవేసుకొనివుంది. అంతరాత్మను అణచివేసి, ప్రేమ అనేది నెరపడం సరైన పద్ధతి కాదు. కమలకు తన గమ్యస్థానం, నిశ్చితాశయం తప్పకసిద్ధించగలదన్న పిశ్వాసం పూర్తిగావుంది. తన సర్వస్వాన్ని ఈ విషయమై రాజన్‌కు సమర్పించాలని నిశ్చయించుకుంది. రాజన్ రాకడ కోసం తదేకంగా ఆందోళన పడసాగింది.

అనుకోకుండా ఒకచోట ఆమెకు తనప్రాణస్నేహితు రాలు కనిపించింది. ఆశ్చర్యం, సంతోషం ఒక్కసారి అమాంతంగా "మహాలక్ష్మి!" అని కౌగలించుకొంది. మహా లక్ష్మి కమలారాణినిచూసి 'కన్నీరు పెట్టుకొంది. మహా లక్ష్మిని వారిస్తూ, "ఎందుకలా కంటినీరు పెట్టుకొంటున్నావు లక్ష్మి! ఊరుకో !—ఏమిటి ? ఏమన్నా కష్టంవచ్చిందా ? చెప్పు !—" అనిప్రశ్నించింది,

"ఏమీ చెప్పలేకుండావున్నాను కమలారాణీ! లోగ డనీవు నావిషయమై చెప్పినమాటలన్నీ నాకు అనుభవంలోకి

వచ్చాయి. డాక్టరును నేను యెంతగా విశ్వసించి, ప్రేమిం చింది నీకు బాగా తెలుసు. కాని నీవు చెప్పినట్లు పయోముఖ విషకుంభంఅనీ, మేకవన్నె పులిఅనీ, నేను అప్పట్లో గ్రహించ లేకపోయాను. నన్నూ, నాశీలాన్నీ, నాసర్వస్వాన్నీ వంచించి, నాశనంచేశాడు. నా ఆశలన్నీ నిరాశలై నిస్సారమైపోయాయి. ఎన్నో మధురస్వప్నాలు కన్న నేను, నరకాన్ని చూడ జొచ్చాను. అతనునన్నూ, నాఅంతరాత్మనీ జీవిత ధ్యేయాన్ని పతనోన్ముఖం చేశాడు. నా సౌందర్యాన్నీ, సౌభాగ్యాన్నీ, అక్రమంగా దోచుకున్నాడు. ఆదుర్మార్గుడు నన్ను జీవచ్ఛవంలా మార్చి వదిలిపెట్టాడు కమలారాణీ! "అంటూ మహాలక్ష్మి వెక్కి వెక్కి యేడవడం మొదలు పెట్టింది

కమల, ఆమెను ఓదారుస్తు "ఇప్పుడేం చేస్తున్నావు ఎలావున్నావు చెల్లీ!"

ఏమీలేదక్కా! ఇప్పుడు నేను అన్నిబంధాలునుంచీ విడివడి, హృదయాన్ని ధృడపరచుకొన్నాను.— పాప భాండాన్ని బద్దలుకొట్టి బయటపడగలిగాను. మాఅమ్మా, నాన్న ఎలాగో నన్ను దారిలోపెట్టి, ఒక సహృదయునికిచ్చి వివాహంచేసి పుణ్యంకట్టుకున్నారు. నిజంగా అక్కా! ఆయన నాపూర్వపుణ్యంకొద్దీ నాకులభించాడు. ఆయన మంచితనం ఇంతఅని చెప్పలేను. నిజంగా ఆయన నాఆరాధ్య దైవం అక్కా! కాని ఒక్కవిచారం మాత్రం నన్ను నిరంతరం వేధిస్తున్నది. ఆఘ్రాణితపుష్పాన్నై నానిజస్వరూపాన్ని దాచుకొని జీవితాంతం అతనితో సహచర్యం చేయడం, అతణ్ణివంచిస్తున్నట్లుగా భావిస్తున్నాను.

దుర్మార్గుడు వంచకుడూ, అయిన ఆ డాక్టర్ నన్ను ఎంతో నమ్మించాడు. అతని మాటల్లో నేను యెంతమాత్రం అంతరార్థం గ్రహించలేకపోయినాను. నేనేకాదు, బహుశా నా స్థానంలో మరెవ్వరున్నప్పటికీ అంతేననుకుంటాను. కార ణాము మోసాన్ని గుర్తించడం అంత తేలికపనికాదు. ముఖ్యంగా ఈరకమైన వంచనలు అర్థంచేసుకోనడం సాధ్యం కాదు. పెళ్లిచేసుకొని నిన్ను శాశ్వతంగా నా అర్థాంగిగా చేసుకుంటానని వాగ్దానం చేశాడు. నా ప్రతిమాటను, ప్రతి విషయాన్ని, ఎంతగానో ప్రశంసించి, వర్ణిస్తూండేవాడు. కాని కొంతకాలం తరువాత అతని హావభావాల్లో చిత్రమైన మార్పులు గోచరించాయి. నన్ను అతనొక సానిగా, వ్యభి చార స్త్రీగా, భాషించడం ప్రారంభించాడు.

"నీవు నాకక్కరలేదు. నీవంటి వ్యభిచార స్త్రీని నేను భార్యగా స్వీకరించదలచలేదు. నీవు కేవలం నీపశువాంఛను పూర్తి చేసుకోవడానికి నన్నాశ్రయించిన కాముకురాలివి. అంతే! వెళ్ళిపో! ..." అని క్రూరంగా నిందించాడు. కమలా! ఇంతటి ఘోరమైన దుస్థితి పాలుచేసి, నాశనం చేసిన ఆ నీచుణ్ని నేనేమనాలి? ఏం చెయ్యగలను? ఆవిధంగా కుళ్ళికుళ్ళి ఆత్మహత్య చేసుకుందామని ధృఢంగా నిశ్చయించుకున్నాను, నా పరిస్థితి స్థూలంగా కనిపెట్టిన నా తల్లిదండ్రులు నన్నువలాగో ఇతనికి పెళ్ళిచేశారు. నీవు నా నుండి దూరం అయ్యాక నా జీవితంలో ఎన్ని మార్పులు జరిగాయో, ఎన్నెన్ని కష్టాలనుభవించానో నీకు చెబితే నీవు ఆశ్చర్యపోతావు. అంతేకాదు నా దైన్యస్థితినిచూసి బాధపడతావు కమలారాణి!

మహాలక్ష్మి కంటినుండి కన్నీరు ధారగా ప్రవహించడము ప్రారంభించింది. — కమలారాణి ఆమె పెదాలని ముద్దుపెట్టుకొని సానునయంగా "చెల్లి! ఈ ప్రపంచం అంతాయింతే. అమాయకురాండ్రైన ఎందరు యువతులనో స్వార్థపరులిలా నాశనంచేసి, తమఅవసరాల్ని తీర్చుకున్నారు. సంఘం దృష్టిలో అతినీచమైన పనులు. కొనసాగిస్తూ, అలా స్ఫురించకుండా, వాటికి గౌరవనీయమైన రూపాలు కల్పించి, మోసగించడం వాళ్ళకు బాగా తెలుసు సమాజాన్ని ఈ విధమైన వంచనకు గురిచేసి, విలాసించడం వారికి బాగా పరిపాటయిపోయింది. ప్రేమ పేరిట ఆ పవిత్రమైన అనుబంధాన్ని వంచించడం జరుగుతున్నది. దైవాన్నిచూపించి నరకకూపంలోకి పడద్రోసేవాళ్ళు ఈ సమాజంలో చాలా మంది వున్నారు 'మంచి' అని భావించబడే అనేక విషయాల్లో, అసంఖ్యాకులైన అమాయకులనేకమందిని బలిపెట్టి, తమ స్వార్థాన్ని పూరించుకునే వ్యక్తుల విచిత్ర పాశవికస్థితి, వికృతరూపంలో బహిర్గతమౌతున్నది. చరిత్రలో యేన్నో అతిహృదయ విదారకమైన సంఘటనలు జరిగినవి. స్త్రీ పురుషుని చేతి విలాసవస్తువుగా తీరని అన్యాయానికి గురైంది. ఇట్టి నిజపరిస్థితుల్నికూడా చరిత్రకారులు చాలా మంది వ్రాయలేదుకూడా.

ఇంతెందుకు చెల్లీ! పురుష సమాజమే స్త్రీ యొక్క సామాజిక పతనానికి ముఖ్యకారణం. జరిగినవన్నీ మరచిపో చెల్లీ! అలా మరచిపోగలిగితేనే, ఈ ప్రపంచంలో బ్రతకడం మనబోటివాళ్ళకు సాధ్యం. ఇకనుంచి నీవు నీ ప్రియ సహచరునితో, నిశ్చింతగా జీవితంగడుపు. అదృష్టవశాత్తు అతను

నీకు అన్ని విధాలుగా అనుకూలుడుగానే వుండటం చాలా సంతోషకరం. నీ వైవాహిక జీవితాన్ని సుఖసంతోషాలతో గడుపుతూ, ఆదర్శప్రాయం చేసుకో. అనవసరంగా నీ భర్తను అనుమానాలకు గురిచేసి, అతని మనస్సును పాడుచేయకు. ఇంతకూ అతనెక్కడో నాకు పరిచయం చెయ్యకూడదు ?

"తప్పక అక్కా ! అంతకంటే కావల్సిందేముంది ? ఆయనిక్కడ ఒకటి కంపెనీలో ఉద్యోగం చేస్తూన్నారు." అంటూ మహాలక్ష్మి పర్సులోంచి ఒక కార్డుతీసి కమలారాణి కందిస్తూ "ఈ అడ్రసను కొచ్చేయి—" అని చెప్పి అక్కణ్ణించి కదలింది.



అతిలోక సుందరారామమైన కాశ్మీర్‌లో యింత వరకు తానుఆనందిస్తూన్న మనోహరమైన ప్రకృతిసౌందర్యం. యావత్తు కమలకు దుర్భరస్థితిని అనుదినం అధికం చేస్తున్నది. కాశ్మీర్ అందమంతా ఆవిడ కిప్పుడు దుస్సహ్యమై పోయింది దేంశలోని జనమంతా ఈప్రదేశానికి రావాలని ఎందుకంతగా తహ తహ లాడిపోతూంటారో ఆవిడకిప్పుడర్థమైంది. ఇది పూర్తిగా రొమాంటిక్ ప్రదేశం. ఇక్కడ, ఈ పవిత్ర భూమిలో జరిగే అక్రమ రొమాన్స్‌కు అంతులేదు. అంద మైన ఈ పైరుగాలుల్ని; పూదోటల్ని వీళ్ళు రకు పాదాల క్రిందనలి పేస్తారు.

కొంతమంది పైకి అమాయకులుగా. మంచివారుగా కనిపిస్తారు. వాళ్ళ మాటల వల్ల వాళ్ళు నిజంగా దేవుళ్ళ

లాంటివాళ్ళని పిస్తారు. కాని ఆ అమాయిక ముఖాలలో నిజ మైన అమాయికత, అందం, మంచితనం ఎక్కడా గోచరిం చదు. వాళ్ళ అంతర్గత ఆలోచనలు, వైఖరి, పైకి కనుపించే లక్షణాలకు పూర్తిగా భిన్నంగా వుంటాయి. కంటికి కను పించే ప్రతి అందమైన యువతిని తన ప్రియురాలుగా చేసు కోవాలని ప్రతి పురుషుడు ఉవ్విళ్లూరు తూంటాడు. వాళ్ళ అందాన్ని దోచుకోవాలన్న అక్రమ వాంఛ వారిలో నిరం తరం దోబూచులాడుతూంటుంది. వాళ్ళని వశం చేసుకోవ డానికి వీలైతే ఎంత ఖరీదైనా పెట్టి కొనాలని చూస్తుంటారు. స్త్రీలు—అందంగా పుట్టడమే పాపమల్లేవుంది.

మహాలక్ష్మి! వెళ్లిపోయిం తరువాత కమల మన స్సులో ఎన్నెన్నో, ఆలోచనలు రేకెత్తాయి, తన స్నేహితు రాలికి జరిగిన మోసానికి యెంతగానో చింతించింది. తాను కూడా జీవితంలో తన్నుఎంతగానో విశ్వసించిన రాజన్‌ను మోసంచేసి, చెప్పకుండా కాశ్మీరు వెళ్లిరాలేమా స్త్రీగా తాను చేసిందేమిటి? అందుకు తానిప్పుడు యెంతగానో చింతిస్తున్నది. అనుక్షణం అతని సందర్శనం కోసమే పరితపిస్తున్నది. అయితే జీవితంలో ఆమె పురుషులతో, స్త్రీలతో ఎవరితో మాట్లాడినప్పటికీ ఏమీ తేడాచూపించకపోవ డంఅనేది కొందరి పురుషులకు ఈమెపట్ల, అపార్థం చేసుకోవ డానికి అవకాశం లభించింది.—అంతేకాదు. ఆమెకు ఏదో రకంగా సన్నిహితులై వినియోగించుకోవాలనిచూసి పరా భూతులైనవారు, ఆవిడ్ని ఎన్నిచిక్కులకు, బాధలకు గురిచే శారు. ఆవిడ నిర్మలప్రేమను రాళ్ళతోకొట్టి శౌర్యం వెళ్ళ గక్కేవారు.

కాని రాజన్‌మటుకు ఆవిడలో క్రొత్తఆశలను, క్రొత్త జీవితాన్ని సృష్టించి, నిజమైన నిర్మల ప్రేమను అందించాడు. ఆ ప్రేమ పరమ పవిత్రమైన భావంతో కూడుకున్నట్టిది. వ్యక్తి గౌరవం, మర్యాద, సచ్ఛీలం అతనిలో నిండుగా వున్నవి. కాని ఐశ్వర్యం మాత్రం అతనికి అబ్బలేదు.— అయినప్పటికీ ఎవరినీ చేయిచాచి అడిగి జీవితం వెళ్ళబుచ్చు కునేస్వభావం కలవాడు మాత్రంకాదు. కథలు, కావ్యాలు, ఇతర సాహిత్యం పుష్కలంగా సృష్టించి తద్వారా లభించే పరిమితమైకంతోనే తనజీవితావసరాల్ని పూర్తిచేసుకొనే వాడు.

కమలతో రాజన్‌కు అనుకోకుండా జీవితపరిచయం లభించింది. ఆమెకూడా రాజన్‌ను నిర్వ్యాజంగా ప్రేమించి తనవాణ్ని చేసుకున్నది. వీళ్లిద్దరిప్రేమల్లో ఎలాంటి అక్రమ భావం జనించలేదెన్నడూ, ప్రేమ అనేది ఒకదివ్యానుబంధం అనీ, అది ఒక వ్యక్తిపై గాని, ఒక వస్తువుపై గాని, ఒకసారి ఏర్పడితే అది జీవితాంతం అలాగే నిర్వక్రంగా వుండిపో తుందనీ, మిగతావన్నీ కృత్రిమభావ ప్రేరితాలనీ, వాళ్ళ విశ్వాసం. రాజన్ అనేకపర్యాయాలు ఆయాసందర్భాల్లో కమలారాణి వేసే ప్రశ్నలకు ఈ సమాధానాన్ని ఇస్తూవ చ్చాడు.

ప్రేమ అనే రెండక్షరాలపేరిట లోకంలో ఎన్నో ప్ర వృత్తులు వ్యక్తిపరంగా, సంఘపరంగా, ఇంకా అనేకరకా లుగా పనిచేస్తున్నాయి. ఇవన్నీ వ్యవహారికంగా ఏర్పడ్డ అవ సరాలుగామాత్రమే గోచరిస్తాయి. ప్రేమ అన్నది సిగరెట్ వలె ఒక్కసారి పీల్చి అవతలపారేసేదిగా పై ప్రవృత్తులు

స్పష్టపరస్తూ, ప్రేమతత్వంపట్ల న్యూనతా భావాన్ని కలిగిస్తున్నాయి. నిజమైన ప్రేమ ఆత్మ సంబంధి ! అది అఖండమైన మానవాంతః కరణంలో, నిర్మలంగా, నిర్వ్యాజంగా జతగూడుతుంటుంది. స్నేహం, పరస్పర సహకారం, వాత్సల్యం వ్యావహారికంగా అందరితోనూ జరపవచ్చు, కాని ప్రేమఅలాజరపడానికివీలులేనట్టిది. అది ఆమరణాంతం కొనసాగింపబడే పవిత్ర అనుబంధం.

కొందరు కొన్ని నిముషాలవరకే ప్రేమకలాపం కొనసాగిస్తారు ముఖ్యంగా రోడ్‌సైడ్ రోమియోలు, ఈ రకమైన ప్రేమకు ప్రతినిధులు.

రాజన్‌కు యిలాంటి కృత్రిమప్రేమ జాడ్యాల తీరుతెన్నులు బాగా తెలుసు. ఇన్నీ తెలిసి అతను కమలారాణిని అమితంగా ప్రేమించాడు. కళాకారుడుగా అన్ని విషయాలు తెలుసుకొని ఆమెను ప్రేమించాడు. ఆ ప్రేమబంధం, జీవిత బంధంగా పెనవేసుకొంటే బావుంటుందని అభిలషించాడు. ఆ విధంగానే ఆవిడకు తన సర్వస్వాన్ని అంకితంచేశాడు కమలతో తాను సహజీవనం గడపడం, ఆవిడతో నిరంతరం సంభాషిస్తూండడం, అతనికెంతో ఆనందప్రదంగా వుటుంది. రాజన్ స్త్రీ, పురుష పవిత్రబంధాన్ని బాగా గుర్తించినవాడు. కాని సైతానులమాదిరిగా కేవలం క్షుద్రమైన కోరికలకు అంకితమై శోచనీయమైన జీవితం గడుపుతూన్న కాముకుడుగాదు. కమలతో అతని అనుబంధం పరమ పవిత్రమైనది. ధార్మికమైనది. మానవత్వానికి మారురూపమైన ప్రేమతత్వంతోనే కమలను అమితంగా అభిమానిస్తున్నాడు.

కమల కాశ్మీర్‌కు వెళ్ళిన తరువాత మొదటిసారిగా తన నిర్మల ప్రేమకు బహుమతి అన్నట్లు లభించిన ఉత్తరం అతణ్ణి తీరని నిరాశ పాలుచేసింది. ఆ వుత్తరం కమలారాణి స్నేహితుడు వ్రాసిన వుత్తరమని ఆయన అప్పుడు ఊహించ డానికి ఆస్కారం లేనందువల్ల రాజన్ కమలయొక్క విద్రోహ చింత ఎంత పరాకాష్టనందిందో ఊహించుకొని కృంగి పోయాడు. స్త్రీ మనస్తత్వం ఎంతభయంకరమైనదో రాజన్ ఊహించాడు.నిజమే : స్త్రీమూలంగా లోకంలో ఏం జరగ లేదు. వెర్రెత్తి ప్రపంచాన్ని తల్లక్రిందులుచేయగలిగింది స్త్రీ. మంచికీ, చెడుకీ సంపూర్ణశక్తిగా రూపొందగలదు స్త్రీ. అవును స్త్రీ మూలంగా ఎన్నో అనర్థాలు కలిగాయి. ఈనాడు తనకు కూడా అమితంగా ప్రేమించిన కమల తీరని అనర్థాన్ని కలిగించింది. తానేమీ తప్పు చేయలేదు. ఆవిణ్ణి ఏ విధంగానూ తృణీకరించలేదు. కాని తుదకు తననైజాన్నను సరించి ఈ వుత్తరం వ్రాసి తనను హేళన చేసింది.

ఏ అపకారమూ తలపెట్టని తన్ను ఈవిధమైన మోసా నికి గురిచెయ్యడమెందు చేతనో అతనికి బోధపడలేదు. కమలతో తాను అనవసరమైన సన్నిహితబంధం ఏర్పాటు చేసుకొని ఎంతో మోసపోయాడు. ప్రమాదకరమైన తప్పి దాన్ని చేశాడు. ఇతరులకు మార్గ దర్శకంగా వ్యవహరించ గల తాను, కమల చేతిలో కీలుబొమ్మ అయినాడు ఆమె తనను, తన చాకచక్యంతో ఒక ఆట ఆడించి వదిలి పెట్టింది. కాదు. అవతల విసిరి పారేసింది.

రాజన్, కమలారాణి సంతకంతో వున్న జాబు చూచి పలురకాలుగా ఆలోచించసాగాడు. చివరికి విసిగివే

పారిపోయాడు... అతను ఇంట్లోంచి అస్తమానం ఎక్కడికీ కదలకుండా అలాగే మౌనంగావుండసాగాడు. రాజన్ తన పడకగదిలో కూర్చుని ఏదో వ్రాస్తువుండగా అకస్మాత్తుగా కమలారాణి చెల్లెలు మోహిని అతని గదిలోకి ప్రవేశించింది రాజన్ వెనుదిరిగి చూచాడు," హలో మోహినీ! ఎప్పుడు దయచేశావిక్కడికి? అంతాబావున్నారా?" అని కుశల ప్రశ్నలు వేశాడు.

మోహిని రాజన్‌ను చూచి ఆశ్చర్య చకితురాలైంది. "రాజన్! ఏమిటిలావున్నావు. సంగతేమిటి? రత్నాలకాంతిని ప్రసరిస్తూండే నీ అందమైన కళ్ళు అలా కాంతివిహీనమై పాలిపోయివున్న వేం? తాజ్‌మహాల్ వంటి సుందరకళాఖండాన్ని ఆవిష్కరించ గలిగిన నీ అద్భుతమైన చాతుర్యం ఏమైపోయింది–? రసవంతమైన రచనలను సృష్టించ గల నీ లేఖనిమిన్నకున్న దేం రాజన్! నీ భవిష్యత్తు మీదనేనెన్నో ఆశలు పెట్టుకొన్నాను. నీవునాకు చేసినమేలు ఎన్నటికీ మరవలేను రాజన్! నా భవిష్యత్తుకీ? సుఖసంతోషాలకీ కారణభూతుడైన నీవిలా శోచనీయ పరిస్థితిలోవుంటే నాబోటిదానికెలా వుంటుందిచెప్పు బదర్! అహోరాత్రాలు నీవుకష్టపడి నా చదువు నిర్విఘ్నంగా కొనసాగాలని డబ్బు పంపావు. ఇలాంటి ఉదారహృదయుడివి, శీలవంతుడివీఅయిన నీవిలా ఎందుకు అయిపోయావు రాజన్! సవిస్తరంగాచెప్పు. కన్నతల్లి, అవమాన పరంపరల్ని భరించలేక మమ్మల్ని శాశ్వతంగా వదిలిపెట్టగా, ఆక్కజాడ తెలియకపోగా స్వంత అన్నయ్య దూరం తరిమెయ్యగా నన్ను నీ ఆదర హస్తాలు చాచి వెన్నుతట్టి, నాపోషణ బాధ్యతను స్వీకరించావు.

ఈనాడు నీదయవల్లే సుఖంగా జీవితం గడుపుతున్నాను. నేనూ జీవితారంభములో నీకువలెనే కొంతదెబ్బతిన్నాను. చెప్పు నీకోసం నేను ఏ త్యాగం చేయమన్నా చేస్తాను. ఇలా నీవు నీ బాధల్ని ఎవరితోనూ చెప్పకుండా చనిపోజూస్తే— నేనూ నీతోపాటే మరణించడానికి వెనుదీయను"

మోహిని వున్న ఆవేదనంతా ఒక్కసారి వెళ్ళ గ్రక్కింది. రాజన్ నిస్తేజమైన స్థితి ఆవిడకు అధిక విచార కారణమైంది.

చెల్లీ! ఊరికే అలా విచారపడి, ఆందోళనను పెంచుకోకు. కొంచెంసేపు నీవు విశ్రాంతి తీసుకో. ఆ తరువాత సవిస్తరంగా అన్నీ చెబుతాను అయినా అంత బాధపడవలసిన విషయమేమీలేదు. నేను కులాసాగానే వున్నాను." — అన్నాడు రాజన్.

"అది నిన్నుచూస్తూనే తెలుసుకున్నాను రాజన్! ఇక ఆవిషయంలో నీవేమీ దాచడానికి ప్రయత్నించకు. — నాప్రాణంకంటె విలువైన నీకోసం నేనేమైనా చేస్తాను.—" అంది,

రాజన్ అన్నివిషయాలు సవిస్తరంగా మోహినికి చెప్పాడు, తనవద్ద వుండిపోయిన కమలచిత్రపటం ఒకదాన్ని మోహినికి చూపించాడు. మోహిని అంతులేని దుఃఖంతో పరితపించసాగింది. తన అక్క చేసిన అనుచిత చర్యపట్లతీవ్రమైన జుగుప్స కలిగిందామెకు,

సాధుమూర్తి. ఉదారచరితుడూ అయిన రాజన్‌పట్ల చేసిన మోస కృత్యానికి ప్రతీకారం చెయ్యాలన్న

వ్యగ్రత కలిగిందామెకు. మోహిని ఈవిధంగా ఆలోచిస్తూండగానే మరొకవంక తమ బాల్యంలో సంఘటనలు ఒక్కొక్కటే జ్ఞాపకం రాసాగాయి. ఉన్నత కుటుంబములో పుట్టి, అతిగారాబంగా పెరిగి, చివరికి తమ తండ్రిగారి అక్రమచర్యల మూలంగా తనఅక్క, తనూ, తల్లీ తమ్ముళ్ళూ ఎన్ని బాధలు పడ్డదీ, ఎన్ని అవమానాలకు గురైందీ ఆమెకు జ్ఞప్తికి రాసాగాయి. అలాంటి పరిస్థితిలో ఎవరిదారి వారిదై పోయాక, కమలస్థితిగతులు కొద్ది కొద్దిగా ఆమెకు అప్పుడప్పుడూ తెలుస్తూవచ్చాయి, నిజానికి అక్కమాత్రం జీవితంలో ఎన్నికష్టాలకు, మోసాలకూ బలికాలేదు ?— ఆమెకూడా ఋజువర్తన కలిగినదే. ఆవిషయం తనకు తెలియనిదికాదు. ఆవిడలా మారిపోవడానికిగల కారణాలేమిటో ముందు ప్రశాంతంగా విచారించాలి. ఒకవేళ యేమైనా ఆమె తొందరపడి అనుచితచర్యకు దిగజారితే సరైనమార్గంలో పెట్టడానికి ప్రయత్నించాలికాని—ప్రతీకారం తీర్చుకొనడమేమిటి ? తనకంటే వయస్సులో, విజ్ఞానంలో, అనుభవంలోనూ పెద్దది. అయినప్పుడు ఆమెమీద తాను ఏవిధమైన ప్రతీకారం తీసుకొనగలదు.— ?

"అన్నట్లు ఇప్పుడు అక్క ఎక్కడవున్నట్లు యేంచేస్తున్నట్లు రాజన్ నీకేమైనా తెలుసా ?"

"ఏమో చెల్లీ ! కాశ్మీరసందర్శనంకోసం వెళ్ళిన మీ అక్క యింకాఇక్కడికి తిరిగిరాలేదు. — ఈమధ్య వెంటనే బయలుదేరి వస్తున్నానని ఒక జాబుమాత్రం వ్రాసింది. వివరాలేమీలేవు. బహుశా ఇవ్వాళో, రేపో రావచ్చును."

అన్నాడు.

"ఇంట్లో ఎవరున్నారు—?"

"ఆయావుంది—"

"అయితే వెళ్లొస్తా" నని మోహిని అక్కణ్ణించి భారంగా అడుగులువేస్తూ బయటకు నడిచింది.



కమలారాణి ఇంటిబయట ఎవరో తలుపుతట్టిన శబ్దం అయింది,

"ఎవరదీ ! లోపలికి రండి..." అన్నది కమలారాణి.

మోహిని తిన్నగా లోపలికి అడుగుపెట్టింది. కమల ఒక్కసారిగా మోహినిని చూసి ఆశ్చర్యపోయింది. సంతోషం పట్టలేక ఒక్కగంతువేసి చెల్లిని కావిలించుకొని ముద్దుపెట్టు కున్నది. "ఎన్నాళ్ళకు కనిపించావు పిచ్చిదానా ? బొత్తిగా నీ వార్త లేమీ తెలియ నివ్వడంలేదు. ఎంత ముద్దుగా వున్నావే నీవు, సృష్టిలోని అందమంతా నీదేనన్నట్లు తయా రయ్యావేమే నీవు మరీ ! ఇంతకు నీ అందాన్నంతా దోచు కున్న అదృష్టవంతుడెవరో తెలీనివ్వడంలేదు." అంటూ సంతోషంతో మోహిని ముంగురుల్ని ముద్దెట్టుకుంటూ "చెల్లీ–! పరిమళం గుప్పిస్తూన్న ఈ వెంట్రుకల్ని ఎంత అందంగామలిచావు ?" అని ఏమేమో అడిగేస్తున్నది కమలా రాణి చెల్లెల్ని.

మోహిని హృదయం మొదట్లో కొంచెం బెరుకుగా వున్నా ఆతరువాత అక్క సంతోషపూర్వకమైన మాటల్ని వింటూంటే క్రమంగా ప్రసన్నం అయింది.

మోహినీ ! చెప్పు ఇన్నాళ్ళూ నీ వెక్కడవున్నావు? మీ ఆయనేం చేస్తూంటారు ?—"

"అక్కా ? ఎంతకూనీగలగలే ఎక్కువవుతోంటే, ఇక నన్నెక్కడ చెప్పనిస్తున్నావు ? నీ ప్రశ్నలన్నీ కానివ్వు తర్వాత ఆలోచిద్దాం..." మోహిని కళ్ళల్లోంచి అశ్రువులు రాలు తున్నాయి.

"ఏమిటి చెల్లీ ! కన్నీరు పెడతావ్ ..."

"ఏమీ లేదక్కా ! నేను సరే ఎన్నో కష్టాలనుభవించాను. దేవుడి దయవల్ల అవన్నీ గట్టెక్కాయి. కాని యెల్లప్పుడూ నీ గురించిన ఆలోచనే నన్ను ఆందోళన పెడుతూ వుంటుంది. నీ వెలావున్నా, ఏం చేస్తున్నా నన్ను మాత్రం పూర్తిగా మరచి పోయినట్లున్నావక్కా ! అంతే కాదు. గౌరవంగా బ్రతికిన మనకుటుంబంయొక్క గౌరవ ప్రతిష్ఠ లెలాగూ గంగలో కలిశాయి. మనవ్యక్తిగత అభిమాన గౌరవాలైనా చక్కగా కాపాడుకొని, సమాజంలో కనీసగౌరవ మర్యాదలతోనైనా బ్రతకడానికి వీల్లేదంటావా ? అక్కా !" అంటూ ఏడ్వసాగింది - మోహిని.

"చెల్లీ! నీవేంమాట్లాడుతున్నావో నాకేమీ అర్థం కావడం లేదమ్మా! సూటిగా చెప్పు!"

"ఏం చెప్పమన్నావక్కా! ఉత్తముడు, పరమసాధుమూర్తి అయిన రాజన్ నీకేం అపకారం చేశాడని అలా మోసగించి వెళ్ళావు. అంతేకాదు. అతిలజ్జాకరమైన ఉత్తరం వ్రాసి నీఅప్పతాన్నిప్పు ప్రదర్శించుకున్నావు. ఇది నిజం కాదా?" మోహిని కొంచెం ఆవేశపడి అన్నది.

కమల ఆవేశంతో పాటు దుఃఖం ఆగలేదు. "పొరపడు తున్నావు చెల్లీ! నేను రాజన్‌కు ఎలాంటి ద్రోహం చెయ్య లేదు. నేనే దుర్మార్గులచే వంచించబడ్డాను. బాల్యమిత్రుడని నమ్మి అతనితో కాశ్మీర్ యాత్ర చేసి వద్దామని మాత్రమే వెళ్ళాను. ఇంతవరకు నేను తొందరపడ్డ మాట మాత్రం యదార్థమే. ఆ తరువాత జరిగిన దుష్పరిణామాలూ, పురుషులు నిస్సహాయురాలైన స్త్రీ పట్ల కలిగివుండే చులకన స్వభావం నాకు తరువాత కెప్టెన్ ద్వారా మరొకసారి స్పష్టంగా అర్థమైంది. నీవు అన్నట్లు ఆవుత్తరం నేను వ్రాయ లేదు చెల్లీ నా విషయం నీకు బాగా తెలుసు. ఇల్లాంటి విష యాల్లో నేను చాలా ఖచ్చితంగా వుంటానని కూడా నీకు తెలుసు. కాని దుర్మార్గుడు ఆ కెప్టెన్ చేసిన కృత్యమిది. నాకు తెలియకుండా నా సంతకముతో జాబు వ్రాసి రాజన్‌కు పోస్టు చేసినన్నా వంచించాడా దుర్మార్గుడు—"

"అయితే నీవు అక్కడ వున్నన్నాళ్లూ రాజన్‌కు ఒక్క వుత్తరమైన ఎందుకు వ్రాయలేదు—? అతను నీకోసం ఎంత పరితపించిపోయాడో! నీవు సృష్టించిన పెనుతుఫానులో ఏ మూలకు కొట్టుకొని పోయాడో నీకేమైన తెలుసా? అతణ్ణి ప్రాణ ప్రదంగా ప్రేమించానని చెబుతూ నీవు జరిపిన సత్కారం అలాంటిదేనా అక్కా!"

"లేదు చెల్లీ! నేను అలా అతణ్ణెన్నడూ అవమానిద్దా మనికాదు. ఎలాగూ వెళతాను గదా అని ఎప్పటికప్పుడు వుత్తరం వ్రాయడం వాయిదా వేస్తూండే దానిని అంతే అంతకు మించి మరే వుద్దేశ్యం నాకులేదు."

"నాకు ఇప్పటికీ నీ ప్రవర్తనపట్ల విశ్వాసం కలగడం లేదు రాజన్‌ను నీవు సామాన్యుడిలా భావించావు... అతణ్ణి నిర్లక్ష్యంచేసి, నీయిష్టంవచ్చినట్లు ప్రవర్తించి అగౌరవ పరిచావు. నీస్వార్థానికి బలిచేదామన్న చెడుతలంపుతో నీవిన్నాళ్ళూ అతనితో స్నేహంచేశావు. నేనుచాలా అనుభవజ్ఞురాలినని గర్విస్తావు. శీలవతిగా నటిస్తావు. నిజానికి అవేవీ నీలోలేవు. నిర్మలమైన ప్రేమను మోసంతో వంచించలేము. అక్కా ! నీవు రాజన్‌ను తృణీకరించినా అతనుమట్టుకునీపట్ల గల సౌజన్యాన్ని వీడలేదు. కాని నీ ప్రవర్తనకై తీరని ఆందోళ చెందుతున్నాడు — ఎంతపని చేశావక్కా నీవు!"

కమల మోహిని ఆవేదన పూరితమైన హితోక్తికి కొంచెం చలించింది... దాంతోపాటు పశ్చాత్తాపం కూడా హెచ్చింది.

ఉద్వేగపూరిత హృదయంతో, మోహినీ! నన్ను మన్నించు చెల్లీ ! నిజంగా నేను నికృష్టురాలిని. జీవితంలో ఒక పుణ్యమూర్తి హృదయాన్ని గాయపరచి క్షమించరాని అపకారం చేశాను.—"

"ఇప్పటికైనా నీకు నీప్రవర్తనపట్ల పశ్చాత్తాపంకలిగి, జ్ఞానోదయం జరిగినందుకు నేను సంతోషిస్తున్నానక్కా ! జీవితంలో మధురాతి మధురమైన ఉజ్వల భవితవ్యాన్ని ధ్యేయంగాపెట్టుకొనకుండా. తెలివితేటల్ని భగవంతుడిచ్చిన మేధాసంపత్తినీ, ఐశ్వర్యాన్ని చెడుమార్గాల్లో ఖర్చుపెట్టి ఎందుకూ కొరగాని ఆలోచనలతో వ్యర్థం చేసుకోవడం విజ్ఞత గలిగిననీలాంటిదానికితగదు. నాన్నగారు తనజీవితంలో

చేసిన అనుచిత కృత్యాల పర్యవసానం మనం కళ్ళారా చూశ్లేదూ! ఏమైంది? చివరకాయన అధికారం, అభిజాత్యం, ఐశ్వర్యం, కలుకుబడీ యావత్తూ ... తుడిచిపెట్టుకొనిపోలేదూ! అక్కా! వెంటనే ఆమధురమూర్తి వద్దకువెళ్ళి, ఆయనపాదాల మీదపడి క్షమాపణ వేడుకో, పశ్చాత్తాప భారంతో కృంగికృశించేకంటే, ప్రస్తుతం నీ విప్పుడు చేయవలసిన తక్షణకార్యం అదే. ఆ అమృతహృదయుడు తప్పకుండా నిన్ను పరిగ్రహిస్తాడు. అనవరతం నీకోసం, నీభవిష్యత్తుకోసమే నిరంతరం పరితపిస్తూ మౌనంగా చీకటి గదిలో కాలక్షేపం చేస్తూన్నాడు ... వెళ్ళక్కా ! వెంటనేవెళ్ళు ..."

"తప్పకుండా వెడతాను చెల్లీ ! ఇంతకూ నీకురాజశేఖర్తో పరిచయమెలా ఏర్పడిందో చెప్పావుగాదు" ప్రశ్నించింది కమలారాణి.

"నీకు తెలియదా అక్కా ! అతను మెట్రిక్యులేషన్‌లో నాక్లాసుమేటు. అప్పటినుంచీ అతను నాకు చాలా పరిచయం. ఆయనప్రోత్సాహం, సహకారం మూలంగానే నేను ఎం. ఎ డిగ్రీ తీసుకొన్నాను. ఆయనదయవల్లనే నావివాహం ఉన్నత కుటుంబానికి చెందిన ఒకమంచి యువకునితో జరిగింది. నాసుఖసంతోషాలకు పూర్తిగా రాజన్ కారకుడు. ఇప్పుడు నేను మదన్‌పూర్ Women wel fare officer గా పనిచేస్తున్నానక్కా! అలాంటి సత్పురుషుణ్ణి నీవు అనవసరంగా గాయపరిచావు. ఆయనఋణం ఈజన్మలో తీర్చుకోలేం అక్కా ! ఇప్పటికైనా నీపొరపాటును. సరిదిద్దుకొని, అతణ్ణి పెళ్ళాడి సుఖిస్తావని ఆశిస్తున్నాను. అంది మోహిని.

కమల అత్యంత నమ్రభావంతో తలవంచుకొని "చెల్లీ ! నీవు చిన్నదానివైనా విశాలమైన లోకానుభవాన్ని గడించావు. భగవంతుడు చాలా చిత్రమైనవాడు. అంతే కాదు. కరుణామూర్తికూడా. కాబట్టే దారీతెన్నూ లేకుండా పతనావస్థకు చేరుకున్న జీవితాన్ని మళ్ళీఒక చక్కని మార్గంలో పెట్టి, రక్షిస్తున్నందుకు ఆనందంగావుంది. ఆ దయామయుడు నన్నెందుకో అనేకసార్లు ఆపదలకు గురిచేసి తిరిగి అభయహస్తమిచ్చి కాపాడుతున్నాడు. నా స్వంత చెల్లెలైన నీకెలాంటి తోడ్పాటు యివ్వలేక పోయినప్పటికీ, అతను తోడబుట్టిన అన్నలా ఆదరించి నీ అభివృద్ధికి కారకుడై నాడు. నిజంగా రాజన్ ఎంత సత్పురుషుడు చెల్లీ ! అలాంటి వ్యక్తులు లోకంలో చాలా దుర్లభం" అంది.

కమల రాజన్‌కు లోలోపలే క్షమాపణ చెప్పుకుంది. ఆమె శరీరం ఆపాదమస్తకం యేదో భయంతో కంపించి పోసాగింది. మోహిని మౌనంగా కొంతసేపు కమలనిచూస్తూ నిలుచుండిపోయింది. ఆమె తన అక్కలో కలగిన పశ్చాత్తాపాన్ని గురించి ఆలోచిస్తోంది.

"అన్నయ్యఆచూకీ యెక్కడైనా తెలిసిందాచెల్లీ?" అని ప్రశ్నించింది కమలారాణీ.

ఎందుకు తెలియదక్కా ! మరిచిపోయాను – ఆయన్ని కూడా రాజన్‌బాబు చక్కని మార్గంలోపెట్టి ఒకమనిషిగా మార్చారు. ఆయన మహాలక్ష్మి అనే అమ్మాయిని పెళ్లి చేసుకొని సుఖంగా వున్నాడు. అన్నట్లు నీకు కాశ్మీర్‌లో ఎక్కడా తటస్థపడలేదా ? అక్కడ ఒకానొక కంపెనీలో

మేనేజరుగా పనిచేస్తున్నాడు. మునుపటి అతని స్వరూపం పూర్తిగా మారిపోయింది ఇప్పుడు యజమానులకుఅత్యంత విశ్వాసపాత్రుడైన వ్యక్తిగా, మంచిపేరు ప్రతిష్ఠలు సంపాదించు కున్నాడు — ”

“అరెరే ! మహాలక్ష్మి అన్నయ్యను పెళ్ళాడిందా ? ఎంతపనిచేసిందదీ !... నాకు తెలీకండానే ఈకొద్దికాలంలో ఎంతగందరగోళం జరిగింది. చిత్రంగా వున్నాయి ఈ విషయాలన్నీ. ఈమధ్య మహాలక్ష్మిమాత్రం కాశ్మీరులో కలిసింది కాని తన భర్తపేరు చెప్పలేదు. పరిచయం చేస్తానని నాకుఅడ్రసుకార్డు ఇచ్చివెళ్లింది ... కాని మళ్ళీ కలుసుకో లేకపోయాను ... ఎంత దొంగవే మహాలక్ష్మి ! నీవు—. అంతా బాగానే జరిగింది చెల్లీ ! పాపం ! మహాలక్ష్మికూడా చాలా బాధలు పడ్డది. అమాయికమైనపిల్ల” అని రాజన్నుద్దేశిస్తూ “రాజన్ ! నీవెంతటి అమృత హృదయుడివి ... నీవు నిజంగా మా ఆరాధ్యదైవానివి. — నీఋణాన్ని ఎన్ని జన్మలకైనా తీర్చుకోలేము డియర్ ?” అంటూ కండ్లు మూసుకొని చేతులుమోడ్చి నమస్కరించింది.

ఇంతలో రాజన్ అనుకోకుండా బాణంలా లోనికి దూసుకొని వచ్చాడు. “ఆఁ ! ఆఁ ! అంతగా నన్ను ప్రశంసించకు ... ఆప్రశంసలన్నిటికీ నేను పాత్రుణ్ణికాలేను. లోగడ కూడా నన్ను ఈవిధంగా ప్రశంసించి — ఈస్థితికి తీసుకొని వచ్చావు, — పొగడ్తలు మితిమీరి చెయ్యడమంటే దాని వెనుక మితిమీరిన స్వార్థం వున్నదన్నమాట. నేను మరిచిపోను కమలారాణీ ! “అన్నాడు రాజన్ స్ఫుటంగా ఆవిడ కళ్ళలోకిచూస్తూ.

"కమల విప్ఫారిత కళ్ళతో రాజన్‌ను చూస్తూ" నన్ను మన్నించు రాజన్ ! నీవంతిగా నన్ను శపించకు... జరిగిన దానికి నేనుచాలావిచారిస్తున్నాను. ఇక నన్నుగురించి నీవే మాత్రంశంకించవద్దని హృదయపూర్వకంగా కోరుతున్నాను. నామూలంగా నీకుకలిగినగాయానికి నా హృదయం అర్పించి మాన్పుతాననే విశ్వాసంవుంది రాజన్ ? ఇకనుంచి యెన్నడు నీకుదూరంగా మనలేను. సుందర కాశ్మీరు భూలోకనందనాన్ని చూడాలని వెళ్లి నేను ఎంతనరకతుల్యమైన జీవితాన్ని గడిపానో వర్ణించలేను. కేప్టెన్ నాసంతకంతో నన్ను వంచించి నీకు లేఖవ్రాసి మనిద్దరి అనురాగబంధాన్ని త్రెంచాలని చూశాడు. కాని ఆతరువాత అతని వంచనచూసి, నాలోనే నేకృంగిపోయాను. చేసేదిలేక చివరికి ఆత్మహత్యకూడ చేసుకోవాలనుకున్నాను. కాని విధివశాత్తు అలాజరుగలేదు ... రాజన్ ! నన్నుక్షమించవూ ! నీనిరంతర సాహచర్యంలో ఇక ఎంతి దుర్ఘటనకార్యాన్నైనా సాధించగలను, ఎన్నికష్టాలైనా ఎదుర్కొనగలను, నన్నుక్షమించి, నీ జీవితభాగస్వామినిగా స్వీకరించు రాజన్ ! ఆజన్మాంతం నీపాదదాసిగా వుంటాను ... అంటూ కమలారాణి రాజన్‌పాదాలపై వ్రాలింది.

రాజన్ చేతులతో కమలారాణిని లేవనెత్తుతూ "విచారించకు కమలా ! ఇంకనీవు శాశ్వితంగా నారాణివే ! నేనన్నివిషయాలు ఎప్పుడోమరచిపోయాను. మీ చెల్లి వచ్చి నిన్ను నాకు మరీ సన్నిహితురాల్ని చేసింది..." అంటూ తన బాహువుల్లోకి తీసుకున్నాడు.

కమల పరమానందంతో రాజన్ బాహువుల్లో ఒదిగి పోయింది.

ఇద్దరి మధురమైన కలయిక మోహినికి ఎంతో ముచ్చటనిపించింది. ఆవిడ కన్నుల్లో ఆనందాశ్రువులు నిండాయి. వెంటనే కమలారాణి చెయ్యిపట్టుకొని "పద !- నీవు నాకు అక్కవైనా ఒకవిధంగా వదినెవుకూడ. పెళ్లి కూతుర్ని చేశాక, పూలహారాలు వేసుకున్నదాక, విందులు, వినోదాలు అన్నీ జరిగాక మీరుమాట్లాడుకోవచ్చును. అంత దాక మీరిద్దరు మేము చెప్పినట్లు నడుచుకోవాలి... అంతే !" అంటూ బలవంతంగా లాక్కెళ్లింది... కమల భారంగా అడుగులువేస్తూ "బాగుంది నీవరుస" అని పక్కుననవ్వింది.

రాత్రి మహాలక్ష్మి, మోహిని భర్త రాంస్వరూప్, కమలారాణి తోడబుట్టిన సోదరుడు రమేశ్ బాబు, అందరూ ఒక్కసారే వచ్చేశారు. మోహిని, కమలకు పెండ్లి ముస్తాబంతా చేసి సిద్ధంగా వుంచింది. రాజన్‌ను పిలిచి "రాజన్ అక్క ఇప్పుడెలావుందో చెప్పు!" అని అడిగింది.

రాజన్ మరో వైపు దృష్టిని పెడుతూ "ఎలావుందో నేనెలా చెప్పగలను. నేను కథా రచయితని, పువ్వుల్ని ప్రేమించిన హృదయంతోనే వాటితోపాటు పుట్టినముళ్ళని కూడా ప్రేమిస్తాన్. సత్యం సహజత్వం మూర్తీభవించిన ప్రతి వస్తువునూ, నేను ప్రేమతోనే చూస్తాను. 'మీ అక్క నా జీవితం తో తన జీవిత సర్వస్వాన్నీ ముడిపెట్టుకొనే

జీవన సహచరి, ఆవిడలో కంటకాలూ వున్నాయి. కుసు-మాలు వున్నాయి. సమాన దృష్టితో ప్రేమిస్తాను ఆమె-హృదయం ఎవరెన్ని చెప్పినా, నిరంతరం రొద చేస్తూ, సంచరించే అలల కడలిలాంటిది. అదేనాకు చాలా యిష్టం. అందుకనే ఆవిడనన్ను వదలిపెట్టి వెళ్ళినా, అగౌరవ పరచి-నట్టు తోచినా నేనేమీ నొచ్చుకోలేదు. జీవితంలో నేను కష్టసుఖాలలో ఆత్మీయ బాంధవ్యం ఎన్నడూ పెంచుకోలేదు. అలా పెంచుకోవడం అంత శుద్ధ పొరపాటు మరోటి వుండదు కూడా." రాజన్ ఎంతో నిగ్రహం ప్రదర్శించి మోహిని వేపుచూస్తు అన్నాడు.

కమలారాణి, రాజన్ పాదాలని మరోమారు స్పృశించి కళ్ళకు అద్దుకుంది.

కమలా, రాజన్‌ల వివాహం వైభవోపేతంగా జరి-గింది. ఇద్దరు దంపతులు, వినూత్నమైన అందచందాలతో శోభాయమానంగా వున్నారు.

"ఇది స్వప్నం కాదుకదా రాజన్!" ఆశ్చర్యంతో అడిగింది కమల.

"కలకాదు కమలా!— ఇదంతానిజమే! —" అన్నాడు రాజన్ నవ్వుతూ:

"నేను నీకష్టూరాలనేనా? రాజన్!"

"అదేమిటి కమలా! అన్నివిధాలా నీ నిర్మల హృదయం నాకునచ్చింది. నీ నిర్మల హృదయంతోపాటు నీ అల్లరితనం, అందమైన నీ నీలాలకళ్లు, విశాలమైన నీనుదురు, అన్నీ నన్నుముగ్ధుణ్ణి చేస్తున్నాయి. అప్సరసలుకూడా బహుశా నీ అంత అందంగా వుండరేమో ననిపిస్తుంది. నావంటి అమాయక హృదయాన్ని మాయచేసిన నీకళ్లు ఎంతచిలిపిగా వున్నాయనుకున్నావు? అదుగో! నీముఖంమీద గులాబీ రంగులా పేర్కొన్న సిగ్గునిగ్గులు ఎంత బాగున్నాయను కున్నావు—? కాని ఒక్కమార్పు మటుకునీలో క్రొత్తగా చూస్తున్నాను."

"ఏమిటో ఆమార్పు!"

"ఏమీలేదు.— మునపటికంటెకాస్త లావైనావు."

కమలారాణి ఈమాటకు ఫక్కునవ్వింది. సంతోషం పట్టలేక రాజన్ చెంపల్ని, పెదవుల్ని మునివ్రేళ్ళతో తాకింది. రాజన్‌కూడా ఒక పొడవైన నిశ్వాసంచేసి కమలా రాణిని కౌగలించుకొన్నాడు.— రాత్రి చాలాగడచి పోయింది.

కమలారాణి హృదయంఅంతా పట్టరాని సంతోషం తోనిండిపోయింది. చిరకాలంగా తాను కన్నకలలన్నీ ఈ నాడు ఫలోన్ముఖం అయ్యాయి.— గడచిన కష్టాల పరంపర లేవీ ఇప్పుడుఆవిడమనస్సులోలేవు. తాను హృదయపూర్వకం గా ప్రేమించి, ఆశించిన ప్రియుడు తనను వివాహమాడాడు. అంతకంటేఆమె తనజీవితంలో కావాలని కోరుకున్న దికూడా మరేదీలేదు. ఎన్నోతీరని సమస్యలతో గత ఏడెనిమిది సంవ

త్సరాలుగా వ్యథ చెందుతూన్న ఆవిడహృదయం, పూర్తిగా శాంతించి, ఉత్సాహంతో ఉరకలు పెడుతున్నది. ఒక క్రొత్త జీవనాధ్యాయం ఈనాటికి ఆరంభమైందని ఆమె భావించింది.

రాజన్ కూడా ఎంతో ఆనందంలో తేలపోతున్నాడు. కమలారాణీ తననుండి దూరమైనప్పటినుండి ఏదోఎత్తైన కొండమీదించి అగాధంలోకి త్రోయబడిన వాడిలా అయి, చీకటి జీవితం గడుపుతున్నాడింతవరకూ. కమలారాణి తిరిగి తనను సమీపించి, పెళ్లాడి పరితాపం పోగొట్టినందుకు, తన జీవితం చరితార్థమైనట్లుగా భావింపసాగాడు. అతనిలో ఇప్పుడు ఇదివరకులేని అపారమైన చైతన్యశక్తి ప్రవేశించినట్లైంది. ఇక సుఖమయ సమాజ నిర్మాణానికి కలాన్ని, హలాన్నీ కూడా శక్తివంతంగా నడపగల ధైర్యం హెచ్చింది.

ఇంతలో మోహిని వారిని సమీపించి ఇద్దరి భుజాలు పట్టుకొని లేవదీస్తూ చాలా రాత్రయింది. లెండి! వెళ్ళి పండుకోండి! ... " అంటూ, గదివేపుకి గెంటివేసింది.

దంపతులిద్దరూ పక పక నవ్వుతూ వెళ్లిపోయారు.

సమాప్తం

